# చతుర

ఫిబ్రవరి 2015

రూ. 15/-

జన్మదిన
ప్రత్యేక
సంచిక

✦ పాలంకి సత్య
మారీచ మార్గం .. 6

✦ నవలావలోకనం
ఏటి ఒడ్డున నీటిపూలు .. 119

**Sunflame®**
THE CLEAR CHOICE

# Super Saver OFFERS

## Liva 60 SS BF



WITH BAFFLE FILTER

Suction 700 m³/hr

~~MRP. ₹ 14,990/-~~*

**Offer Price ₹ 6,990/-****

## Iris 60 BK BF



WITH BAFFLE FILTER

Suction 1100 m³/hr

~~MRP. ₹ 19,990/-~~*

**Offer Price ₹ 15,990/-****

## Exchange Offer

Exchange your old gas stove any make, any condition, for a sparkling new Sunflame Crystal Series cooktop



**and save upto ₹ 3,000/-***

*Offer on MRP.

## Introductory Offer

Exchange your old appliance any make, any condition, for a sparkling new Sunflame Champion Mixer Grinder




**and save ₹ 1,000/-***

*MRP. mentioned are inclusive of all taxes. **Handling Charges ₹ 300/- extra

*Conditions apply.

foundations

**Please visit Sunflame stall for live demo - Industrial Exhibition Near Toy Railway Booking Counter at Nampally**

Visit us at www.sunflame.com | Available at all leading stores | Hurry! Offers available for limited period.

Sunflame Enterprises Pvt. Ltd. has not authorized any online sales activity. Any purchases made from sales websites / online portal will be entirely at customer's own risk and will not carry any entitlement of warranty / after sales service / installation support.

**Greater Hyderabad: Brand Store In Hyderabad Twin Cities:** Ashok Nagar: 040-66623143/ 9440854697; Attapur Pillar No.117: 9700933763/ 8142990443, Chandanagar: 8121906903, Dilshuknagar-beside Ashtalaxmi Temple: 9293227998 / 9154939838; Gachibowli Main Road: 7207265598 / 9966264403, Hubsiguda,Street No.8: 9885967786, Kukatpalli Road No 1: 9959446838; Miyapur: 9703844733; Nagole Cross Road: 040-65154575/9966154575, Neredemet X Road:9849192258/040-42212258.Trade: Agromech Industries-7416573459, Balaji Gas Appliances-8341028382, Chennai Steel & Home Appliances-04066802240, 9246282240, Jagdamba Steel Palace-9704685088, Jai Bhavani Steel Palace-04023832264, Mahalaxmi Home Needs-9247426036, Mahaveer House of Electronics-04027701254, Mamtha Sales Agencies-7702944178, Nakoda Steel Palace-04066770555, Neel Enterprises-9000103111, Pick & Pack Exclusive-8099059759, Sai Home Appliances-9963915786, Sri Krishna Enterprises-04023063704, Steel Big Bazar-9849409999, Swasthik Steel-9000244740, TT Super Bazar-04066465045, Tulsi Home Appliances-9000776417, Vasavi Steel Palace-9849640935, Vijetha Super Market-8688171333. SUNFLAME OFFICIALS: Santosh Patil: 9885511777; For Crystal & Traditional Cooktop Series, Chimneys Hobs & Cooking Range : Naresh Kumar: 9866002852, For Shakti, Crown SS, Euro/ Icon Series of Cooktops : Md Jawed: 8885066221, For Classic Series Glass Cooktops: Naresh Kumar: 9866002852, For Mixer Grinders, Geysers, Roti Maker, Rice Cookers & Heating Appliances: Aditya: 9885157700, For OTG, Kettles, Irons, Other Appliances Products: Shabaaz: 9966196300. Customer Care: 040-65546553/ 9032005021.

**Telangana:** Distributor for Adilabad Dist.: Mithili Marketing: 9700070467, Sunflame Official: VVSM Srinivas: 9246914556; Dealers: Bhainsa- Akshya Enterprises- 09440382304, 9490358304, Adilabad-Bigbazar Electronics- 9440757805, Belampally- Vasavi Steel palace- 9059632373, Manchiriyal- Royal Galary-8019702229, Distributor for Nizamabad: Trishakti Enterprises: 0878-6451929, 8019990002, Sunflame Official: VVSM Srinivas: 9246914556, Dealers: Laxmisree Enterprises-07386471790, Distributor for Karimnagar: Trishakti Enterprises: 0878-6451929, 8019990002, Sunflame Official: VVSM Srinivas: 9246914556, Dealers: Karimnagar: TV Centre 9618211600, Sai Kishore Agencies 9440852635, Jagityal: Padmaja Enterprises 9985211109, Kurotla- Laxmipriya Steel Palace- 9440142627, Godavarikhani- Saikrupa Enterprises-8728249939, Sri Ayyapa Home Needs-9849340663, Distributor for Warangal, Khammam & Nalgonda: Trishakti Enterprises: 0878-6451929, 8019990002, Sunflame Official: VVSM Srinivas : 9246914556, Dealers: Hanamkonda: Vijaya General Stores- 9704300111, Majestic Traders- 9550383304, 8374128691, Sri Venkataramana Enterprises: 9290028064, Sri Sai Sanitations: 9949555227, Sri Balaji Electronics & Home Needs: 8885888443, Kazipet- Balaji Kitchen Galary- 9059105916, Distributor for Medak, Mehboobnagar & Rangareddy : Trishakti Enterprises: 0878-6451929, 8019990002, Sunflame Official: VVSM Srinivas : 9246914556, Dealers: Siddepet: Geetha General stores- 7842220200, Ghatkasar: Krishna Enterprise: 9290909717.

**Distributor for Krishna, East & West Godavari: Central Andhra:** Teja Sai Agencies: 0866-2524551: Srinath : 8790806368; A R Enterprises: 0863-2244669, Distributor for Guntur & Prakasam: Srinath: 87908 06368; Seshbabu: 9849048522, Sri Rajendra Home Needs (Guntur): 903095654; Venkataramana Selections (Chirala): 08594-232264; Sneha Electronics (Ongole): 9000009521; (Brand Store@ Nellore) : Vedayapalem, Beside More Super Market: 9440421878, Santosh Patil: 9885511777; Chinni Agancies: 868662833, (Brand Store@ Vijayawada): Vijaya Talkies Centre: 0866-6663143, 9642747414. Distributor for Chittor & Nellore: Vinod : 9966492665; Sri Venkataramana Arcade (Nellore); 9493005568.

**North Andhra:** Teja Sai Agencies: 0866-2524551, Distributors for West & East Goadavari: Sheshu Babu: 9849048522; Best Buy (Rajahmundry) : 9948138888; New Glass House (Kakinada): 9666788884; Vizag (Brand Store): Shakarnatam Rd: 0891-2713888/888589888, Santosh Patil: 9885511777; Sri Tirumala Agencies: 9246528333 Distributors for Vizag, Vizianagaram & Srikakulam: Shiva : 92468 97666; Preethi Emporium (Vizag): 0891-6561117; Bombay Gas Light Stores (Vizag): 0891-2755193; Sri Ganesha Enterprises (Gajuwaka): 9133356213; Srinivasa Home Appliances (Anakapalli): 9989100551; Vani Radio Home (Anakapalli): 9246666411; Koteswara Steel Center: 08942-224108; Mahalakshmi Home Appliances: 9989820435.

**Rayalseema:** Chinni Agancies: 8686628333, Distributor for Chittor & Nellore: Vinod: 9966492665; Jututru Agencies: 9866282122, Distributor for Cudapah:Vinod: 9966492665; Kurnool (Brand Store): Beside Anand Cine Complex: 8518222143/9676274080, Santosh Patil : 9885511777; L V Enterprises: 9000008805, Distributor for Kurnool & Ananthpur: Vinod : 9966492665

జన్మదిన
ప్రత్యేక సంచిక

# చతుర

సంపుటి -38, సంచిక - 1
445వ సంచిక, పేజీలు : 132, ఫిబ్రవరి 2015





'మూడు రూపాయలు ఎక్కడ నుంచి తేవాలి?' తోటికోడలు లచ్చమ్మతో అంది దిక్కుతోచని పుల్లమ్మ.

'అప్పు చెయ్యడానికైనా లేదు. షావుకారు దగ్గర ఇప్పటికే తీర్చలేనంత అప్పుంది' బాధగా అంది లచ్చమ్మ.

'ఏడాది పాటు అడవిలో కొట్టిన కట్టెలన్నీ మీ ఇంటికే వేస్తానంటే కాకినాడలో ఎవరైనా పైకమిస్తారేమో?' చిన్న ఆశతో అంది పుల్లమ్మ.

'ఏడాదికి వేసే కట్టెలు మూడు రూపాయలు చేస్తాయేమిటి?' దిగులుగా అంది లచ్చమ్మ.

'నిజమే. మనగుడిసె నాలుగు రూపాయలు చెయ్యదు. దాంట్లో కాపురముండే మగ మనుషుల మీద మూడు రూపాయల తీరువా! ఇపుడు ఏం చేయడం?'

ఎంత ఆలోచించినా ఇద్దరికీ ఏం తోచలేదు.

ఇంతకీ వాళ్లు తీరువా ఎలా కట్టారు?

19వ శతాబ్ది ఆరంభంలో బ్రిటీషుపాలనలో భారతీయుల వెతలను కళ్లకు కట్టిన **పాలంకి సత్య** నవల **మారీచ మార్గం**

6వ పేజీలో..

'ఆఫ్రికన్ బానిసలు ఒక్క ఏడాదే ఉంటారిక్కడ. ఇటు భారతీయ కూలీలూ వెళ్లే సమయం ఆసన్నమైంది. వాళ్లిద్దరూ వెళ్లిపోతే ఇక మన చెరకు తోటల్లో, పంచదార మిల్లుల్లో పనిచేసేదెవరు?' దిగులుగా అన్నాడు మారిషస్‌లోని ఓ తోట యజమాని.

'ఐరోపా నుంచి కార్మికులొచ్చినా భారతీయుల్లా కష్టపడి పనిచేయలేరు. వారికిచ్చినంత తక్కువ జీతానికీ చేయరు. భారతీయులనెలాగైనా ఇక్కడే ఆపాలి?' మనసులో ఓ దురాలోచనతో అన్నాడు మరో తోట యజమాని.

అసలు భారతీయులు మారిషస్‌కు ఎందుకు వెళ్లాల్సి వచ్చింది? వారిని అక్కడే ఆపేందుకు బ్రిటిష్‌వారు వేసిన ఎత్తేంటి? ఆద్యంతం ఆసక్తిగా చదివించే పాలంకి సత్య చారిత్రక నవల మారీచ మార్గం చతుర జన్మదిన సంచిక ప్రత్యేక కానుక!



కారు కాకినాడ నుంచి ఉప్పాడ వైపు వెడుతోంది. డ్రైవరు పక్కన ముందు సీట్లో కూచున్న హర్షవర్ధన్ వెనక సీట్లో కూచున్న వత్సలతో "నాకోసం చాలా శ్రమ పడుతున్నారు థాంక్యూ!" అన్నాడు.

ఆ మాట అనడం పదిహేనోసారి.

"ఇందులో శ్రమ ఏముంది? ఫ్రెండ్స్ అన్నాక ఆ మాత్రం ఒకరికొకరు సాయం చేసుకోకపోతే ఎలా? " అంది వత్సల.

"మనది ఫేస్‌బుక్ ఫ్రెండ్‌షిప్ మాత్రమే" అన్నాడతను.

"అంత మాత్రాన ఫ్రెండ్‌షిప్ కాకూడదా? దేన్నైనా మంచికీ వాడుకోవచ్చు చెడుకూ ఉపయోగించవచ్చు. ఫేస్‌బుక్ ఫ్రెండ్ అనగానే అమ్మా, నాన్న భయపడ్డారు. కానీ మనుషులనూ, పరిస్థితులనూ సరిగా అంచనా వెయ్యగలనని ధైర్యం చెప్పాను. వాళ్ళ మనస్సు స్థిమితపడింది. మీ మర్యాదా, మీ తీరూ వాళ్ళకు మీమీద అభిమానం కలిగించాయి"

"నా కోరిక నాకే సిల్లీగా అన్పిస్తోంది. ఎప్పుడో 1839లో మా పూర్వీకులు ఉప్పాడ నుంచి మారిషస్‌కి చెరుకుతోటల్లో పనిచెయ్యడానికి వచ్చారట. ఆ విషయం అక్కడ రికార్డుల్లో ఉంది. అలా మారిషస్‌కి వచ్చిన నాగన్న అనే ఆయన వంశంలో నేను జన్మించాను. ఇప్పుడా నాగన్నగారి బంధువుల తాలూకు వారెవరైనా ఉప్పాడలో ఉంటే చూడాలనిపిస్తోంది. 'ఇదేమైనా తీరే కోరికేనా? ' అని ఒక్క క్షణం కూడా ఆలోచించలేదు. ఫేస్‌బుక్‌లో పెట్టాను. నా అదృష్టంకొద్దీ మీరు రెస్పాండ్ అయ్యారు. వెంటనే ఇండియా వచ్చేశాను"

"నేను ఏమైనా చెయ్యగలనో లేదో తెలియదు. మా అమ్మమ్మ ఉప్పాడలో ఉంది. ఆవిడకి నూట్రెండేళ్ళు. తాత ముత్తాతల సంగతులన్నీ ఆవిడకు తెలుసు. మీకు కావలసిన వివరాలేమైనా చెప్పగలదేమో అన్పించింది. ఆవిడకు తెలీకపోతే మీకు వ్యయప్రయాసలే మిగుల్తాయి"

ఒక్కక్షణం తరువాత హర్షవర్ధన్ మళ్ళీ మాట్లాడాడు. "1839 ఎక్కడ? 2015 ఎక్కడ? నూటడెభ్బై ఆరేళ్ళు. ఆనాటి సంగతులు తెల్సుకోవాలనిపించడం, అప్పటివారి వారసులకోసం ప్రయత్నించడం..."

వత్సల "అధైర్యం వద్దు" అంటూండగా కారు ఉప్పాడ చేరుకుని ఒక ఇంటిముందు ఆగింది.

ఎత్తు అరుగుల ఇల్లు, ఇంట్లోకి వెళ్ళాలంటే అయిదారుమెట్లు ఎక్కాలి. ఒకవైపు పెద్ద అరుగూ, మరోవైపు చిన్న అరుగూ. గోడలన్నీ మట్టితో ముగ్గులు పెట్టి ఉన్నాయి. ఇంటిపైన తాటాకుల కప్పు. వత్సలా వాళ్ళుండే ఇల్లు చాలా ఆధునికంగా ఉంది. ఈ ఇంట్లో పెద్దావిడ ఒంటరిగా ఎందుకుంటోందో? ఆలోచిస్తున్నాడు హర్షవర్ధన్.

"రండి!"

వత్సల పిలుపుతో కారుదిగి, బుట్ట తీసుకుని, మెట్లెక్కి లోపలకు వెళ్ళిన హర్షవర్ధన్ నులక మంచం మీద కూచున్న పెద్దావిడను చూశాడు. వత్సల ఆవిడ పక్కన కూచుని "ఎలా ఉన్నావు ముసలమ్మమ్మా? " అని అడుగుతోంది.

హర్షవర్ధన్ బుట్టలోంచి పళ్ళు తీసి ఆమె దగ్గర పెట్టి పాదాభివందనం చేశాడు.

"మా నాయనే! ఎంత వినయమో! ఇలా కూచో బాబూ!" అంది.

వత్సల కుర్చీలు తెచ్చి వేసింది.

"ఏం బాబూ! ఏ ఊరు? ఎక్కడనుంచి వచ్చావు? వత్సల ఏదో ఫోనులో చెప్పింది కానీ సరిగా విన్పించలేదు. వద్దు వద్దంటున్నా పిల్లలూ, మనవలూ, మునిమనవలూ ఈ సెల్లీఫోను కొనిపడేశారు. నాతో నీకు పనేమిటో తెలియలేదు"

"ముసలమ్మమ్మా! ఇతనికి నూటడెభ్బైఏళ్ళనాటి సంగతులు కావాలి. నీకైతే తెలుస్తాయని చెప్పి తీసుకొచ్చాను"

"నూట డెభ్బై ఏళ్ళా? "

# మీ జుట్టు రాలిపోతుందా ? ప్లేట్‌లెట్ రిచ్ ప్లాస్మా దీనికి సరైన పరిష్కారం!



డా. దీపిక నర్రా
(MD Dermatology)
కన్సల్టెంట్ డెర్మటాలజిస్ట్

అందమైన, ఒత్తైన శిరోజాలను మనలో ప్రతి ఒక్కరు కోరుకుంటారు. వాస్తవానికి ఇది సాధ్యమేనా ? నేడు పొద్దు పొడిచినప్పటి నుండి పొద్దువాలేలోపు తలపై ఏమాత్రం వెంట్రుకలు మిగులుతాయోనన్న భయం వెంటాడుతున్నది. అధికంగా జుట్టు రాలడం లేదా బట్టతల వల్ల కోల్పోయిన జుట్టుని తిరిగి పొందుటకు మార్గాలు ఏమిటి ? జుట్టుకి కావాల్సిన ఐరన్, బి12, థైరాయిడ్, ఇతర హార్మోన్లు ఏమైనా తక్కువగా ఉంటే సరిదిద్దుకొంటూ రాలిపోయిన జుట్టును తిరిగి పొందటానికి Platelet rich plasma వంటి stimulation పద్ధతులతో ప్రయత్నించవచ్చు. Oliva అడ్వాన్స్‌డ్ హెయిర్ అండ్ స్కిన్ క్లినిక్స్‌కు చెందిన కన్సల్టెంట్ డర్మటాలజిస్ట్ డా. దీపిక ఇలా అన్నారు. "Oliva లో ప్యాటర్న్‌డ్ హెయిర్ లాస్ చికిత్సలో ప్లేట్‌లెట్ రిచ్ ప్లాస్మా ఇంజెక్షన్లతో పాటు టాపికల్ మినాక్సడిల్ వాడతారు. ఈ విధానంలో బట్టతల గల వ్యక్తి నుండి మేము కొంత రక్తం సేకరిస్తాము. సెంట్రల్ డిఫ్యూజన్ తర్వాత ప్లేట్‌లెట్ రిచ్ ప్లాస్మాను వేరు చేస్తారు. ఈ ప్లేట్‌లెట్లలో వృద్ధి కారకాలు, వాస్కులర్ ఎండోథెలియల్ వృద్ధి కారకాలు మరియు రూపాంతరం చెందే వృద్ధి కారకాల నుండి వచ్చిన ప్లేట్ లెట్లు సమృద్ధిగా ఉంటాయి. ఇవి మీ జుట్టు ఒత్తుగా, దృఢంగా పెరుగుటకు మరియు ఆరోగ్యవంతంగా కన్పించుటకు దోహదపడతాయి. ఇది వైద్య చికిత్స ద్వారా మీ జుట్టు యొక్క పెరుగుదల మరియు ఆరోగ్యాన్ని పెంపొదిస్తుంది. ఎట్టి దుష్ఫలితాలు లేవు మరియు ఇన్ఫెక్షన్లకు అవకాశమే లేదు. మంచి ఫలితాల కోసం నెలవారీ అంతరాలలో సాధారణంగా ఎనిమిది సెషన్లు ఆచరించవలెను". మీరు కోల్పోయిన జుట్టును తిరిగి పొందటానికి సమర్థవంతమైన మరియు సురక్షితమైన పరిష్కారమార్గమిది.

**ఫీమేల్ ప్యాటర్న్‌డ్ హెయిర్ లాస్**



**మేల్ ప్యాటర్న్‌డ్ హెయిర్ లాస్**



**ఈ ట్రీట్‌మెంట్‌కు సుమారుగా 35,000 నుండి 50,000 వరకు ఖర్చు అవుతుంది.**

"ఇంకా చెప్పాలంటే రెండు వందలు. అయితే మాత్రం.. నీకు తెలియందే ముంది? "

"ఇదిగో నన్ను వెక్కిరిస్తున్నావు. చూడు నాయనా! ఎలా మాట్లాడుతోందో? "

"లేదు ముసలమ్మమ్మా! ఈయన 'మారిషస్' అనే దేశం నుంచి వచ్చాడు. అతని తాత ముత్తాతలు ఉప్పాడ నుంచే అక్కడకు వెళ్ళారట. ఓసారి పూర్వీకులు పుట్టిపెరిగిన ఊరు చూడాలనీ, బంధువులెవరైనా ఉంటే పలకరించాలనీ వచ్చాడు"

"ఎక్కడ నుంచి వచ్చాడన్నావు? "

"మారిషస్"

"ఆ రాక్షసుడు మారీచుడి దేశమా? "

**కొత్తగాలి...** 

**నాటి పెళ్ళిళ్లు**
**వందేళ్ల కాపురాలు**
**నేటి పెళ్ళిళ్లు**
**ముక్కోపాల మూణ్ణాళ్లు!!**

*– జిడగం నాగేశ్వరుడు,*
*హైదరాబాద్*

"అదేమిటలా అంటావు? "

"కాకపోతే? సీతాదేవిని రావణాసురుడు లంకకి ఎలా ఎత్తుకు పోయాడు? మారీచుడు బంగారు జింకలా వచ్చి మోసం చేశాడు. అలాగే మా అమ్మమ్మ మేనమామనూ ఎక్కువ జీతమని మభ్యపెట్టి పట్టుకుపోయారు మారీచుడి దేశంవాళ్లు. ఆ దేశం లంకకి అవతల ఉందట"

"మీ అమ్మమ్మ మేనమామ మారిషస్ వెళ్ళాడా? ఎప్పుడూ చెప్పలేదేం? " అంది వత్సల.

"నువ్వెప్పుడైనా అడిగావా? " పెద్దావిడ అంది అంతే దూకుడుగా.

"ఎప్పుడు మారిషస్ వెళ్ళాడాయన? " అని అడిగింది వత్సల.

"ఆ రాక్షసుడి పేరు చెప్పకు"

హర్షవర్ధన్‌కేసి ఇబ్బందిగా చూసింది వత్సల.

"ఫరవాలేదు. ఆవిడ మారీచ రాక్షసుడంటున్నారు. మా దేశంలో చాలామంది మారీచ మహర్షి అంటారు" అన్నాడు.

"సీతను రావణుడెత్తుకుపోతే రాముడు దేవుడు కాబట్టి వెనక్కి తెచ్చుకున్నాడు. మా అమ్మమ్మ మేనమామను ఎవరు తెస్తారు? ఆయన తల్లి కంటికీ మంటికీ ఏకధారగా ఏడ్చి చచ్చిపోయింది"

"ఈ ఊరి నుంచే వెళ్ళారా? "

"లేదు కోరంగిలో పడవెక్కి వెళ్ళారట"

"అందుకే మమ్మల్ని కోరింగాలు అంటారు" అన్నాడు హర్షవర్ధన్.

"ముసలమ్మమ్మా! మీ అమ్మమ్మ మేనమామ వెళ్ళాడని నీకెలా తెలుసు? "

"ఎలా తెలుసేమిటి? మేమేం మీలా పెద్దంతరం, చిన్నంతరం లేకుండా ఉండే వాళ్ళమా? ఇంట్లో పెద్దవాళ్ళు ఏం చెప్పినా వినేవాళ్ళం. ఇప్పుడైతే 'నీకేం తెలుసు నోరు మూసుకో' అంటారు. ఏదో ఇన్నాళ్ళకి ఈ అబ్బాయి వచ్చి అడుగుతున్నాడు కానీ నీకేమైనా పట్టిందా? "

"సరే ఇతనైనా అడుగుతున్నాడుగా. మీ అమ్మమ్మ మేనమామ మారిషస్ ఎప్పుడు వెళ్ళాడు? ఆయన పేరేమిటి? "

"నాగన్న"

హర్షవర్ధన్ ఉలిక్కిపడ్డాడు. తన పూర్వీకులలో మారిషస్‌లో మొదటగా దిగిన వ్యక్తి పేరు నాగన్న అని ఉంది. ఆ నాగన్న, ఈ నాగన్నా ఒకరు కారుకదా?

వత్సల అతని ముఖంలో ఉదయించిన ఆశాకిరణాలను చూస్తూ పెద్దావిడతో "ఎందుకు వెళ్ళాడు? ఉప్పాడ నుంచి కోరంగి బండి మీద వెళ్ళారా? " అంది.

పెద్దావిడ తలకొట్టుకుంది. "అయ్యో రామా! బండి మీద వెళ్ళే డబ్బులే ఉంటే

ఊరు వదిలి పోడమెందుకు? నడిచే వెళ్ళారు. పదిమంది పడవెక్కడానికీ, ఊరంతా సాగనంపడానికీ"

"మొత్తమంతా వివరంగా చెప్పండి" అన్నాడు హర్షవర్ధన్.

ఆవిడ మొదలెట్టింది.

వత్సల కన్నార్పకుండా ఆవిడకేసే చూస్తూ వింటోంది. ముసలమ్మమ్మ చెప్తున్నవీ, హర్షవర్ధన్ వివరించినవీ, తాను కంప్యూటర్‌లో నెట్ ద్వారా తెలుసుకున్నవీ, పుస్తకాలలో చదివినవీ కలిపి 1830ల నాటి తెలుగు జీవితాన్ని కళ్ళ ముందు సినిమాలా చూపించసాగాయి.

పెద్దావిడ చెప్పసాగింది.

"ఇప్పుడంటే కాకినాడ నుంచి ఉప్పాడకి అరగంట కారు ప్రయాణం. అప్పట్లో రోడ్లు లేవు, రైళ్ళు ల్లేవు. డబ్బున్న వాళ్ళకి గుర్రాలూ, డోలీలూ, మేనాలూ, అక్కడక్కడ రథాలు.. బీదవాళ్ళకి నడకేగతి. ఉప్పాడంటే జరీ చీరలు కాదు. అయిదు వందల దాకా గుడిసెలు. మగవాళ్ళు సముద్రంలో చేపలు పట్టడం, ఆడవాళ్ళు అడివిలో కట్టెలు కొట్టడం.."

ఒక్కసారి ఆనాటి ప్రపంచం హర్షవర్ధన్, వత్సలల కళ్ళముందు ప్రత్యక్షమైంది.

## 2

కాకినాడ నుంచి ఉదయమే బయల్దేరి నలుగురు స్త్రీలు ఉప్పాడవైపు నడుస్తున్నారు. నిరంతరం శ్రమ చెయ్యడంవల్ల శరీరాలు బాగా గట్టిపడినట్లున్నాయి. నడకలో అలసట కన్పించడంలేదు. చేతులకు వెండి మురుగులూ, కాళ్ళకి రాగికడియాలూ, మెడలో గురివిందపూసల దండలూ, తలలో అడివి మల్లెలూ వారికి అలం

కారాలు. నలుగురి చేతుల్లో చిన్నచిన్న మూటలున్నాయి.

"పుల్లమ్మత్తా! తొందరగా నడు. పదయ్యే సరికి ఏ చెట్టునీడకో చేరుకోవాలి"

"నన్నంటావేమిటి? కలకటీరు బంగళాని కళ్ళప్పగించి కదలకుండా చూసింది నువ్వు కాదా వీరమ్మా"

"అవునుకానీ పుల్లమ్మత్తా కలకటీరుగారి దొరసానమ్మని ఎప్పుడైనా చూశావా? "

"ఒక్కసారి చూశానే వీరమ్మా! ఎంత తెల్లగా ఉందో! సంద్రం నురుగులా ఉందనుకో! జుట్టు పసుపురంగులో ఉంది. ఏమిటో నాకళ్ళకేం బాగుండలా"

"నీ కళ్ళకి ఎవరూ బాగుండరులే. మన ఉప్పాడలో ఏ పిల్లా నచ్చకనే కదా నీ కొడుక్కి ఎక్కడో ఆలమందలో పిల్లని చేసుకుంటున్నావు"

పుల్లమ్మ, వీరమ్మల మాటల్లో కల్పించుకుంటూ లచ్చమ్మ "నా తోటికోడలికి ఇక్కడ వాళ్ళెవరూ నచ్చరు. కూతురికీ విజీనగరం సంబంధం చేసింది. కొడుక్కీ అక్కడ పిల్లనే తెచ్చుకుంటోంది" అంది.

"పుల్లమ్మదంతా తూరుపుపైనే చూపు" అంది నాలుగో మనిషి గౌరమ్మ.

"మనమేమో తూరుపు, తూరుపు అని అంటాం. అక్కడ వాళ్ళూ మన్ని అలాగే పడమట అంటారు. మా వియ్యపురాలిని మనలో ఎవరూ దొరకలేదా 'పడమటి పిల్ల'ని తెచ్చుకున్నావు అంటారట. ఏవైపైతేనేమి? మనమంతా మాట్లాడేది తెలుగే కదా. బందరులో మన్ని 'తూరుపు' అంటారట. మా మేనమామ కూతుర్ని అటే ఇచ్చారులే" అంది పుల్లమ్మ.

"ఎటువైపేతేనేమిలే? కళ్ళ ఎదురుంటుందని కూతుర్ని ఊళ్ళోనే ఇచ్చాం. అల్లుడు చెన్నపట్నంలో బోయిగా ఉంటానంటూ అమ్మాయిని తీసుకుని వెళ్ళిపోయాడు. ఏం చేస్తాం? " అంది గౌరమ్మ.

"అవునుగానీ పుల్లమ్మత్తా! కొడుకు పెళ్ళికి పీటల మీద ఎవర్ని కూచో పెడతావు? నీకా మొగుడు లేడు. మరిది చెన్నపట్నంలో ఉన్నాడు. కూతురి పెళ్ళికయితే మరిదినీ, తోటికోడల్నీ కూచోపెట్టావు. ఇప్పుడేం చేస్తావు? " అంది వీరమ్మ.

"చెన్నపట్నం కబురెడదామనుకుంటున్నా" అంది పుల్లమ్మ

"నీ కబురందేదెప్పుడు, నీమరిది వచ్చేదెప్పుడు? లగ్నం దగ్గర పడిందిగా"

"మా గొడవ నీకెందుకే వీరమ్మా? ఏదో ఒకటి చేసుకుంటాం" అంది లచ్చమ్మ.

"లచ్చమ్మత్తా! చెన్నపట్నం నుంచి నీకు కబుర్లు వస్తాయా? " అడిగింది వీరమ్మ.

"వస్తే నీకేమి, రాకుంటే నీకేమి? నా మొగుడక్కడ పల్లకీ మోసే బోయీ పనిచేస్తున్నాడు. నెలకి ఏడురూపాయలు జీతం. నీ మొగుడిలా తాగి తందనాలాడ్డంలేదు" అంది లచ్చమ్మ.

"అబ్బో! చెన్నపట్నమెళ్ళాడని గొప్పకుపోకు. అసలు ఎళ్ళిందెందుకట? ఇక్కడ తాగడానికి చేసిన అప్పులు తీర్చడానికి కాదా? బడాయి వద్దు" అంది వీరమ్మ.

"అప్పు చేస్తేనేం? తనే తీరుస్తున్నాడుగా, నీ మొగుడిలా పెళ్ళాం అప్పు తీరుస్తూంటే చూస్తూ కూచోలే" అంది లచ్చమ్మ.

"ఏమిటంటున్నావు? " అంటూ వీరమ్మ లచ్చమ్మకొప్పు పట్టుకోబోయింది. లచ్చమ్మ, వీరమ్మ చెయ్యి పట్టుకుంది. ఇద్దరినీ పుల్లమ్మా, గౌరమ్మా విడదీశారు.

"ఏమే ఎందుకే ఈ సిగపట్లు? ఇద్దరి బతుకులూ ఒక్కలాగే ఉన్నాయి. కట్టెలు కొట్టి అమ్ముకోకుండా ఇద్దరికీ గడవదు. తాగుడికి పొయ్యడమేకానీ ఇంటికి ఒక్క దమ్మిడీ మీ మొగుళ్లు ఇవ్వరు, ఆ పాటి దానికి నీ మొగుడు అంటే నీ మొగుడు అని కొట్టుకోడం దేనికి? సరే నా మొగుడయితే తాగి తాగి చచ్చిపోయాడు. ఏడవడానికి కూడా సమయం లేకపోయింది. చంకలోబిడ్డ, కడుపులోబిడ్డ. అలాగే బతికానా

# వేరికోస్ వీన్స్ తగ్గడం సులువే!



డా. పవన్ రెడ్డి



**జనవరి 2, 2014...**

74 ఏళ్ల ఆయన మా క్లినిక్‌కి వచ్చారు. రెండు కాళ్లలోనూ పిక్కలు లాగుతున్నాయన్నది ఆయన మొట్టమొదటి కంప్లెయింట్. నాలుగేళ్ల నుంచి వేరికోస్ వీన్స్ సమస్య వల్ల కాళ్లు నల్లగా అయినాయి. కాళ్ల నొప్పుల వల్ల ఆయనకు నిలబడడం, కొద్ది దూరం నడవడం కూడా కష్టం అవుతోంది. కూర్చుంటే నొప్పి తగ్గినట్టుగా ఉంటోంది. కాని రెండు పాదాలు కూడా మొద్దుబారినట్టు అవుతున్నాయి. దీనివల్ల సరిగా నిద్ర కూడా పోలేకపోతున్నాడు.

**మరిన్ని లక్షణాలు**

కూర్చుని లేచినప్పుడు కల్లు తిరుగుతున్నాయి. నడుస్తున్నప్పుడు కూడా ఇదే పరిస్థితి. సరిగా నడవలేకపోవడం, వెనకనుంచి ఎవరో తోస్తున్నట్టు అవడం వల్ల ఇలాంటి ఇబ్బంది కలుగుతున్నది. ఆయనకు అధిక రక్తపోటు కూడా ఉంది. దానికి మందులు వాడుతున్నాడు.

★ నాలుగేళ్లుగా మూత్రవిసర్జన సమయంలో మంట ఉంటోంది. పదే పదే వెళ్లాల్సి వస్తోంది.

★ అజీర్తి, కడుపుబ్బరం, కొంచెం తిన్నా కూడా పొట్ట నిండిపోయి, ఉబ్బరంగా ఉంటోంది.

★ ఏమాత్రం వాతావరణం మారినా, నీళ్లు మారినా బలుబు, దగ్గు బాధిస్తాయి.

★ రెండు కాళ్లలోని సిరలకు కలర్ డాప్లర్ స్టడీ చేశాం. పరీక్షలో తొడ మధ్య భాగంలో రిఫ్లక్స్ (ప్రతిచర్య) కనిపించింది. పిక్క భాగంలోని ఎముకలో రంధ్రాలు ఉన్నట్టు తేలింది. ఎస్ఎఫ్‌పి - పాప్లిటియల్ విభాగంలో (మోకాలి వెనుక భాగం) కలర్ ఫిల్లింగ్ లేకపోయినా సిరల్లో రక్తం గడ్డ కట్టివున్నట్టు స్పష్టమైంది.

**శరీర తత్వం**

ఆకలి బాగానే ఉంది. కాని తినడానికి ఏమాత్రం ఆలస్యం అయినా తట్టుకోలేడు. శరీరం అంతా వణుకు మొదలవుతుంది. (ఆయనకు మధుమేహం లేదు).

★ దాహం ఎక్కువ. నీళ్లు ఎక్కువగా తాగుతాడు.

★ స్వీట్లు, చేపలు, మసాలా ఆహారం, పండ్లు ఎక్కువ ఇష్టంగా తింటాడు.

★ 13 ఏళ్లుగా సిగరెట్ తాగుతున్నాడు. రోజుకి 10 సిగార్లు కాల్చేస్తాడు.

★ మలవిసర్జన సవ్యంగానే ఉంది గాని, నిద్ర లేవగానే టాయిలెట్‌లోకి పరుగు తీయాల్సిందే.

★ మూత్రం ఆగి ఆగి వస్తుంది. మంట కూడా ఉంటుంది.

★ అధికంగా చెమట పడుతుంది.

★ కాళ్ల నొప్పుల వల్ల నిద్ర సరిగా పట్టదు.

★ వేడి వాతావరణాన్ని తట్టుకోలేడు. చలికాలంలో కూడా కప్పుకొని పడుకోవాల్సిందే.

**మానసిక తత్వం**

★ చాలా వేగంగా మాట్లాడతాడు. అర్థం చేసుకోవడం కష్టం.

★ ఏ పని చేసినా తొందర ఎక్కువ పరిగెత్తినట్టుగా నడుస్తాడు.

★ మార్పు ఇష్టం ఉండదు. అందుకే 30 ఏళ్లుగా ఒకేచోట పనిచేస్తున్నాడు. జ్ఞాపకశక్తి తక్కువ కాబట్టి కొత్త విషయాలు నేర్చుకోలేడు. కొత్త రకమైన పనిని చేయలేడు.

★ చిన్నప్పటి నుంచి కూడా చాలా పిరికివాడు. తన సందేహాలను అడగడానికి కూడా భయమే. ఈ స్వభావం వల్ల రిజర్వ్‌గా ఉండడం అలవాటైంది.

★ ప్రతిరోజూ రెండు మూడు వార్తాపత్రికలు అక్షరం వదలకుండా చదువుతాడు. ఆధ్యాత్మిక పుస్తకాలు చదవడం ఇష్టం.

**చికిత్స**

ఈ విషయాలన్నింటినీ పరిగణనలోకి తీసుకుని జనవరి 25ననే మందులు మొదలుపెట్టాం.

★ 26-3-2014 నాటికల్లా నిలబడినప్పుడు కళ్లు తిరగడం తగ్గింది. పాదాల్లో మంట కూడా తగ్గింది. తద్వారా నిద్ర సరిగా పడుతున్నది.

★ 27-6-2014 కల్లా నిలబడడం, నడవడం మెరుగయ్యాయి. వేరికోస్ వీన్స్ వల్ల వచ్చిన కాళ్లలో నలుపు దనం తగ్గింది. ఎటువంటి ఇబ్బంది లేకుండా కొంత దూరం నడవగలుగుతున్నాడు.

★ 27-8-2014 రోజుకి కళ్లుతిరగడం పూర్తిగా తగ్గింది. వేరికోస్ వీన్స్ వల్ల వచ్చిన నలుపుదనం చాలావరకు తగ్గింది. పొట్ట ఉబ్బరం, అజీర్తి లాంటివన్నీ తగ్గు ముఖం పట్టాయి.

★ 9-12-2014 రోజుకల్లా కళ్లు తిరిగే సమస్య ఎంతమాత్రమూ లేకుండా హాయిగా నడవగలిగాడు. వేరి కోస్ వీన్స్ నొప్పి, నలుపుదనం తగ్గిపోయాయి.

లేదా? " అంది పుల్లమ్మ

వీరమ్మా, లచ్చమ్మా ఆమె చెప్పింది నిజమేనన్నట్లుగా తలవంచుకుని నిల్చున్నారు.

"సరే పదండి! కబుర్లు కట్టిపెట్టి నడుద్దాం. జాము పొద్దెక్కేలోగా చిట్టడివి చేరుకోవాలి" అంది పుల్లమ్మ.

పదిగంటలయ్యేసరికి నలుగురూ మర్రిచెట్లనీడకి చేరుకున్నారు. మూటలు విప్పి జొన్న రొట్టెలూ, చింతకాయపచ్చడీ వేసుకుని భోజనం ప్రారంభించారు. పుల్లమ్మ నలుగురి విస్తళ్ళలోనూ అన్నం, ఊరగాయా వేసింది.

"వరి అన్నం ఎక్కడిది అక్కా" అని లచ్చమ్మ అడిగింది.

"నిన్న పూర్ణమ్మతల్లి ఇంట్లో కట్టెలు ఇచ్చాను. రాత్రి వాళ్ళ అరుగుమీద పడుకున్నా. పొద్దుటే ఆ అమ్మ రాత్రి మిగిలిన అన్నమూ, ఊరగాయా ఇచ్చింది. ధర్మదేవత ఆ తల్లి"

నలుగురూ అన్నం తిని, ఆనపకాయబుఱ్ఱలో నుంచి నీళ్ళు తాగి చెట్టుకింద కొంగుపరుచుకుని పడుకున్నారు.

కట్టెలు కొట్టడం, కాకినాడలో అమ్మకోడం, కాలినడకలతో అలసట ముప్పేటగా వచ్చి నిద్రాదేవి ఒడిలో సేదతీరమని చెప్పినట్లుంది. నలుగురి కళ్ళూ నిమిషాలలోనే మూతలు పడ్డాయి.

మర్నాడు ఉప్పాడ గ్రామమంతా కలకలంగా ఉంది. అన్ని గుడిసెల్లోని జనం సముద్రం ఒడ్డున పోగయ్యారు. ఆడా, మగా అంతా దిగాలుగా కూచున్నారు. పిల్లలు మాత్రం కెరటాలలో కేరింతలు కొడుతున్నారు.

ఉదయమే కాకినాడ నుంచి కలెక్టరు ఆఫీసు బంట్రోతు వచ్చి టముకు కొట్టి వెళ్ళాడు. ఉప్పాడలోని ప్రతిమగవాడూ ఏడాదికి రూపాయిన్నర చొప్పున జీవితపర్యంతం సర్కారుకి పన్ను కట్టాలి. చేపలు పట్టి ఎండబెట్టి అమ్ముకుని ఉప్పాడ మత్స్యకారులు చాలానే సంపాదిస్తారని ఈస్ట్ ఇండియా కంపెనీ నమ్మకం. అందుకే మనిషికి ఏడాదికి రూపాయిన్నర పన్ను. ఈ ఏడాది పన్ను కట్టే సమయం వచ్చిందనీ, కలెక్టరుగారు నాగలాపల్లెలో జమాబందికి వచ్చేలోగా ప్రతిఒక్కరూ నాగలాపల్లె వెళ్ళి కరణంగారికి పన్ను చెల్లించాలనీ బంట్రోతు టముకు వేసి వెళ్ళాడు. రూపాయిన్నర పన్ను అంటే మాటలు కావు. ఎలా కట్టాలి? ఏం తాకట్టు పెట్టాలి?

మత్స్యకారుల పెద్ద సూరయ్యను ఏం చెయ్యాలని అడిగారంతా!

"ఏం చెయ్యాలేమిటి? తీరువ(పన్ను) కట్టాల్సిందే. లేకుంటే కలకటీరుదొర ఊరుకుంటారేమిటి? "

"తీరువ కట్టాలా లేదా? అని అడగలేదు. కట్టడానికి ఏంచెయ్యాలని అడిగాను చేపలు పట్టేవాళ్లం! అవి ఎండ బెట్టాక అమ్మితే వచ్చేదెంత? అందులో మిగిలేదెంత? " అన్నాడు వెంకయ్య

వెంటనే వెంకయ్య భార్య గౌరమ్మ అందుకుని "ఎందుకు మిగలదు? చేపలు అమ్మగా వచ్చిందంతా నీ తాగుడుకే సరిపోదు. అదే లేకుంటే మిగలదా? " అంది.

"అస్తమానం సతాయిస్తావేమిటి? సంద్రంలో నావ నడుపుకుంటూ పోయి, చేపలు పట్టి తీసుకురావాలి. వాటిని ఎండబెట్టి కాపలా కాయాలి. కాకినాడో, పెద్దాపురమో పట్టుకుపోయి అమ్మాలి. ఒళ్ళు హూనమై ఓ చుక్కేసుకుంటే తప్పా? "

"నేను మాత్రం ఇంట్లో తిని కూచుంటున్నానా? అడివికి పోయి కట్టెలు కొట్టి కాకినాడ పట్టుకుపోయి అమ్ముకొస్తున్నా. ఏ ఊరు వాళ్ళు పిల్చినా పోయి బియ్యం దంచి వస్తున్నా. ఇంటిపనీ, వంటపనీ ఎలాగూ తప్పదు"

"ఏమిటి నువ్వు చేసేవంట? చేపల ఇగురా, రొయ్యలకూరా, కోడిపులుసా? "

"అబ్బో నీ సంపాదనకి అవే తక్కువ"

"లేకపోతే నువ్వు సంపాదిస్తున్నావా? "

"లేదా? నా సంపాదనే లేకుంటే ఇల్లు ఎలా గడిచేది? నాలుగేళ్ళుగా సరకారుకి రూపాయిన్నర తీరువ నేనే కడుతున్నా"

"ఇప్పుడూ నువ్వేకట్టు"

"నేనింక కట్టను. నువ్వే కట్టుకో"

"ఓలి తక్కువని కట్టుకున్నందుకు బాగానే వాగుతున్నావు"

"నీ మొహానికి అంతకన్నా ఓలి ఇవ్వడానికి డబ్బెక్కడుంది?

"నోర్మూసుకోండి" ఊరిపెద్ద సూరయ్య గదమాయించడంతో ఊరుకున్నారిద్దరూ.

"రేపు నేను నాగలాపల్లె వెళ్ళి కరణంగారిని కలుసుకుని ఇంకో నెల గడువిప్పించమని అడుగుతా. ఈలోగా అందరూ రూపాయిన్నర చొప్పున పోగేసుకోండి" అన్నాడతను.

లచ్చమ్మ "నా పెనిమిటి ఇక్కడ లేదు కదా. చేపలు పట్టని వాణ్ణి తీరువా కట్టమనడం న్యాయమా? " అంది.

"మగాడన్నాక మీసాలొచ్చిన నాటినుంచీ చచ్చేదాక తీరువా కట్టాల్సిందే. అది దొరతనంవారి కట్టడి"

"ఇక్కడుంటే కట్టమనచ్చు. చెన్నపట్నంలో ఉంటే ఎందుకు కట్టాలి? "

"అయితే కలకటీరు దొరవారితో నువ్వే మాట్లాడుకో"

"అమ్మబాబోయి! వారితో మునసబుగారే మాట్లాడలేరు. నేనేం మాట్లాడతా? " అంది లచ్చమ్మ.

"అందుకే తీరువా పోగేసి పెట్టుకో"

"ఏం తెల్లదొరల జమానానో ఏమో! అయిదరాబాదు నవాబు ఉన్నప్పుడే బాగుండేది. మనిషికింత అని లెక్కకట్టేవారుకాదు. చేపలు పడితేనే పన్ను కట్టేవాళ్ళం" అంది పుల్లమ్మ.

"ఏం పుల్లమ్మా! నవాబు హయామే బాగుందంటున్నావు? ఎప్పుడూ యుద్ధాలుంటే బాగుంటుందా? అయిదరాబాదు పటాలమో, మరాఠీల దండో వచ్చి ఊళ్ళ మీద పడి దోచుకుంటే బాగుంటుందా? తెల్లదొరలొచ్చాకనే బాగుంది" అన్నాడొక పెద్దాయన.

"జమానా ఏదైనా పన్ను కట్టాలి కదా!" అన్నాడొక యువకుడు.

"చేపలు పట్టినా, పట్టకున్నా, మనిషి ఊళ్ళో లేకున్నా పన్ను ఎందుకు కట్టాలి? " మళ్లీ అంది లచ్చమ్మ.

"దొరల రాజ్యమంటే ఏమనుకున్నావు? సీమలో అంతా లెక్కప్రకారమే ఉంటుంది. పైరుభూమి లేదు కనక నీకు తెలీదు. మొన్న రాజమండ్రి పోయాను. పంట పండినా పండకపోయినా పన్ను కట్టాల్సిందేనట. మా బావమరిది అక్కడ రాణీగారి మేనాకి బోయిగా ఉన్నాడు. రాణీగారంటే ఎవరనుకున్నావు? కొచ్చర్లకోట వెంకటరాయనింగారి భార్యగారు"

"సీమలో కూడా మన పేర్లే ఉంటాయా? " అడిగిందో యువతి.

"ఛత్! తెలివి తక్కువదానా! రాజావారంటే ఇక్కడ జమీందారుగారు.. సీమలో కాదు. అక్కడ పేర్లు గమ్మత్తుగా ఉంటాయి. సీమలో రాజుగారి పేరు ఏదో ఉండాలి చమ్మా! ఆ గుర్తొచ్చింది! విల్లియమ్మ" అన్నాడు ఊరిపెద్ద.

"విల్లియమ్మ ఏంటి? పిండివడియంలా" వీరమ్మ మాటలకు కొందరు నవ్వారు.

"నవ్వండి నవ్వండి! కలకటేరుగారికి తెలిస్తే తుపాకీతో కాల్చి పారేస్తారు"

అందరూ నోరు మూసుకున్నారు.

"సరే పోయి పనులు చూసుకోండి. నేను సాయంకాలం బయల్దేరి నాగలాపల్లె కరణంగారింటికి వెడతాను. రేపుదయమే తిరిగి వస్తా" అన్నాడు ఊరిపెద్ద.

అందరూ లేచి సముద్రం దగ్గర ఆడుకుంటున్న పిల్లలను రెక్కలుచ్చుకుని ఈడ్చుకుంటు గుడిసెలవైపు బయల్దేరారు.

పుల్లమ్మతో ఆమె కొడుకు నాగన్న "అమ్మా! ఒక్కమాట" అన్నాడు.

ఏమిటన్నట్లు చూసింది పుల్లమ్మ.

నాగన్న చెప్పనా? వద్దా? అని తటపటాయించాడు.

"ఏంట్రా నాగన్నా! ఏమిటి? పెళ్ళికి చొక్కాయి కానీ కుట్టించమంటావా? "

చిన్నపంచే, తుండుగుడ్డా తప్ప బట్టలు తెలియని బీదవారికి చొక్కాలు కుట్టించుకోడమంటే అపురూపమే.

"అదికాదమ్మా! నాకు చొక్కాయి వద్దు"

"మరేం కావాలి? "

"నేను చేపలు పట్టడానికి పోతాను"

"నువ్వా, వెర్రినాగన్నా, పదిహేను ఏళ్ళన్నాలేవు. నువ్వేం పోతావు? మీ నాయనన్నా ఉంటే నీకు చేపలు పట్టడం నేర్పేవాడు. పోనీ చిన్నాన్నయినా లేడు. చెప్పాపెట్టకుండా చెన్నపట్నం పోయాడు. నీకు చేపలు పట్టడం ఎలా వస్తుంది? నావ నడపడమైనా రాదు"

"ఇంకోళ్ళ నావలో వెడతా"

"అయ్యో తండ్రీ! నీకేం తెలీదు. వాళ్ళు నీ చేపలు కూడా వాళ్ళవే అంటారు"

"నాకు చేపలు పట్టడమే రాదన్నావుగా. ఇప్పుడు నా చేపలు వాళ్ళు లాక్కుంటారంటావేంటి? "

పుల్లమ్మ మెటికలు విరిచింది.

"నా తండ్రే! ఎన్ని తెలివితేటలురా, నా కడుపున పుట్టావుకానీ, లేకుంటే ఏ కనిస్టేబో, కలకటేరో అయ్యేవాడివి"

"కలకటేరవాలంటే దొరలింట్లో పుట్టాలి కానీ, అమ్మా నేను చేపలు పడతానే"

"పిల్లాడివి నువ్వు పట్టడమేమిట్రా? "

"నేను చిన్నవాణ్ణేమిటి? దొరతనానికి రూపాయిన్నర నాకోసం పన్ను కడుతున్నావా? లేదా? నువ్వేమో కట్టెలు కొట్టడం, వడ్లు దంచడం.. నేనేమో తిని

కూచోడం నామోషీగా ఉంది"

"నాకున్నది నువ్వొక్కడివేరా నాగన్నా! వరసగా అయిదుకాన్పుల్లో పిల్లలు పుట్టడం, గిట్టడం.. మీ నాయనమ్మ మీ నాయనకి మారు మనువు చేస్తానని పట్టుపట్టింది. ఏడిచి, ఏడిచి కన్నీళ్ళు కూడా మిగల్లేదు నాకు. నాగదేవతకు మొక్కుకోమని మా అమ్మా నాన్నా చెప్పారు. రోజూ పుట్టచుట్టూ తిరిగి దండం పెట్టుకునేదాన్ని. ఏడాది తిరగకుండా కడుపొచ్చింది. నువ్వు పుట్టావు. నాగన్న అని పేరుపెట్టుకున్నా. నీ చెల్లి కడుపున పడింది. మీనాన్న పైకెళ్ళిపోయాడు. నిన్ను సంద్రంలోకి నావలో పంపి నేనుండలేనురా"

"అలాగైతే ఎలాగే అమ్మా! ఏ పనీ చెయ్యకుండా తినికూచోనా? నా వయస్సు వాళ్ళంతా చేపలు పట్టడం లేదా? "

"నీ వయస్సు వాళ్ళెవరు? వాళ్లంతా పెద్దాళ్ళే"

"నాకెన్నేళ్ళు? "

"పదిహేను"

నాగన్న నవ్వాడు

నేనూ, సూరయ్యగారి వెంకన్నా ఒకేసారి పుట్టామంటావు కదా. వాడు ఇరవై ఏళ్ళని చెప్తున్నాడు"

"ఆ బడాయి. ఎక్కువ చెప్తున్నాడు"

నాగన్న మళ్ళీ నవ్వి "పోనీ పదిహేనే అనుకుందాం. అయితే మాత్రం పనికివెళ్ళకూడదా? " అన్నాడు.

"చూద్దాంలే"

"చూద్దాం కాదు చేద్దాం. వచ్చేయేడు దొరతనానికి నేనే పన్నుకట్టుకుంటా"

"సరేలే మీ చిన్నాన్నకి చెన్నపట్నం కబురెడతాను. నీ లగ్నం వేళకి రమ్మంటా. అప్పుడు ఏదో ఒకటి చేద్దాంలే"

"మామంచి అమ్మ" అన్నాడు నాగన్న .

"నా కన్నతండ్రి" అంది పుల్లమ్మ.

★ ★ ★

ఆ రాత్రి నాగన్న వెన్నెలలో సముద్రతీరాన స్నేహితులతో కర్రసాము అభ్యాసానికై వెళ్ళాడు. తొటికోడళ్ళు పుల్లమ్మా, లచ్చమ్మా దిగాలుగా కూచున్నారు.

"మగమనిషికి ఏడాదికి రూపాయిన్నర, ఏడాదికి మూడు రూపాయలు ఆడాళ్ళం ఇద్దరం ఎలా తెస్తాం? " అంది పుల్లమ్మ.

"మాయదారి తాగుడే లేకుంటే మనం తెచ్చేపని ఉండేదేకాదు" అంది లచ్చమ్మ.

"నిజమే ఏం చెయ్యాలి? నా మొగుడికన్నా నీ మొగుడు నయం. బతికే ఉన్నాడు. సంపాదించి తెస్తానని చెన్నపట్నం పోయాడు. తాగితాగి నా పెనిమిటి చచ్చేపోయాడు"

"అదే నయం" అంది లచ్చమ్మ

"అదేంటే అలాగంటావు? "

"ఏమనమంటావక్కా. చేపలు పట్టుకురావడం, ఎండపెట్టడం, ఏదో లాభానికి అమ్ముతాడులే అనుకునేలోగా అప్పుచేసి తాగెయ్యడం. ఎండు చేపలమ్మి అప్పుతీర్చడం అప్పుతీరేనా, పెట్టేనా, వడ్డీకే సరిపోదు. రూపాయికి ఆరు నెలలకి పావలా వడ్డీ. ఇంక అసలు ఎప్పుడు తీర్చేది? అందుకే చెన్నపట్నంలో సంపాదించుకొస్తానని పోయాడు. రెండేళ్ళయింది. ఇంతదాకా మొహం చూపించలే"

"ఇదిగో ఇప్పుడు కబురెడుతున్నాగా వస్తాడులే"

"ఎలా పెడతావు? "

"పిఠాపురం రాజావారు చెన్నపట్నం వెడుతున్నారట. కిందటినెల వడ్లుదంపుళ్ళకి వెళ్ళినప్పుడు తెలిసింది. ఆయన పల్లకీ బోయీలలో ఒకడు మా మేనత్త మనవడులే, వాడికి చెప్పి పంపుతా"

లచ్చమ్మ నీరసంగా నవ్వింది.

"ఒసే లచ్చీ మరీ డీలా పడిపోకే, నీ పెనిమిటికి నాగన్నంటే పిచ్చి ప్రేమ. లగ్గానికి తప్పకుండా వస్తాడు"

"ఏమో అక్కా! ఇక్కడ కల్లు మాత్రమే తాగేవాడు. అప్పుడప్పుడు సారాయి పుచ్చుకునేవాడు. చెన్నపట్నంలో సారాయి మాత్రమే తాగుతున్నాడో ఏమో? అక్కడ ఎన్ని అప్పులు చేశాడో? నీకు నాగన్న అయినా ఉన్నాడు. నాకు సంతు కూడా లేదు" లచ్చమ్మ వెక్కివెక్కి ఏడిచింది.

పుల్లమ్మ తోటికోడల్ని దగ్గరకు తీసుకుని "ఊరుకోవే లచ్చీ! ఊరుకో! మరిది ఈ పాటికి తాగుడు మానేసే ఉంటాడు. అక్కడంతా దొరలే కదా. వాళ్ళు తాగనిస్తారేమిటి, బొక్కలోకి తోసేస్తారు" అంది.

లచ్చమ్మ కళ్ళు తుడుచుకుని "దొరలే ఇంకా తాగేలా చేస్తారు. ముంతకింత అని పన్నుకొట్టెయ్యచ్చు. ఏమోలే నీమాట నిజమై తాగుడు మానేశాడేమోలే" అంది.

★ ★ ★

వారం గడిచింది. నాగలాపల్లె వెళ్ళిన ఊరిపెద్ద తిరిగివచ్చాడు. కరణంగారితో మాట్లాడాననీ, నెల్లాళ్ళు ఆగడం కుదరదనీ, ఇరవై దినాలైతే ఊరుకుంటానన్నారనీ చెప్పాడు. వచ్చే పున్నమినాటికి అందరూ మగమనిషికి రూపాయిన్నర చొప్పున పట్టుకొచ్చి తనకు అందచేస్తే తను పట్టికెళ్ళి కరణంగారికి ఇచ్చేస్తానన్నాడు. అందరిలో గుబులు మొదలైంది.

వెంకయ్య ఒక్కడే మీసం మెలేసి "ఈ రాత్రే బయల్దేరి పోతున్నా, నావలో పట్టి నన్ని చేపలు పట్టేస్తా.. పెద్దాపురం, పిఠాపురం, రాజమండ్రం, తుని, కాకినాడ.. అన్ని ఊళ్ళూ తిరిగి అమ్మేస్తా. నాకు భయమేమిటి? " అన్నాడు.

వెంటనే భార్య గౌరమ్మ "అవును నీకు భయమేంటి? అదే ఉంటే ఇన్ని కల్లుముం

తలు ఖాళీ చేసేవాడివా?" అంది.

"ఒట్టు ముంత ముట్టుకుని మూడు నాళ్ళయింది"

"ఏం కల్లు మానేసి సారాయి తాగుతున్నావేంటి?"

"ఏమిటే పేట్రేగిపోతున్నావు? కల్లూ లేదు, సారాయిలేదు"

"ఎలా ఉంటుంది? తాగడానికి డబ్బులుండొద్దా? షావుకారు ఇక అప్పివ్వనని ఉంటాడు"

"నోర్మూసుకోండి" అంటూ ఊరిపెద్ద గదమాయించాడు. కానీ ఆ పెద్దాయన మనస్సు ఊరుకోలేదు. ఇప్పటికి అందరి నోళ్లూ మూయించాడు కానీ కల్లూ, సారాయి తాగకుండా ఎవరినోరైనా మూయించగలడా? మొన్న పుల్లమ్మ చెప్పినట్లుగా అయిదరాబాదు నవాబుగారి జమానాయే బాగుండేదా? కల్లుమీద పన్ను లేదు. కుంఫిణీ దొరల రాజ్యమొచ్చాక అన్నింటికీ పన్నులే. తాటితోట మొత్తం ఎవడో ఒకడు వేలం పాడుకుని కల్లుతీసి అమ్ముకోవడం, దొరలకి పన్నుకట్టడం. నవాబుగారి జమానాలో ఇంతగా కల్లు తీసేదీలేదు, తాగేదీలేదు. ఎవరింట్లో తాటిచెట్లకి వారే కల్లు తీసుకునేవారు, తాగేవారు. ఇప్పుడంతా సరకారు మాట ప్రకారమే చెయ్యాలి. ఇంత తాగుడూ, ఇన్ని రకాల పన్నులూ లేకుండా ఉంటే ప్రాణం సుఖంగా ఉండేది కాదా?

"ఏమిటి పెద్దయ్యా, ఏమిటాలోచిస్తున్నావు?" అన్నాడొక యువకుడు.

"ఏమీలేదు. పన్నుకట్టేదాకా కల్లు ముట్టనని ప్రమాణం చెయ్యండి"

"ఎప్పటికీ కల్లు ముట్టనని ప్రమాణాలు చేయించు పెద్దయ్యా! కల్లేకాదు సారాయి కూడా వద్దని చెప్పు" అంది లచ్చమ్మ.

"నీ మొగుడిక్కడ లేడుగా! నీకేంటి బాధ?" అంది వీరమ్మ.

"లేడు కాబట్టే నాకు బాధ, వాడున్నా లేకున్నా రూపాయిన్నర తీరువా నాకు తప్పుతుందా?" అంది లచ్చమ్మ.

★ ★ ★

పుల్లమ్మా, లచ్చుమ్మా గుడిసె ముందు కూచుని మాట్లాడుకుంటున్నారు.

"మూడు రూపాయలు ఎక్కడ నుంచి తేవాలి?"

"అప్పు చెయ్యడానికీ లేదు. షావుకారు దగ్గర ఇప్పటికే తీర్చలేనంత అప్పుంది"

"ఏడాది పాటు అడవిలో కొట్టిన కట్టెలన్నీ మీ ఇంటికే వేస్తానంటే కాకినాడలో ఎవరైనా పైకమిస్తారేమో?"

"ఏడాదికి వేసే కట్టెలు మూడు రూపాయలు చేస్తాయేమిటి?"

"నిజమే. మనగుడిసె నాలుగు రూపాయలు చెయ్యదు. దాంట్లో కాపురముండే మగ మనుషులమీద మూడు రూపాయల తీరువా!"

తోటి కోడళ్ళిద్దరూ మాట్లాడుకుంటూండగా దూరంగా కలకలం.. ఇద్దరూ లేచి నిలబడి చూశారు. పల్లకీలు మోస్తున్న బోయీల 'ఒహోం ఒహోం' శబ్దాలు గాలిలో తేలి వస్తున్నాయి. రెండు ఎద్దుబళ్ళూ, పది, పన్నెండు పల్లకీలూ, సామాన్లు మోస్తున్న కూలీలూ కన్పించారు.

"ఎవరో కలిగిన వాళ్ళు కాశీయాత్రకు పోతున్నట్లున్నారు" అంది పుల్లమ్మ.

నలుగురైదుగురు మగపిల్లలు పల్లకీల

**కొత్తగాలి...** 

**జబ్బు చేసిన వాడికంటే**
**డబ్బు చేసిన వాడే**
**ముందుగా**
**ప్రపంచానికి దూరమవుతాడు!**

– కె. నాగేశ్వరరావు,
విజయవాడ

వైపు పరిగెత్తారు. వాళ్ళల్లో నాగన్న ఉండడం గమనించిన పుల్లమ్మ "ఏమిట్రా బాబూ! ఎక్కడకా పరుగు? " అంది.

"వాళ్ళు దగ్గరలోనే డేరాలు వేసుకుంటా రట. చూసి వస్తానమ్మా" అంటూ నాగన్న పరిగెత్తాడు.

తోటి కోడళ్ళిద్దరూ వంటపనిలో పడ్డారు. అది పూర్తయే సమయానికి నాగన్న పరిగె త్తుకుంటూ వచ్చి "అమ్మోయ్, చిన్నాన్న వచ్చాడు" అన్నాడు.

లచ్చమ్మ చేతిలోని గంజికాచిన కుండ కింద పడబోయింది. నెమ్మదిగా తమా యించుకుని కుండ కిందపెట్టి "ఏంట్రా నాగన్నా ఏంటన్నావు? " అందామె.

"అవును చిన్నమ్మా! ఇప్పుడే వెళ్ళిన గుంపులో చిన్నాన్న ఉన్నాడు. వాళ్ళ అయ్యగారు కాశీ వెడుతున్నారట. ఇప్పుడే డేరాలు వేస్తున్నారు. చిన్నాన్నకి డేరాలు వెయ్యడం కూడా వచ్చు. అవి ఎంతబాగు న్నాయో? డేరాల గుడ్డ సీమ నుంచి వచ్చిందట, చిన్నాన్న చెప్పాడు"

"ఇంటికి రాలేదేంటి? " కొంత స్వగ తంగా, కొంతపైకి చెప్పినట్లుగా అనుకుంది లచ్చమ్మ.

"అక్కడ పనిపూర్తి కావాలి కదా. వాళ్ళ అయ్యగారిని అడిగి, ఆయన పంపితే కదా రాగలడు" అంది పుల్లమ్మ.

"సాయంత్రం వస్తానన్నాడు. చిన్నాన్న డేరాలు వేసి, నీళ్ళు తెచ్చిపెట్టాలిట. ఆపైన అయ్యగారూ, అమ్మగారూ వంట చేయించు కుని తింటారు. ఆ తరువాత బోయీలూ, కూలీలూ తినాలిట. అప్పుడొస్తానని చిన్నాన్న చెప్పమన్నాడు"

లచ్చమ్మ ముఖంలో సిగ్గూ, ఆనందమూ కలిసి తాండవించాయి.

పుల్లమ్మ తోటికోడలి బుగ్గమీద చిటికేసి "కొంతసిగ్గూ, సింగారమూ రాత్రికి దాచుకో. ఒరేయి నాగన్నా, తొందరగా తిండి పూర్తిచెయ్యి. నులక మంచం బిగిం చాలి. రాత్రికి చిన్నాన్న పడుకుందుకు కావాలి కదా" అంది.

ఇన్నాళ్ళకి తల్లి తనకు పని చెప్పినం దుకు నాగన్న పొంగిపోయాడు. తొందర తొందరగా భోజనం చేసేసి మంచం బిగిం చడం మొదలెట్టాడు. ఇంతలో పుల్లమ్మ గుడిసె శుభ్రం చేసి, లోపల ఉన్న చాపలూ, గిన్నెలూ బయటపెట్టింది. ఉన్న దెంతసామాను కనుక. నాగన్న బిగించిన నులక మంచాన్ని లోపల వేసి, దానిమీద బొంతవేసి, దుప్పటీ పరిచింది. తలవైపు గడ్డి కుక్కిన తలగడా పెట్టింది. మంచం వెయ్యగా మిగిలిన చోట్లో చిన్నముగ్గువేసి, ఒక మూల నూనెదీపం, మరోమూల కుంపటీ పెట్టింది.

"లచ్చీ, సాయంకాలమయ్యేసరికి స్నానం చేసి గళ్ళకోక కట్టుకో"

"పో అక్కా" సిగ్గుపడింది లచ్చమ్మ.

"రెండేళ్ళయింది మరిది చెన్నపట్నం వెళ్ళి. మళ్ళీ వెళ్ళకుండా చూసుకోవాల్మరి"

లచ్చమ్మ సిగ్గుల మొగ్గయిపోయింది. పుల్లమ్మ నవ్వుకుంటూ ఊరి బావి దగ్గరకు నీళ్ళు తీసుకురావడానికి వెళ్ళింది

★ ★ ★

సాయంత్రం పుల్లమ్మ వంట పొయ్యి దగ్గరకు లచ్చమ్మను రానివ్వలేదు. ఎక్కడ సంపాదించిందో కానీ బియ్యంతో అన్నం వండింది. చేపల పులుసు చేసింది. ముడి పెసలతో పప్పూ, వంకాయకూరా చేసింది.

చీకటి పడేవేళ నాగన్న పరిగెత్తుకుంటూ వచ్చి "చిన్నాన్న వస్తున్నాడు, చిన్నాన్న వస్తున్నాడు" అని అరిచాడు.

నాగన్న వెనకాలే రామయ్య వచ్చాడు. లచ్చమ్మ లేచి గుడిసెలో తలుపుచాటుకు వెళ్ళి నిల్చుంది.

"ఏం మరిదీ! పొద్దుండగానే వస్తావను కున్నాను" అంది పుల్లమ్మ.

"భోజనాలయ్యేసరికి మూడు జాము లైంది వదినమ్మా. అప్పుడు షావుకారు

దగ్గరకు వెళ్ళి అప్పు మొత్తం వడ్డీతో సహా చెల్లించేశాను. ఊరిపెద్ద దగ్గరకు మాట్లాడదామని వెడితే ఈ ఏడాది కట్టాల్సిన పన్ను గురించి చెప్పాడు. మా అయ్యగారి దగ్గరకు వెళ్ళి మూడు రూపాయలు తెచ్చి సూరయ్యా దగ్గర జమచేసి వచ్చాను"

పుల్లమ్మ ముఖం విప్పారింది. తలుపు చాటున నిల్చున్న లచ్చమ్మ ఆనందంతో పొంగిపోయింది. చిన్నాన్నలా సంపాదించడం లేదన్న బాధా, సంపాదించాలన్న కోరికా నాగన్నలో ఒకేసారి కదలాడాయి.

"సరేలే కాళ్ళు కడుక్కురా వడ్డించేస్తాను. లచ్చీ, విస్తరాకు పట్టుకురా"

"నాగన్నా రా నాతోపాటు భోజనం చేద్దువుగానీ" అంటూ రామయ్య తన అన్న కొడుకును పక్కనే కూచోపెట్టుకున్నాడు.

"నాగన్నకి మనువు కుదిరింది మరిదీ. నీకు కబురు ఎలా పెట్టాలా? అని అనుకుంటుండగా నువ్వే వచ్చావు"

"ఎవరి పిల్ల? "

"వాళ్ళది ఆలమంద. అల్లుడిది విజీనగరం కదా వాళ్ళకి చుట్టాలే"

"ఓలి ఎంత ఇవ్వాలి? "

"ఓలి ఇవ్వడం లేదు. మనువు ఇక్కడే మనింట్లో చెయ్యాలన్నారు"

రామయ్య అన్నం తింటున్నాడు.

"పిల్లకి వెండి మురుగులు చేయిస్తామనీ, పొందూరులో రెండు కోకలు నేయించి ఇస్తామనీ అన్నారు. పెళ్ళికి మనకి నాలు గైదు రూపాయలవుతుందేమో"

"రేపు మా అయ్యగారితో విషయం మాట్లాడుతా ఆయనేమంటారో తెలియదు. లగ్నమెప్పుడు? "

"పై పున్నమి వెళ్ళిన పంచమి"

రామయ్యా, నాగన్నా భోజనాలు చేశాక పుల్లమ్మా, లచ్చమ్మా తిన్నారు. మిగిలిన అన్నం, ఆదరువులు పుల్లమ్మ జాగ్రత్తగా దాచిపెట్టింది. రామయ్య లోపల నులక

మంచం మీద పడుకున్నాక ఆరుబయట తుడిచి రెండు ఈతాకుల చాపలు పరిచింది పుల్లమ్మ.

"రారా నాగన్నా! పడుకుందామిక్కడ. లచ్చుమ్మా నువ్వు లోపలకు వెళ్ళిపడుకో"

లచ్చుమ్మ నెమ్మదిగా లోపలకు వెళ్ళి తలుపువేసి మంచం పట్టె మీద కూచుంది. రామయ్య నెమ్మదిగా "అలా దూరంగా కూచున్నావేమిటి, పక్కన వచ్చి పడుకో" అన్నాడు. లచ్చుమ్మ కలదలేదు. "కోపం వచ్చిందా దూరంగా వెళ్ళిపోయానని? ఏం చెయ్యను? తాగుడుబారిన పడ్డాను. చేపల వేటలో ఉప్పునీటి మీద నావలో తిరిగేసరికి అలసట వచ్చేది. కొంచెం తాగితే నొప్పులు తగ్గుతాయనిపించేది. అదే అల వాటైపోయింది. అప్పులు పీకల్లోతు అయ్యాయి. అందుకే చెన్నపట్నం వెళ్ళాల్సి వచ్చింది. నిన్నొదిలి ఉండడం నాకు మాత్రం ఇష్టమా? "

అతడు లేచి కూచుని చుట్టూ చెయ్యివేశాడు. ఇంతలో దీపం ఆరింది. లచ్చుమ్మ లేచి జాగ్రత్తగా దీపం దగ్గరకు వెళ్ళి "నూనె అయిపోయినట్లుంది.. అక్క ఎందుకో నూనె తక్కువ పోసింది. మామూలుగా అయితే తెల్లారేదాకా వెలగాలి" అంది.

"వదిన కావాలనే తక్కువ పోసిందేమో" సరసమాడాడు రామయ్య.

"చీకట్లో నూనె గిన్నె ఎలా వెతకడం? "

"దీపంలా నువ్వెలిగి పోతున్నావుగా"

"పురుగూ, పుట్రా ఉంటాయి, దీపం లేకుండా ఎలా? " అందామె.

"అయితే నేను వెలిగిస్తాలే" అంటూ తన దగ్గరున్న చిన్నమూట విప్పాడతను.

"అందులో నూనె ఉందా? " అని అడిగిన లచ్చుమ్మతో 'ఉండు' అంటూ కుంపటి దగ్గరకు వెళ్ళి కొబ్బరి ఈనపుల్లను అంటించాడు. ఆ మంటతో తన దగ్గరున్న ఒత్తిని అంటించాడు.

లచ్చుమ్మ కన్నార్పకుండా చూసింది.

"ఏమిటిది? ఏం మాయ చేశావు? నూనె లేకుండా ఒత్తి వెలుగుతోంది? చెన్నపట్నంలో ఇలాంటి మాయలుంటాయా? "

రామయ్య విలాసంగా నవ్వాడు.

"మాయా కాదు, మంత్రం కాదు. ఈ వత్తులు సీమ నుంచి వచ్చాయి. మైనం వత్తులంటారు. దొరలు అదేదో అంటారు. ఆ.. గుర్తొచ్చింది. కాండీలు.. నూనె మాత్రమే కాదు. ప్రమిద కూడా అక్కర లేదు వీటికి"

"అయ్యబాబోయ్ సీమ దొరలంటే చాలా గొప్పవాళ్ళు"

"సరెలే ఇంక భయం లేదుగా రా" లచ్చుమ్మ వచ్చి భర్త పక్కన పడుకుని "అక్క ప్రమిదలో నూనె ఎందుకు తక్కువ పోసిందో" అంది.

"మనని కంతలోనుంచి ఎవరూ చూడకుండా" అన్నాడతను ఆమె చెవిలో.

"ఛీపో!" అంటూనే ఆమె అతని ఎద మీద తలపెట్టుకుని పడుకుంది.

అరగంట తర్వాత అలసటగా ఆనందంగా పడుకున్న లచ్చుమ్మ "ఒక్కటి అడగనా? అడిగిందిస్తావా? " అంది.

"తప్పకుండా! అయినా ఏమడుగుతావేమిటి? వెండి కడియాలా? "

"కాదు"

"చుట్టు చెంగావి చీరా? "

"అదీ కాదు"

"ఇంకేం కావాలి మరి? "

"నువ్విక్కడే ఉండు! చెన్నపట్నం పోకు" అతనిపై చేతులు వేసి అడిగిందామె.

రామయ్య ఉలిక్కిపడి లేచాడు.

"అదేమిటి అలా లేచి కూచున్నావు? నేనేమైనా తప్పుగా అడిగానా? "

రామయ్య ఆలోచనలో పడ్డాడు. చెన్నపట్నం వెళ్ళి సంపాదించకుండా ఉండడం కుదరదు. అది ఇప్పుడే చెప్పేసి భార్యకు నిద్రలేకుండా చెయ్యడం ఇష్టంలేదు. రేపు నెమ్మదిగా చెప్పేసరి అనుకున్నాడు.

"ఏంలేదు సీమమైనపు వత్తులు చాలా డబ్బుపోసి కొన్నాను. రాత్రంతా వృథాగా ఎందుకు వెలగనివ్వడం" అంటూ నోటితో ఊది ఆర్పేశాడు.

"అయ్యో దీపాన్ని ఊది ఆర్పకూడదు"

"అవి మన నూనె దీపాలకు పెట్టిన నియమాలు. దొరలు తయారు చేసే వత్తులకు కాదు"




ఉదయాన్నే నిద్రలేచిన లచ్చుమ్మకు పక్కన భర్త కనబడలేదు. 'పొద్దుటే లేచి పోయాడేమిటి' అనుకుంటూ గుడిసె బయటకు వచ్చింది.

"రామయ్య డేరాలకేసి వెళ్ళాడు. వాళ్ళ అయ్యగారితో నాగన్న పెళ్ళి గురించి చెప్పి వస్తానన్నాడు. డబ్బూదస్కం వారే సద్దాలి కదా? " అంది పుల్లమ్మ.

లచ్చుమ్మ ఊరిబావి దగ్గరకు కుండ తీసుకుని బయల్దేరింది. ఆమె వెళ్ళేసరికే నలుగురైదుగురు ఆడవాళ్ళు స్నానాలు చేసి నీళ్ళు తోడుకుంటున్నారు. లచ్చుమ్మను చూడగానే వేళాకోళాలు మొదలెట్టారు.

"ఏం లచ్చుమ్మా ఆలస్యంగా వచ్చావు"

"అబ్బో ముఖం వెలిగిపోతోందే"

"ఏమిటి చెన్నపట్నం సంగతులన్నీ రాత్రే చెప్పేశాడా? "

లచ్చుమ్మ కుండ కిందపెట్టి మైనపువత్తుల (కాండిల్స్) గురించి గొప్పగా వర్ణించి చెప్పింది. వాళ్ళు ఆశ్చర్యంగా విని "సాయంత్రం నీ గుడిసెకి వస్తాం.. నీ పెనిమిటిని మాక్కూడా వెలిగించి చూపించమను" అన్నారు.

లచ్చుమ్మ నీళ్ళు తోడుకుని ఇంటికెళ్ళేసరికి పుల్లమ్మ పొయ్యి రాజేసి గంజి కాస్తోంది "రాత్రి అన్నమూ, ఆదరువులూ మిగిలాయి. అవి మగాళ్ళిద్దరికీ పెడదాం. గంజీ, ఊరగాయా మనకి" అందామె.

లచ్చుమ్మ తల ఊపింది.

మధ్యాహ్నం రామయ్య వచ్చాడు.

"ఇదిగో వదినా అయిదు రూపాయలు. నాగన్న లగ్నానికి ఏర్పాటు చేసుకో"

"అదేమిటి మరిదీ నువ్వుండవా? "

"ఆ విషయమే అయ్యగారితో మాట్లాడి వస్తున్నా. ఇంకా రెండు నెలలుంది కదా! ఇప్పటి నుంచే నువ్విక్కడ ఏం చేస్తావు? సింహాచలం దాకా నువ్వూరా. ఆపైన విజీనగరంలో నేను ఇంకొక బోయీని పెట్టుకుంటాను. నువ్వు ఉప్పాడ వెనక్కి వచ్చెయ్యచ్చు అని అన్నారు"

"అయితే ఇప్పుడే వెళ్ళిపోవాలా? " బెంగగా అడిగింది లచ్చుమ్మ.

"లేదులే.. రేపు పిఠాపురం పాదగయలో తర్పణాలిస్తారట. ఈవేళ ఇక్కడుండి రేపు మధ్యాహ్నానికి వచ్చెయ్యమన్నారు"

లచ్చుమ్మ ముఖం కొద్దిగా వికసించింది. తను రాత్రి అడిగిన దాని గురించి భర్త ఇంతవరకూ ఏం చెప్పలేదు. రాత్రి మళ్ళీ అడిగితే సరి అనుకుంది.

"మరిదీ! మీ అయ్యగారు నువ్వెప్పుడడిగితే అప్పుడు నీ ఖర్చులకి డబ్బిస్తారా? "

పుల్లమ్మ ప్రశ్నకు రామయ్య నవ్వాడు.

"అడిగినప్పుడల్లా ఇవ్వడానికి ఆయనేమన్నా పిచ్చివాడా? నా నెల జీతం ఆయన దగ్గరే దాచుకుంటా. కావల్సినప్పుడు అడిగి తీసుకుంటా. నాదగ్గరే డబ్బు దాచుకుంటే ప్రమాదం"

"నీ నెల జీతమెంత మరిదీ? "

"ఏం వదినా ఆరాలు తీస్తున్నావు? "

"ఆరాలు తియ్యడమేమిటి? ఇష్టం లేక పోతే చెప్పొద్దు"

"నీకు కాకపోతే ఎవరికి చెప్తాను వదినా! నెలకి ఏడు రూపాయలు"

"బాబోయ్ నెలకి ఏడు రూపాయలే? ప నేంటి? మేనా మొయ్యడమేనా?"

"ఎక్కువగా అంతే. అయ్యగారు కోటకో, కోరటుకో వెడితే తీసికెడతా. అమ్మగారు అప్పుడప్పుడు గుడికి వెడతారు. అప్పుడు నన్నే పిలుస్తారు. చెన్నపట్నం బోయీల కన్నా ఉప్పాడ బోయీలంటేనే అందరికీ గురి" మీసం మెలేశాడు రామయ్య.

లచ్చుమ్మ భర్తను మురిపెంగా చూసింది.

నాగన్నకి చిన్నాన్న వీరాధివీరుడిలా కన్పించాడు. చిన్నాన్నలా అయిపోవాలి అని వాడి చిన్నగుండెలో కోరిక కలిగింది.

"అప్పుడప్పుడు మొక్కలికి నీళ్ళు పొయ్యడం, గొప్పులు తవ్వడం చెయ్యాలి"

"విశేషాలు తర్వాత చెబుదువుగానీ భోజనానికి పద" అంది పుల్లమ్మ.

భోజనాలైనాక అందరూ కాసేపు నడుం వాల్చేరు. పొద్దుగూకే లోపలే గుడిసె ముందు కలకలం మొదలైంది.

"పుల్లమ్మత్తా! రామయ్య లేడా?"

గుడిసెలోనుంచి పుల్లమ్మ ముందూ, రామయ్య వెనకా బయటకు వచ్చారు.

"ఏమిటి ఊరూవాడా ఏకమై వచ్చేశారు?" అంది పుల్లమ్మ.

"అరె రామయ్యా! నువ్వేదో నూనే, ప్రమిదా లేకుండా వెలిగే వత్తులు తెచ్చావుటగా చూపించు మరి!"

రామయ్య లచ్చుమ్మకేసి ప్రశ్నార్థకంగా చూశాడు. ఆమె సగం భయంగా, సగం గర్వంగా తల ఊపింది.

రామయ్య లోపలకు వెళ్లి మైనపువత్తి తెచ్చి చూపించాడు.

"అమ్మో! ఎంత పొడుగుందో!"

"తెల్లగా ఎంత బాగుందో! తెల్లవాళ్ళ దేశంలో అన్నీ తెల్లగా ఉంటాయి కాబోలు"

"ఓ సారి వెలిగించి చూపించవా?"

అందరి ముఖాలలో కుతూహలం.

"సంద్రంగాలి వీస్తోంది కదా! గాలికి ఆరిపోతుంది"

"సీమవత్తులు కూడా ఆరిపోతాయా?" వీరమ్మ అమాయకంగా అడిగింది. రామయ్య వత్తి వెలిగించడేమోనని అంతా నిరుత్సాహపడడం చూసి పుల్లమ్మ "మరిదీ, గుడిసెలో వెలిగించు. ఒక్కొరొక్కరే లోపలకెళ్ళి చూసొస్తారు" అంది.

"తొందర తొందరగా చూడండి. నాదగ్గరిదొక్కటే ఉంది. ఇంకొకటి కావాలంటే మళ్ళీ మా అయ్యగారిని అడగాలి. లేకుంటే చెన్నపట్నం వెళ్ళాలి" అంటూ రామయ్య గుడిసెలోకి వెళ్ళి కుంపటి ఊది కొబ్బరి ఈనెపుల్లతో వత్తి అంటించి నిలబెట్టాడు. గుడిసెలోకి వెళ్ళి చూసి వస్తున్న అందరి ముఖాలలో ఆశ్చర్యం! మైనం కరిగి నెమ్మదిగా కిందకి జారడం వాళ్ళందరికీ విచిత్రంగా కన్పించింది.

"చెన్నపట్నంలో అన్నీ ఇలాంటి వింతలే ఉంటాయా?"

"ఇదెంతటి వింత? ఇంకా గొప్ప వింతలుంటాయి" రామయ్య గర్వంగా చెప్పాడు. "అక్కడకి ఎన్ని ఓడలొస్తాయో! ఓడ అంటే ఏమిటనుకున్నారు? మనం చేపలుపట్టే పడవ కాదు. ఓ పెద్ద మేడలా ఉంటుంది. రాత్రి ఓడ వస్తే దారి తెలియడానికి పెద్ద స్తంభం కట్టి దానిమీద పెద్దమంట పెడతారు. ఆ పక్కనే కోట. కోట గోడలదాకా సంద్రం కెరటాలు వస్తాయి"

"మన విజీనగరం కోటలా ఉంటుందా?"

"ఛ! విజీనగరం కోటేమిటి? చెన్నపట్నం కోట విజీనగరం కన్నా పెద్దది"

"నువ్వెప్పుడైనా కోటలోకెళ్ళావురా?"

"అమ్మో! ఆ కోటలోకి మన్ని రానివ్వరు. అంతా తెల్లదొరలే"

"మరి బోయీలు లేకుండా పల్లకీ లోపలకెలావెడుతుంది?" ఎవరో సందేహం

వెలిబుచ్చారు.

రామయ్య తనే సీమ నుంచి దిగివచ్చి నట్లు గర్వంగా చూసి "తెల్లదొరలేమిటి, పల్లకీ ఎక్కడవేమిటి? వాళ్ళంతా గుర్రాల మీద లేదంటే గుర్రపు బగ్గీలమీద వెడ తారుకానీ పల్లకీలూ, మేనాలూ, ఎద్దుబళ్ళూ ఎక్కుతారేమిటి? " అన్నాడు.

"దొరసానులో? "

"వాళ్ళైనా అంతే! గుర్రాలే ఎక్కుతారు"

"అమ్మో ఆడాళ్ళు గుర్రమెక్కుతారా!"

"సీమలో అంతే! అక్కడి నుంచి ఇక్కడకొచ్చిన దొరసానులు సీమలోలా ఉంటారు కానీ మనలా ఉంటారేమిటి? "

అందరూ ఆశ్చర్యంగా వింటూంటే నుల కమంచం మీద కూచున్న రామయ్య సింహాసనం మీద కూచున్న మహారాజులా తనను తాను ఊహించుకున్నాడు. తాను చూసినవీ, విన్నవీ మాత్రమే కాక కొన్ని కల్పించి కూడా చెప్పడం మొదలెట్టాడు.

"బట్టలు ఎలా నేస్తారనుకున్నావు? మనవాళ్ళు నెమ్మదిగా పంచె నేసేసరికి నె ల్లాళ్ళు పడుతుంది. చెన్నపట్నంలో అలా కాదు. అన్నీ మరలు, యంత్రాలు, మన వాళ్ళు ఒక పంచె నేసేసరికి వాళ్ళు పాతిక పంచెలు నేసేస్తారు. అక్షరాలు చేత్తోరా యరు. వాటికీ మరలుంటాయి. కింద కాలితో తొక్కితే పైన కాయితం మీద అక్ష రాలొచ్చేస్తాయి. అన్నిటికీ మరలే! చెన్న పట్నం నుంచి కలకత్తాదాకా లైను దారివే శారు. మీరంతా చూస్తున్నారు కదా"

"అవును సీమ దొరలేం చేసినా గొప్ప గానే ఉంటుంది. మరమగ్గం మీద నేసిన పంచె నీ దగ్గరుందేమిటి? "

"అమ్మో! ఆ పంచెలు మా అయ్యగారి లాంటి వాళ్ళే కట్టుకుంటారు"

"ఒరేయి రామయ్యా, మరి కోటలోపల తెల్లదొరలే ఉంటారన్నావు. మీ అయ్యగా రిని కూడా రానివ్వరా? "

"పని ఉంటే లోపలకు పోవచ్చు"

"మరి అలాంటప్పుడైనా నువ్వు లోపలకు మేనా మోసుకుంటూపోలేదా? "

"నీకేం తెలియదు. కోట లోపలకు మేనాలో రానిస్తారేమిటి? మా అయ్య గారు కోట బయటే మేనా దిగి లోపలకు నడుస్తూ వెళ్ళాలి. దొర కుర్చీలో కూచుంటే నేలమీద కూచుని దస్త్రాలు రాయాలి. దొరలు భోజనం కూడా కుర్చీలో కూచుని బల్లమీద కంచాలు పెట్టుకుని తింటారు"

"అమ్మో!"

"అంత గొప్పోళ్ళు కాబట్టే సరకారు వాళ్ళ య్యారు. హైదరాబాదు నవాబైనా వాళ్ళేం చెప్తే అదే చెయ్యాలి తెలుసా? "

అందరూ రామయ్య చెప్పే విశేషాలూ, కోసేకోతలూ వినేసరికి బాగా రాత్రయింది.

"పొద్దుపోయింది. ఇక పోయి పడు కోండి" అంటూ పుల్ల మ్మ లేచింది.

ఆ రాత్రి నాగన్న కలల నిండా చెన్నప ట్నమూ, సీమరాజ్యమూ కలగాపులగంగా కదలాడాయి.

★ ★ ★

గుడిసెలోపలకు అడుగుపెట్టిన లచ్చ మ్మతో రామయ్య "వదిన ప్రమిద నిండా నూనెపోశాననీ, మైనం వత్తి దీపాన్ని దాచుకోమనీ చెప్పింది. దీపం ఆరిపోతుం దన్న భయం నీకక్కరలేదు" అన్నాడు.

లచ్చమ్మ మంచం మీద కూచుని "నిన్న అడిగినదానికి నువ్వేం చెప్పలేదు" అంది.

"ఏమడిగావు? " అన్నాడతను.

ఆమె అతని చేతిని తన చేతిలోకి తీసు కుని "చెన్నపట్నం వెళ్ళకు. ఇక్కడే ఉండిపో అని అడిగాను కదా" అంది.

"లచ్చీ! నిన్ను వదిలి పోవడం నాకు మాత్రం ఇష్టమా? నెలకి ఏడు రూపా యలు సంపాదిస్తున్నా. ఇక్కడుంటే ఏడా దికైనా ఏడు రూపాయలు దొరకవు. అప్పు మొత్తం తీర్చెయ్యగలిగాను. ఇంకా అయ్య గారి దగ్గర దాచుకున్న డబ్బుంది. ఒక్క నాలుగేళ్ళు కష్టపడితే నాలుగు ఎకరాలు

కొనచ్చు. నువ్వు కట్టెలూ కొట్టక్కరలేదు. నేను పల్లకీలూ మోయనక్కరలేదు. భూకామందులయి దర్జాగా బతకచ్చు"

"భూమెలా కొంటావు? మనం పొలాలు కొంటామంటే కరణంగారు ఒప్పుకోరు"

రామయ్య విలాసంగా నవ్వి "పిచ్చిదానా! నువ్వింకా పెద్దాపురం రాజుగారి రాజ్యమో, హైదరాబాదు నవాబుగారి జమానాయో అనుకుంటున్నావు. ఇప్పుడున్నది తెల్లదొరల ఏలుబడి. వాళ్ళకి మనలా కులం పట్టింపులుండవు. ఎవరి దగ్గర డబ్బుంటే వాళ్ళు ఏమైనా కొనుక్కోవచ్చు" అన్నాడు.

లచ్చమ్మ ముఖంలో ఆనందం. నాలుగెకరాల భూమి కొంటే దేనికీ తడుముకోనక్కరలేదు. గుడిసె తీసేసి పెద్దఇల్లు కట్టుకోవచ్చు. ఊరిబావికి వెళ్ళకుండా ఇంట్లో నుయ్యి తవ్వించుకోవచ్చు. జాగ్రత్తగా వ్యవసాయం చేసుకుంటే నాలుగెకరాలు నలభై ఎకరాలు చేసుకోవచ్చు. భవిష్యత్తు గురించి కలలు కంది లచ్చమ్మ.

**కొత్తగాలి...**

**మమ్మీ, డాడీ ఆంటీ**
**అందరికీ మోజే!**
**మాతృభాషకు మాత్రం**
**గుండె పోటే!!**

– వాసా ప్రభావతి,
హైదరాబాద్

మర్నాడు ఉదయమే ప్రయాణమవుతున్న రామయ్యతో నాగన్న "చిన్నాన్నా! నేనూ నీతో పిఠాపురం దాకా వస్తాను" అన్నాడు.

"అమ్మ ఏమంటుందో? " అన్నాడు రామయ్య.

"నువ్వు చెప్తే కాదనదు చిన్నాన్నా" అన్నాడు నాగన్న.

"అరి భడవా! ఎన్ని తెలివితేటలురా! నా చేత అడిగించుకుంటావా? నేను చెప్తే అమ్మ కాదనదని నీ ధీమా" అని చెప్పి పుల్లమ్మతో "వదినా! నాగన్న నాతో పిఠాపురం దాకా వస్తానంటున్నాడు. తీసికెడతా" అన్నాడు రామయ్య.

పుల్లమ్మ "ఒక్కడివీ వెనక్కు రాగలవా? దారి తప్పిపోతావేమో" అంది.

"మరీ చిన్నపిల్లాడిలా చూడకమ్మా. నీతో పిఠాపురం చాలాసార్లే వచ్చానుగా"

"సరే పొద్దుగూకక ముందే వచ్చెయ్యి. మరిదీ! మధ్యాహ్నం అన్నం తినగానే పంపించెయ్యి" అంది పుల్లమ్మ.

రామయ్య, నాగన్నలిద్దరూ పిఠాపురం వైపు నడక ప్రారంభించారు.

"ఏరా నాగన్నా ఏంటి సంగతి? "

"అదేంటి చిన్నాన్నా అలా అంటున్నావు? నీతో కాసేపు మాట్లాడాలని అన్పించిందంతే"

"అంతేనంటావా? "

"అంతే!"

కొంతదూరం నడిచాక రామయ్య "ఇదిగో నాగన్నా! పిఠాపురం దగ్గర పడ్డాక మాట్లాడుకుందుకు కుదరదు. మా అయ్యగారు గుడారాలు గుడి దగ్గర వేయించారో దారి మధ్యలోనే వేయించారో తెలియదు. అందుకే చెప్పాల్సిందేమైనా ఉంటే తొందరగా చెప్పెయ్యి" అన్నాడు.

నాగన్న చిన్నాన్నతో సమంగా నడుస్తూ "చిన్నాన్నా" అన్నాడు.

"చెప్పరా"

"అది కాదు చిన్నాన్నా. అమ్మ నన్ను పనిలోకి పంపడం లేదు. చేపలవేటకి వెడతానంటే వద్దంటుంది. నేను సంద్రంలోకి వెడితే తనకి భయమట"

"అవున్రా వదినకు నువ్వంటే వల్లమాలిన అపేక్ష. లేకలేక పుట్టావు. నీ ముందు చాలా మంది పుట్టి చనిపోయారు"

"అవును కానీ పని చెయ్యకుండా అమ్మ

రెక్కల కష్టం మీద ఎన్నాళ్ళు బతకను? "

"అమ్మతో నిన్ను చేపల వేటకి పంపమని చెప్పనా?"

"నువ్వు చెప్పినా అమ్మ వెళ్ళనివ్వదు. నీతో చెన్నపట్నం వస్తాను. నన్ను కూడా మీ అయ్యగారి దగ్గర పనిలో పెట్టు. నీతోనే ఉంటానంటే అమ్మ ఒప్పుకుంటుంది. సంద్రంలోకి వెళ్ళేపని కాదు కాబట్టి అమ్మకి భయముండదు"

రామయ్య ఆలోచనలో పడి మాట్లాడక పోవడంతో నాగన్న "ఏం చిన్నాన్నా ఏమీ చెప్పవు? " అన్నాడు.

"ఆలోచిస్తున్నా. నువ్వా వయస్సులో చాలా చిన్నవాడివి. మేనాలూ, పల్లకీలూ మోయలేవు. రాత్రి పహారా కాసే పని కూడా చెయ్యలేవు. ఏ పనిలో పెట్టుకోమని అడగాలా అన్నదే నా ఆలోచన"

"నీళ్ళు మోస్తాను. బట్టలుతుకుతాను"

"ఆ పనులన్నీ మేమంతా చేస్తూనే ఉన్నాం. సరేలే అయ్యగారినే అడుగుదాం"

నాగన్న ముఖం వికసించింది.

ఆనందంతో నడకవేగం పెంచిన అన్నకొడుకుని చూస్తూ రామయ్య 'అయ్యగారేదైనా పనిలో వీణ్ణి పెట్టుకుంటే బాగుండును' అనుకున్నాడు.

ఇద్దరూ పిఠాపురం చేరుకునేసరికి రామయ్య యజమానీ, భార్య, పరివారమూ పాదగయాక్షేత్రంలో పితృదేవతలకి తర్పణాలిస్తున్నారు. దగ్గరలోని బావి దగ్గర రామయ్యా, నాగన్నా స్నానం చేసి వచ్చాక యజమాని పురోహితులతో చెప్పి వారిద్దరితో కూడా తర్పణాలు ఇప్పించారు.

"మా అయ్యగారు మమ్మల్ని సొంతమనుషుల్లాగే చూసుకుంటారు" అన్నాడు రామయ్య.

వంటలు పూర్తయ్యాక యజమాని కుటుంబం భోజనం చేసింది. పరివారమంతా అన్నం తిని, గిన్నెలు తోమిపెట్టారు. అందరూ విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో రామయ్య నాగన్నను తీసుకుని యజమాని గుడారం దగ్గరకు వెళ్ళాడు. ఆయన మడతమంచం మీద పడుకుని పుస్తకం చదువుకుంటున్నారు.

"దండాలయ్యగారు" అన్నాడు రామయ్య. అతని కనుసైగతో నాగన్న యజమానికి నమస్కారం పెట్టి "దండాలండి అయ్యగారూ" అన్నాడు.

"రామయ్యా! ఎవరీ కుర్రవాడు? "

"మా అన్నకొడుకండీ! మా అన్నయ్య వీడి చిన్నప్పుడే పోయాడండి. వదినే పెంచి పెద్ద చేసిందండి. మీ దగ్గరేదైనా పని ఇప్పిస్తారేమోనని తీసుకొచ్చానండి"

"ఏ పని చెయ్యగలవురా? " అని నాగన్నని అడిగారాయన.

నాగన్నకి ఏం చెప్పాలో తెలియలేదు.

రామయ్యే "మీరేపని ఇస్తే అదే చేస్తాడండి. దొంగబుద్ధి లేదండి" అన్నాడు.

"నీ అన్న కొడుకూ నీలాగే మంచివాడే అయి ఉంటాడులే. కానీ చిన్న కుర్రాడు ఏం చెయ్యగలడా? అని ఆలోచిస్తున్నా. ఓసారి అమ్మగారికి కూడా కన్పించు. ఆలోచించి ఏ సంగతి చెప్తాలే"

రామయ్యా, నాగన్నా యజమానురాలి దగ్గరకు వెళ్ళి ఆవిడకు కూడా దండం పెట్టారు. ఆవిడ ఆదరించి విషయం కనుక్కుంది. "అయ్యగారిది జాలి గుండె. ఏదో పని ఇస్తారులే. సింహాచలం దాకా వస్తున్నావుగా. అప్పటికేదో ఒకటి నిర్ణయిస్తారు. పసిపిల్లాడు తల్లిని వదిలి ఉండగలడా? అని నా సందేహం" అంది.

సింహాచలంలో వరాహనరసింహస్వామిని దర్శించుకున్నాక యాత్రికుల బృందం విజయనగరం వెడుతూ ఆలమందలో రాత్రి ఆగింది. గుడారాలు వేసి, పడుకుందుకు ఏర్పాట్లు చేశాక రామయ్య యజమాని దగ్గరకు వెళ్ళాడు. డేరా లోపల్నుంచి యజమాని, ఆయన భార్య సంభాషణ విన్పిస్తోంది.

"కన్యాకుమారి నుంచి కాశ్మీరందాకా దేశ

మంతా తిరిగిన వాణ్ణి. ఎక్కడా కూడా ఉప్పాడ బోయీలకు సమానమైన మోత గాళ్ళు, బలాఢ్యులు, అందగాళ్ళు నాకు కన్పించలేదు. వారిలా ప్రయాసపడకుండా పనిచేసేవాళ్ళు కానీ, ఆయుధం పట్టగల వాళ్ళు కానీ లేరు. వీళ్ళని పనిలో పెట్టు కుంటే ప్రపంచం చుట్టి రావచ్చు. వాళ్ళలో ఒక్కటే లోపం. తాగుడువల్ల వారికి నష్టం, యజమానికి కష్టం"

"మన దగ్గరున్నవాళ్ళలో ఎవరికీ తాగే అలవాటున్నట్లు లేదు"

"ఇదివరలో ఉన్నవాళ్ళు కూడా నా దగ్గర పనిలో చేరితే మానెయ్యాల్సిందే"

"సరేకానీ రామయ్య అన్న కొడుకు విషయం ఆలోచించారా? "

"పనిలో పెట్టాలనే నిశ్చయించాను"

మాటలు వింటున్న రామయ్య సంతో షంగా డేరా గుమ్మంలోకి వచ్చి "దండాల య్యగారూ, దండాలమ్మగారూ" అన్నాడు.

"నీ సంగతే చెప్తున్నా రామయ్యా. డేరాల బొంగులను మొయ్యడానికి ఇద్దరు కళాసీలున్నారు. నీవాడూ బొంగులు మోయ్యాలి. రాత్రి ఒక జాము పహరా కా యాలి. ఈ రెండు పనులకీ కలిపి నెలకి ఏడురూపాయల జీతం. చెన్నపట్నం చేరు కునేదాకా పని సక్రమంగా చేస్తే పట్నంలో నా ఇంట్లో కొలువు ఇస్తా"

"తప్పకుండా చేస్తాడండి. ఈ జన్మకీ రుణం తీర్చుకోలేనండి" అంటూ రామయ్య యజమానికి పాదాభివందనం చేశాడు.

★ ★ ★

"రెండు పున్నములు గడిచిపోయాయి. పెనిమిటి ఇంకా రాలేదు. వాళ్ళ యజమా నికి విజయనగరంలో బోయీలు దొరక లేదా? నా మొగుణ్ణే కాశీకి తీసికెళ్లారా? " అని లచ్చమ్మ బెంగగా అనుకుంది.

"మరిది రాలేదు. కూతురూ, అల్లుడూ రాలేదు. ఆడపెళ్ళివారు వచ్చేస్తారేమో ఇంతపని నేను ఒక్కదాన్ని ఎలా నిభా యించగలను? " అని పుల్లమ్మ అనుకుం టూండగా దూరాన డప్పుల చప్పుడు విన్పించింది.

"అమ్మో లచ్చమ్మా! పెళ్ళివారు వచ్చేస్తు న్నారు కాబోలు! ఎలాగే? " అని పుల్లమ్మ

## చతురలో మొదటి నవల



**పాలంకి సత్య**

'చతురలో ఇది నా మొదటి నవల. తొలికథ 'నూరేళ్లపంట' 'విపుల'లో ప్రచురిత మైంది. తెలుగు, ఆంగ్ల రచనలు వివిధ దిన, వార, మాసపత్రికల్లో ప్రచురితమయ్యాయి. కొన్నిటికి బహుమతులూ వచ్చాయి.

గణిత, ఆర్థిక శాస్త్రాలలో స్నాతకోత్తరప ట్టాతో పాటు మద్రాసు విశ్వవిద్యాలయం నుంచి స్వర్ణపతకాన్ని అందుకున్నాను. తెలుగు విశ్వవిద్యాలయం నుంచి జ్యోతిశ్శా స్త్రంలో స్నాతకోత్తర పట్టానూ, 'యుగాది' చారిత్రాత్మక రచనకు ఉత్తమ నవలా పుర స్కారాన్ని పొందాను. పుట్టిందీ, పెరిగిందీ చెన్నై అయినప్పటికీ పశ్చిమ గోదావరి జిల్లా లోని కాకరపర్రు నా స్వగ్రామమని చెప్పుకో వడం ఇష్టం. కొంతకాలం రిజర్వ్‌బ్యాంక్ ఆఫ్ ఇండియాలో ఉద్యోగం చేశాను. రచనారం గంలో శ్రీవారు పాలంకి సత్యనారాయణ ఎంతో ప్రోత్సహిస్తున్నారు.

**చిరునామా:**
**పాలంకి సత్య**
301, విష్ణు రెసిడెన్సీ, సి- బ్లాక్
గాంధీనగర్, హైదరాబాద్ - 80

కంగారు పడుతుండగా ఒక పిల్లవాడు పరుగెత్తుకుంటూ వచ్చి "పుల్లమ్మమ్మమ్మా, నీ మరిది డప్పుల వాద్యంతో వస్తున్నాడు. అమ్మమ్మా! నాక్కూడా మైనం వత్తి చూపించమనవా? " అన్నాడు.

"అలాగేరా! లచ్చీ నులకమంచం బయట వెయ్యి. ఒరేయి పిల్లాడా ఎందరొస్తున్నారురా? "

"ఓ నలభై, యాభై, వంద" అంటూ కుర్రాడు పరిగెత్తాడు.

కొంతసేపటికి రామయ్య వస్తూనే "ఇదిగో వదినా నీ కూతుర్ని, అల్లుణ్ణీ కూడా తీసుకొచ్చాను. మీ వియ్యాలవారూ, నీక్కాబోయే వియ్యాలవారూ పిఠాపురంలో ఆగిపోయారు. రేపు ఉదయమే వస్తామన్నారు. ఎల్లుండి కదా లగ్నం" అన్నాడు.

పుల్లమ్మ మరిదికీ, అల్లుడికీ కాళ్ళు కడుక్కునేందుకు నీళ్ళిచ్చి "ఈ డప్పుల వాళ్ళెందుకు మరిదీ? " అంది.

రామయ్య "ఎందుకో నీ అల్లుడు నరసయ్యనే అడుగు" అన్నాడు.

పుల్లమ్మ అల్లుడివైపు చూసింది.

"లగ్నం నాటి రాత్రి బొబ్బిలి యుద్ధం కథ చెప్పిద్దామని తీసుకొచ్చా. డప్పులే కాదు శంఖాలు కూడా ఉన్నాయి. జంగందేవరలంటే ఏంటనుకుంటున్నావు? "

పుల్లమ్మ కొంచెం భయంగా "ఎంత ఇవ్వాలి? " అడిగింది.

"ఏమక్కరలేదు. మనతో పాటు భోజనం, వెళ్ళేటప్పుడు తాంబూలంలో పావలా లేదా పరక"

"అల్లుడూ! నీది విజీనగరం కదా! బొబ్బిలి కథ చెప్పించడమేమిటి" అన్నాడు రామయ్య.

నరసయ్య నవ్వి "కథ వింటే అందరికీ తెలుస్తుంది బొబ్బిలి రాజులెంత దుర్మార్గులో? విజీనగరమే గొప్ప అని మీ ఊళ్ళో అందరి చేత ఒప్పిస్తా" అన్నాడు.

మర్నాడు ఆడపెళ్ళివారూ, పుల్లమ్మ వియ్యాలవారూ వచ్చారు. ఊళ్ళో వాళ్ళందరినీ పెళ్ళికీ, భోజనాలకీ పిలవడానికి రామయ్యా, లచ్చమ్మా డప్పుల వాయిద్యాలతో వెళ్ళారు. పెళ్ళి పిలుపుల సంరంభం చూసిన ఊరిజనం పుల్లమ్మ కొడుకు పెళ్ళి పెద్ద ఎత్తునే చేస్తోందనుకున్నారు. అయితే పెళ్ళిలో భోజనమే కానీ తాగుడు ఉండదని రామయ్య చెప్పడంతో మగవాళ్ళలో నిరుత్సాహం కన్పించింది. ఆడపెళ్ళి వారికీ ఆ వార్త అంతగా నచ్చినట్లు లేదు. అయితే లగ్నం నాటి రాత్రి బొబ్బిలి కథ చెప్పిస్తామని అనగానే అందరూ కొంత తృప్తి పడ్డారు. ఎప్పుడో కానీ జంగంవాళ్లూ, బుర్రకథల వాళ్లూ ఆ ఊరురారు.

లగ్నం సమయంలో పెళ్ళికొడుకైన తన కొడుకునీ, పీటల మీద కూచున్న మరిదీ తోటికోడళ్ళనీ, అటూఇటూ తిరుగుతూ అజమాయిషీ చేస్తున్న కూతురునీ అల్లుణ్ణీ చూసి పుల్లమ్మ మురిసిపోయింది. ఆడపెళ్ళివారు ముందుగా అంగీకరించిన చీరలూ, నగలూ పెట్టి అమ్మాయిని పెళ్ళికూతురిగా అలంకరించి కన్యాదానం చేశారు. భోజనాలు చాలా బాగున్నాయని ఊరంతా మెచ్చుకున్నారు. అంతా మరిది గొప్పతనమేనని పుల్లమ్మ చెప్పింది.

రాత్రికి జంగంవారు బొబ్బిలి కథ చెప్పారు. ఊరు ఊరంతా తరలివచ్చి నేల మీద కూచున్నారు. యుద్ధఘట్టాలు వర్ణించేటప్పుడు శంఖాలు ఊదుతూంటే యువకులంతా చప్పట్లు కొడుతూ తామే యుద్ధం చేస్తున్నట్లు అభినయం ప్రారంభించారు. బొబ్బిలి రాజులు ఓడిపోతున్నామని తెలిసి రాణివాసాన్ని అగ్నిప్రవేశం చెయ్యమంటే స్త్రీలు తామే మరణించాల్సి వచ్చినట్లు భయపడుతూ దుఃఖించారు. విజయనగర రాజుని తాండ్రపాపారాయుడు చంపినప్పుడు 'మా బాగా అయింది' అని అందరూ అనుకున్నారు. చిట్టచివరకు ఫ్రెంచి సేనాని బుస్సీ, బొబ్బిలి రాజకుమారుడైన

పసిబాలుడిని రాజుగా చేసి ఇతనే బొబ్బిలి సింహాసనానికి వారసుడని చాటినప్పుడు 'ఎంతైనా తెల్లదొరలు మంచివాళ్ళు' అని మెచ్చుకున్నారు.

కథ పూర్తయ్యేసరికి మూడు జాముల పొద్దయింది. దూరంగా సముద్రం నేలను తాకే చోట తొలి సంజె వెలుగు కన్పిస్తోంది. బొబ్బిలియుద్ధంలో ఎవరిది ధర్మం? ఎవరిది అధర్మం? అన్న చర్చ ప్రారంభమైంది.

"అసలు మా విజీనగరం రాజుగారిదే న్యాయం, ధర్మమూను. బొబ్బిలిరాజులే అస్తమానం యుద్ధాలకు వస్తే మా రాజుగారేం చేస్తారు? రాజమండ్రం దాకా వచ్చి తెల్లదొరలని పిల్చుకుపోయారు. తెల్లదొరలు బొబ్బిలి కోటను నేలమట్టం చేస్తే తాండ్రపాపారాయుడొచ్చి మా రాజుగారినెందుకు చంపాలి? " అన్నాడు నరసయ్య.

"రాజుగారిని చంపితే చంపనీ. తాము చావక ముందే ఆడాళ్ళందరినీ చావమని ఎందుకు చెప్పాలి? ఆడాళ్ళందరూ చచ్చాక తాము చావకపోతే ఏమయ్యేది? మళ్ళీ పెళ్ళిళ్ళు చేసుకునేవారా? " అంది వీరమ్మ.

"వాళ్ళు చస్తే మాత్రం ఆడాళ్ళు చావాలేమిటి? కట్టెలు కొట్టుకునో, వడ్లు దంపుకునో బతికేవారు కదా? " అంది పుల్లమ్మ.

"నువ్వూరుకోవే అమ్మా! వాళ్ళంతా రాణివాసం ఆడాళ్ళు. నీలా కట్టెలు కొడతారేమిటి" అంది పుల్లమ్మ కూతురు నాగమ్మ.

"పోనీ కట్టెలు కొట్టరు. కొడుకులని చూసుకుంటారా? ఆ మల్లమ్మ రాణీగారే ఉంటే చినరంగారావుగారికి అమ్మ ఉండేది. పాపం తల్లిలేని పిల్లవాడయ్యాడు"

"అవును చినరంగారావులుంగారికి పెళ్ళయిందా? పిల్లలున్నారా? " ఊరిపెద్ద సూరయ్య అడిగాడు.

నరసయ్య "వరసకి చిన్నాన్న అయిన ఆయన చినరంగారావుని దింపి తనే రాజయ్యాడు. ఈయన నైజాం రాజ్యానికి పారిపోయాడు. బొబ్బిలిలో ఏదీ సవ్యంగా ఉండదు" అన్నాడు.

నాగమ్మ "ఎప్పుడూ విజీనగరం గొప్పలు చెప్పకు. మీ రాజావారు నారాయణ గజపతిగారు అని నువ్వు చెప్పుకోడమే కానీ ఆయన కాశీవాసం చెయ్యడం లేదా? ఇక్కడ రాజ్యమంతా విశాఖపట్టణం కలకటేరు అధీనంలోనే ఉంది కదా? రాజావార్ధు తన కొడుక్కి ఉత్తరాది సంబంధం చేశారనీ నువ్వే వాపోయావు" అంది.

నరసయ్య "ఛత్! ఊరుకో! మా రాజావారిని అంటే కళ్ళు పోతాయి" అన్నాడు.

నాగమ్మ "కళ్ళుపోయినా నీకు నాతో కాపురం తప్పదు" అంది.

పుల్లమ్మ కూతుర్ని "నోర్మూసుకో" అని మందలించింది.

నరసయ్యను ఊరిపెద్ద "చినరంగారావుగారు అయిదరాబాదు రాజ్యంలోనే ఉన్నారా? " అడిగాడు.

"లేదు. తెల్లదొర మళ్ళీ ఆయన రాజ్యం ఆయనకి ఇప్పించారు"

రామయ్య "ఎంతయినా తెల్లదొరల జమానాయే జమానా! వాళ్ళకి మన రాజుల్లా కొట్టుకోడాలుండవు. రాజుగారి తర్వాత వారి పెద్ద కొడుకే రాజు, వారి తర్వాత వారి పెద్ద కొడుకు. సీమలో యుద్ధాలుండవు. అందుకే యుద్ధం చెయ్యాలంటే ఇక్కడకు వస్తారు" అన్నాడు.

పద్దెనిమిది, పంతొమ్మిదవ శతాబ్దంలో తెల్లదొరలంటే దేవతలన్నంత గాఢమైన నమ్మకం ఉండేది శ్రామికవర్గంలో. మహారాజులూ, నవాబులూ తమ సింహాసనం నిలుపుకోడానికీ, శత్రురాజులను జయించడానికీ తెల్లవారిని ఆశ్రయిస్తున్నప్పుడు సామాన్యుల ఆలోచనాసరళి ఇలాగే ఉండేది.

★ ★ ★

నాగన్న పెళ్ళి అయిన వారం తరువాత ఆడ పెళ్ళివారు పెళ్ళి కూతుర్ని కొన్నాళ్ళు తమ దగ్గర ఉంచుకుని ఆపైన కాపురానికి

పంపిస్తామని చెప్పి ఆలమందకు వెళ్ళిపోయారు. బంధువులు అంతకుముందే వెళ్ళిపోవడం వల్ల పుల్లమ్మకు ఇల్లు బోసిబోయినట్లనిపించింది. గుడిసె ముందు ఆమెతో పాటు మరిదీ, తోటి కోడలూ, కూతురు, అల్లుడూ, కొడుకూ కూచుని ఉన్నారు.

"ఏదో మీరు నలుగురూ ఉన్నారు కాబట్టి మరీ వెలితిగా లేదు" అంది పుల్లమ్మ.

రామయ్యకు ఆమెతో ముఖ్యమైన సంగతి మాట్లాడడానికి ఇదే సరైన సమయమనిపించింది. అందుకే నెమ్మదిగా "వదినా! నాగన్న సంగతి ఏం చేద్దామనుకుంటున్నావు? " అన్నాడు.

పుల్లమ్మ ఆశ్చర్యంగా "ఏం చెయ్యడమేమిటి, పెళ్ళి చేసేశాం కదా? " అంది.

"నేను అడిగేది అదే, పెళ్ళి చేశాం కదా. రేపు పిల్లలు పుట్టుకొస్తారు. పెళ్ళాం పిల్లలకు తిండి పెట్టాలి కదా. ఇక చేపల వేటకు పంపించాలి"

"అమ్మనాయనోయ్! నా బంగారు తండ్రిని సంద్రం మీదకు పంపించను"

"వదినా! ఈవేళ ఉన్న ఓపిక నీకు రేపుండదు. ఎన్నాళ్ళని కట్టెలు కొట్టగలవు? కొడితే మాత్రం ఎంత గిడుతుందేమిటి? రేపు నాగన్నకి మగపిల్లాడు పుడితే ఇంకో రూపాయిన్నర సరకారుకి కట్టాలి. అందుకే చేపల వేటకు పంపించు"

"నేను సంద్రం మీదకు పంపించను"

"అయితే నాతో చెన్నపట్నం పంపించు"

నాగన్నకు తన చిన్నాన్న అటు నుంచి ఎలా నరుక్కొస్తున్నాడో అర్థమై చాలా సంతోషం కలిగింది. పుల్లమ్మకు మరిది ఎత్తుగడ అర్థం కాలేదు.

"చెన్నపట్నమా? అక్కడ నీ దగ్గర తిని కూచోడమెందుకు, ఇక్కడే ఉండచ్చుగా"

"చెన్నపట్నంల్లో ఎవరూ తిని కూచోరు. అందరూ పని చేస్తారు"

"వాడేం చేస్తాడు? నాకు తెలీకుండా అక్కడి సంద్రంలో వేటకు పంపుతావా? "

"మా అయ్యగారితో నాగన్న విషయం మాట్లాడాను. డేరా బొంగులు మోసే పని ఇస్తానన్నారు. నెలకు ఏడు రూపాయల జీతం. కాశీయాత్ర పూర్తిచేసుకుని వచ్చేటప్పటికి సిద్ధంగా ఉండమన్నారు"

"చెన్నపట్నమా? అంత దూరమే"

వెంటనే ఆమె కూతురు అందుకుని "ఏం నన్ను విజీనగరం పంపలేదా? అవునులే కొడుకు నాగన్న బంగారు కొండ. కూతురు నాగమ్మ ఇనపముక్క" అంది.

"అది కాదు నాగమ్మా నాకిద్దరూ రెండు కళ్ళు. ఒక కన్ను ఎక్కువా, ఒక కన్ను తక్కువా అవుతుందా? నిన్ను పెళ్ళి చేసి పెనిమిటితో పంపాను. అది ధర్మం"

"ఇప్పుడు నాగన్నని ఒక్కణ్ణీ పంపడం లేదు కదా. చిన్నాన్నతోటేగా పంపేది. ఇది తెల్లదొరల రాజ్యం. ఏ భయమూ ఉండదు" అంది నాగమ్మ.

నరసయ్య అందుకుని "అత్తమ్మా చెన్నపట్నానికి మా విజీనగరం నుంచి, బరంపురం నుంచీ, గంజాం నుంచి చాలా మంది వెడుతుంటారు. ఓడల్లో సరకు మోసే కళాసీలకు చాలా ఆదాయమట. నాకూ పోవాలనిపిస్తుంది. తాత ఒప్పుకోడం లేదు" అన్నాడు.

రామయ్య "వదినా! ఆలోచించుకో, సంద్రం మీదకే పంపుతావో, చెన్నపట్నమే పంపుతావో నీ ఇష్టం" అన్నాడు.

నాలుగు రోజులు గడిచాయి. పుల్లమ్మ ఎవరితోనూ ఏ సంగతీ మాట్లాడడంలేదు. బలవంతంగా ఆమెను ఒప్పించడం కానీ, ఆమె ఇష్టపడకపోయినా తీసికెళ్ళడం కానీ రామయ్యకు ఇష్టంలేదు. నెమ్మదిగా ఆమెకే తెలిసివస్తుందిలే అని ఊరుకున్నాడు. తన యజమాని కాశీ వెళ్ళి తిరిగి రావడానికి ఇంకా సమయముంది.

నాలుగు రోజుల తర్వాత నాగన్న "అమ్మా! ఏమాలోచించావు? " అన్నాడు.

"నిన్ను ఒదిలిపెట్టి ఉండలేనురా"

"ఎన్నాళ్లో కాదు కదా. చెన్నపట్నంలో పనిలో చేరాక నిన్ను ఇక్కడే ఉంచేస్తా నేమిటి? నువ్వా వచ్చెయ్యచ్చు. ఈ కట్టెలు కొట్టడం, వడ్లుదంచడం నువ్వు చెయ్యద్దు. నిన్ను పువ్వుల్లో పెట్టి చూసుకుంటా"

"నాతండ్రీ, అమ్మంటే ఎంత ఆపేక్షరా" అంటున్న తల్లి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"అయితే నన్ను పంపిస్తావు కదా"

పుల్లమ్మ ఆలోచనలు పరిపరివిధాల పో తున్నాయి.

వారం తర్వాత రామయ్య "ఏం వదినా! నాగన్న ప్రయాణం ఉన్నట్లేనా?" అ న్నాడు. పుల్లమ్మ ఏమీ మాట్లాడలేదు.

నరసయ్య "అత్తమ్మా, చెన్నపట్నమంటే ఎంతదూరమని? విజీనగరం నుంచి ఇక్క డకు రావడానికి వారం పడితే చెన్నపట్నా నికి రెండు వారాలు, మహా అయితే ఇరవై దినాలు" అన్నాడు.

రామయ్య "తెల్లదొరలు సముద్రానికి దగ్గరగా పడవల కాలవ తవ్వుతారట. అప్పుడింకా తేలిగ్గా రావచ్చు" అన్నాడు.

"అసలీ తెల్లదొరల వల్లనే ఈ కష్టాలు వచ్చాయి. నవాబుగారి జమానా ఉంటే బాగుండును" అంది పుల్లమ్మ.

లచ్చుమ్మ నవ్వి "అక్కా! ఓసారి తెల్లదొ రల రాజ్యం బాగుందంటావు. ఓసారి నవా బుగారి జమానా అంటావు. ఎప్పుడైనా మన కష్టాలు మనకుంటాయి" అంది.

"నిజమే కానీ చెన్నపట్నం పంపడం ఉండేది కాదు"

"చెన్నపట్నం కాకుంటే కందనూరు, లేకుంటే అయిదరాబాదు.. విజీనగరం ఉన్న ఊళ్ళోనే ఉంటే తిండి గడవద్దా?"

"నాకు కొలువు కుదిరాక అమ్మను కూడా చెన్నపట్నం తీసుకుపోతానని చెప్పాను చిన్నాన్నా" అన్నాడు నాగన్న.

"అదీ బాగానే ఉంది. అందరం చెన్నప ట్నంలోనే ఉండచ్చు" అన్నాడు రామయ్య.

పుల్లమ్మ మౌనంగా ఉండడంతో ఎవరూ సంభాషణను సాగించలేదు.

ఆ రాత్రి లచ్చుమ్మ భర్తతో "ఏమిటి అందరం చెన్నపట్నం పోదామన్నావే మిటి? ఇక్కడ భూమి కొంటాను. కామం దుల్లా బతుకుదామన్నావు" అని అడిగింది.

"పిచ్చిదానా! వదినని ఒప్పించడానికే ఈ ఎత్తులన్నీ! నాలుగేళ్ళు కష్టపడితే చాలు. ఆపైన అందరం కాలుమీద కాలు వేసుకు బతకచ్చు" అన్నాడు రామయ్య.

లచ్చుమ్మ నవ్వింది.

ఇంకో నాలుగు దినాల తర్వాత పుల్లమ్మే రామయ్యతో నాగన్న చెన్నపట్నం ప్ర యాణం గురించి మాట్లాడింది.

"అయితే మరిదీ! చెన్నపట్నంలో వాన లు కురుస్తాయా?"

"అదేం ప్రశ్న వదినా! ఉప్పాడలో కురిసి నట్లే చెన్నపట్నంలోనూ వానలు కురు స్తాయి. అక్కడా ఎండలు కాస్తాయి"

"ఉప్పు చేపలు దొరుకుతాయా?"

"చెన్నపట్నం సంద్రం పక్కనేగా ఉంది. అన్ని రకాల చేపలూ దొరుకుతాయి. ఇక్క డకు దగ్గరలో గోదారుందా? చెన్నపట్నం పక్కనే కూవం అనే నది ఉంది. ఇక్కడ బ్రాహ్మలు గోదావరిలో స్నానం చేసి పూజలు చేస్తారా, అక్కడ కూవంలో స్నానం చేస్తారు. ఇక్కడ పిఠాపురంలో గుడీ, చెరువూ ఉన్నాయా? అక్కడా పెద్ద పెద్ద గుడులున్నాయి. చెరువులున్నాయి. అమ్మగారిని నేనే పల్లకీలో గుళ్లకు తీసికెడ తాను. మిగిలిన బోయిలెవరున్నా అమ్మగా రికి నేనే పల్లకీ మొయ్యాలి"

"తెల్లదొరలూ, దొరసానులూ తుపాకీలు చ్చుకుని తిరుగుతారా?"

"తిరుగుతారు. వాళ్ళొస్తున్నప్పుడు మ నం పక్కకి తప్పుకోవాలంతే"

"అదికాదు మరిదీ. నాగన్న చిన్నపి ల్లాడు కదాని భయం"

రామయ్య వదినగారి వైపు సానుభూ తితో చూశాడు. పిల్లలకోసం వదిన పడి

న తాపత్రయం అతనికి తెలుసు. భర్త పోయాక పిల్లలే ప్రాణంగా బతికింది. అందుకే అనునయంగా "వదినా! భయం వద్దు, నాగన్నను నా కన్నకొడుకు కన్నా ఎక్కువగా చూసుకుంటాను. మా అయ్య గారు, అమ్మగారు కూడా చాలా మంచి వాళ్ళు. అనవసరంగా మనసు పాడుచేసు కోకు" అన్నాడు.

"నువ్వున్నావనే నా ధైర్యం" అంది పుల్లమ్మ.

తన చెన్నపట్నం ప్రయాణానికి తల్లి అంగీకరించడంతో నాగన్న ఎగిరి గంతే శాడు. ఉన్న ఊరూ, పిఠాపురం, కాకినాడ తప్ప అతనికి ఏ ఊరూ తెలియదు. చెన్న పట్నం దారిలో ఏయే ఊళ్ళు వస్తాయో, ఏయే నదులు దాటాలో, ఎన్ని అడవుల గుండా వెళ్ళాలో చెప్పమని చిన్నాన్నని అడుగుతూనే ఉన్నాడు.

మరిది చెప్పినా వినకుండా ప్రయా ణంలో పుల్లమ్మ తినడానికి పచ్చళ్ళూ, పొడులూ చెయ్యడం మొదలెట్టింది.

"అయ్యో వదినా, నువ్వెంత కష్టపడి చేస్తున్నావు? ప్రయాణంలో నేనూ, నాగ న్న మాత్రమే ఉంటామనుకుంటున్నావా? ఇరవైమంది బోయిలూ, ముప్పైమంది కళాసీలూ, ఎద్దుబండీ తోలేవాళ్ళు, రాత్రి పహరా ఇచ్చేవారు అంతా కలిపి వంద మంది ఉంటారు. నువ్వు ఇచ్చేవి ఒక్కపూ టకు కూడా చాలవు"

"నాగన్నా! మరి నువ్వేం తింటావురా?" దిగులుగా అడిగింది పుల్లమ్మ.

"వదినా! అయ్యగారితో వంటవాళ్ళున్నా రు. వాళ్ళే వండుతారు. ఏరా! మొన్న పిఠా పురం వచ్చావుగా, డేరాల దగ్గర భోజన మెలా ఉంది?"

"అయితే ఈ పొడులూ, పచ్చళ్ళూ చెన్న పట్నంలో తినండి"

రామయ్య నవ్వాడు. చెన్నపట్నం హుషారులో ఉన్న నాగన్న తల్లి మనస్సు కష్టపెట్టడం ఇష్టం లేక "అలాగేనమ్మా చెన్నపట్నంలో తింటా" అన్నాడు.

చెన్నపట్నం ప్రయాణమయ్యే రోజు దగ్గర పడింది. అయ్యగారు కాశీ నుంచి తిరిగి వచ్చేస్తుంటారనీ, తామిద్దరూ రాజా నగరం వెళ్ళి అక్కడ వేచి ఉండాలనీ రామయ్య చెప్పాడు.

"ఈ ఊరు మీద నుంచి వెళ్ళరా?"

"లేదు, తెల్లదొరలు తుని నుంచి రాజ మండ్రం దాకా లైనుదారి వేశారు. అది దగ్గర దారి. పాదగయలో తర్పణాలు ఇవ్వాల్సి ఉంది కాబట్టి పెద్దాపురం, ఉప్పాడ, పిఠాపురం చుట్టుదారిలో ఆమడ దూరమెక్కువైనా అయ్యగారు వెళ్లారు"

"లైనుదారి అంటే?" లచ్చమ్మ అడిగింది.

"బళ్ళు సులువుగా పోతాయన్నమాట. దారిలో రాళ్ళూ, ముళ్ళు ఉండవు. మేనా లూ, పల్లకీలూ సులువుగా మోసెయ్యొచ్చు చెన్నపట్నం దాకా లైనుదారి ఉంది. నేనూ, నాగన్న రాజానగరం వెడతాం. నాలుగు రోజులు ముందే చేరుకుంటే మేలు"

"మేమూ వస్తామని" పుల్లమ్మా, లచ్చ మ్మా ఒకేసారి అన్నారు.

"ఆడాళ్ళిద్దరూ మళ్ళీ వెనక్కి ఎలా వస్తారు? పిఠాపురమో, కాకినాడో అయితే తెలిసిన దారి. మీరింటికి క్షేమంగా వెళ్ళారో లేదోనని మేం దిగులు పడాలి"

"నాకెంత దిగులుగా ఉందో మరిదీ దారిలో నాగన్నకి ఏ జ్వరమైనా వస్తే ఏమిటి దారి?"

"మా అయ్యగారికి వైద్యం వచ్చును. ఎప్పుడూ ఒక పల్లకీనీ, నలుగురు బోయీ లనూ మా కోసం ఉంచుతారు. అందులో సరుకులుంచుతూంటారు. ఎవరికైనా ఒం ట్లో బాగులేదనుకో సరుకులని బళ్ళలో వేసి జ్వరం పడ్డవాళ్ళని అందులో ఎక్కించి బోయీలతో మోయిస్తారు. ఆయనే జ్వరం తగ్గడానికి మందులిస్తారు. నువ్వేం బెంగపెట్టుకోకు"

పుల్లమ్మ కొంత కుదుటపడింది.

ఆ రాత్రి నిద్రపోయేటప్పుడు లచ్చమ్మ భర్త మీద చెయ్యి వేసుకునే పడుకుంది. పుల్లమ్మ, కొడుకు పక్కన పడుకుందే కానీ నిద్రపోలేదు.

రాజానగరం ప్రయాణమైన రామయ్య, నాగన్నలను ఊరు దాటాక కోసుదూరం వరకు పుల్లమ్మా, లచ్చమ్మా కన్నీళ్ళతో సాగనంపారు.

చెన్నపట్నం చేరాక క్షేమవార్తను ఉత్తరంలో రాయించి, తపాల రన్నర్లు అందచేసేలా పంపిస్తానన్నాడు రామయ్య.

తపాలారన్నర్లు అంటే చెన్నపట్నం నుంచి కాకినాడ దాకా అంచెలంచెలుగా ఉత్తరాలు మోసుకొచ్చి అందచేసే వారని భార్యకు విశదీకరించాడతను.

"ఎంతవుతుందో?" అంది పుల్లమ్మ.

"ఎంతయితేనేమిటి? నీ కొడుక్కి నెలకి ఏడు రూపాయల జీతం" అన్నాడు రామయ్య.

గర్వమూ, ఆనందమూ, బెంగా, భయమూ, సంతోషమూ, దుఃఖమూ వరసగా మనస్సులో కదుల్తుండగా కన్నీళ్ళ మధ్య నుంచి నవ్వింది పుల్లమ్మ.




ఆఫ్రికా ఖండంలోని చిన్నద్వీపం మారిషస్‌లో పోర్ట్‌లూయి నగరంలో మేడ మీద నిల్చుని ఒక ఇంగ్లీషు మహిళ దూరాన ఉన్న సముద్రాన్నీ, సూర్యాస్తమయాన్ని చూస్తోంది. సముద్రపు కెరటాల వలెనే ఆమె గుండె ఎగసి పడుతున్నది. అస్తమయ సూర్యుడిలాగనే ఆమె ముఖం ఎర్రగా ఉంది. ఆమె కళ్ళు కన్నీళ్లు కార్చి, కార్చి ఎండిపోయాయి.

"సన్‌సెట్‌ని చూస్తున్నావా డార్లింగ్?"

ఆమె వెనుకకు తిరిగి చూసింది.

తన భర్త సర్ విలియం నికోలాయ్ చిరునవ్వుతో నిల్చున్నాడు.

ఆమె శుష్కహాసం చేసింది.

"సన్‌సెట్‌ని చూస్తున్నావా? అని అడిగాను. ఒక విధంగా సన్‌సెట్ అనేది బ్రిటిషు సామ్రాజ్య పౌరులకు తెలియదు. ది సన్ నెవర్‌సెట్స్ ఇన్ ది బ్రిటిష్ ఎంపయిర్! రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్య స్థాపనలో, సామ్రాజ్యవిస్తరణలో పాలు పంచుకోగలగడం గర్వకారణం"

"నేను సన్‌ని చూడలేదు. నా సన్స్ గురించి ఆలోచిస్తున్నాను" అందామె.

"ఆలోచించడానికేముంది? మీ అమ్మ దగ్గర క్షేమంగా ఉన్నారు కదా. మూడు నెలలకి ఒకసారి బోట్‌లో మెయిల్ వస్తోంది. వారి సమాచారం తెలుస్తోంది"

"పిల్లలు చిన్నవాళ్లు.. పెద్దవాడికి ఎనిమిదేళ్లు, చిన్నవాడికి ఆరేళ్లు. మా అమ్మ వయస్సులో పెద్దది, ఎలా ఉన్నారో ఏమో?"

"మీ అమ్మగారు చేసేదేముంది? నానీలున్నారు, గవర్నెస్‌లున్నారు. సేవకులున్నారు. వారికేలోటు లేదు. బ్రిటిషు సామ్రాజ్యంలో ఉత్తమ పౌరులుగా ఎదగడానికి అన్ని సౌకర్యాలూ అమర్చాను"

"తల్లిప్రేమ అందివ్వగలరా?"

"డార్లింగ్! పిరికిమంత్రం పఠించకు. ధీర వనితలా నిలబడు. మారిషస్ కన్నా దూరంగా ఉన్న ఇండియా, మలయా ఇండోనేషియా, సౌత్ ఆఫ్రికాలకు ఎందరో వెళ్లి ఉండడం లేదా?"

"అక్కడున్నంత మంది ఆంగ్లేయులు ఈ చిన్నద్వీపంలో ఉన్నారా? ఇక్కడంతా

ఫ్రెంచిమయం"

"ఆ మాట నిజమేకానీ.."

"కానీ దగ్గర ఆగిపోయారేం? మీరు తప్ప బ్రిటిషు సామ్రాజ్యాన్ని నిలబెట్టే వారింకొకరు లేరా? "

"పోనీ నువ్వు ఇంగ్లండులో పిల్లల దగ్గరకెళ్లి ఉండు. అయిదారేళ్లలో ఇక్కడ పరిస్థితిని చక్కదిద్ది వస్తాను"

లేడీ నికోలాయ్‌కి భర్త ఆలోచన నచ్చలేదు. ఇంగ్లండుకి దూరంగా చిన్నద్వీపంలో ఉన్న భర్త ఆహార విహారాలను తాను దగ్గర ఉండి చూసుకోకపోతే ఆతని ఆరోగ్యం దెబ్బతింటుందని ఆమె భయం. అలాగని పిల్లలకు దూరంగా ఉండడాన్ని తట్టుకోలేకపోతోంది. తల్లిగా, భార్యగా కర్తవ్యం ఏకకాలంలో చెయ్యలేని పరిస్థితి.

భార్య మౌనం వహించడంతో సర్ నికోలాయ్ "డార్లింగ్! పరిస్థితిని అర్థం చేసుకో. ఈ ద్వీపంలో శాంతి సామరస్యాలు నెలకొల్పవలసిన మహత్తర బాధ్యత నాపై మహారాజు ఉంచారు. పౌరులలో న్యాయ వ్యతిరేక చర్యలను క్షమించకూడదు. వారిలో అసంతృప్తినీ కలగనివ్వకూడదు. కత్తిమీద సాములాంటి వ్యవహారంలో నీ సహకారం నాకు ముఖ్యం" అన్నాడు.

లేడీ నికోలాయ్! "క్షమించండి. పిల్లల మీద బెంగతో తప్పుగా మాట్లాడి మీ మనసు కష్టపెట్టాను" అంది.

"ఫరవాలేదు! రేపటెల్లుండిలో ఇంగ్లండు నుంచి మెయిల్ బోట్ రావాలి. పెద్దవాడు చిన్న ఉత్తరం కూడా రాయగలుగుతున్నాడు కదా. ఉత్తరాలు చదివాక నీ మనస్సు కొంత కుదుటపడుతుంది"

లేడీ నికోలాయ్ కొంత తేరుకున్నట్లే కనిపించింది. భార్యభర్తలిద్దరూ మేడ దిగడానికి లేచారు. మెట్లు దిగుతూ లేడీ నికోలాయ్ "అసలు ఇండియాకి సముద్రమార్గం కనిపెట్టడం, ఆఫ్రికాలో అన్ని భాగాలలోనూ తిరగాడడం వంటివి లేకుంటే మనకి ఇలాంటి కష్టాలుండేవి కావు. మారిషస్ అన్న ద్వీపముందని తెలిస్తేనే కదా మనుషులు ఇక్కడ స్థావరాలు ఏర్పరుచుకోవడం" అంది.

సర్ నికోలాయ్ నవ్వుతూ "ఇలాగయి ఉంటే, అలాగయి ఉంటే అన్న పదాలు ప్రపంచంలో లేవు. ఇలా జరగాలని ఉంది. కాబట్టి జరిగింది. అమెరికాని కనిపెట్టకపోతే నీకు పొటాటోస్ ఉండేవా? నాకు సిగార్స్ ఉండేవా? ఏదీ కనిపెట్టకపోతే రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్యంలో కాకుండా చిన్న బీదద్వీపంలో ఉండేవాళ్లం. ఏది జరిగినా మనమంచికేనని అనుకోవాలి" అన్నాడు.

★ ★ ★

## కొత్తగాలి...

పాలిచ్చే వరకే
అమ్మ!
పాలించేది మాత్రం
అలే!!

– గరిశకుర్తి రాజేంద్ర,
కామారెడ్డి, నిజామాబాద్ జిల్లా

రాత్రి భోజనాలై పక్కమీద పడుకున్నాడే కానీ సర్ విలియం నికోలాయ్‌కి నిద్ర పట్టలేదు. భార్యతో 'ఇలాగయితే' వంటి మాటలుండకూడదని చెప్పాడు. కానీ అలా అనుకోకుండా ఉండడం ఆయన వల్ల కాలేదు. మారిషస్ ద్వీపాన్ని కనుగొన్నది డచ్చిదేశస్థులు. టాస్మాన్ ఇక్కడనుంచే ఓడలపై వెళ్లి ఆస్ట్రేలియా ఖండాన్ని కనుగొన్నాడట. కానీ ఎందుకో డచ్చివారు ఇక్కడ స్థావరాలు ఏర్పరుచుకున్నా స్థిరనివాసం చెయ్యకుండా వదిలేశారు. స్థిరనివాసం ఏర్పరుచుకోకపోయినా వారు పెట్టిన 'మారిషస్' అన్న పేరు స్థిరంగా నిలిచింది. వారి రాజు

గారి పేరు పెట్టుకున్నారు. వారు వెళ్లిపోయాక ఫ్రెంచివారు స్థావరాలు ఏర్పరుచుకుని ఐల్-డి-ఫ్రాన్స్ అని పేరు మార్చుకుని ద్వీపాన్ని బాగా వృద్ధిచేశారు. చెరుకుతోటలు, పంచదార ఉత్పత్తితో బాగా డబ్బు గడించారు.

అంతవరకూ బాగానే ఉంది. కానీ ఫ్రాన్స్ ఇంగ్లండు దేశాలు ఆజన్మశత్రువులు. ఎప్పుడూ యుద్ధాలే! యుద్ధపరంపరలో ఇంగ్లండుదే పైచేయి అయింది. ఇండియాలో పాండిచ్చేరి మిగిలిందేమహద్భాగ్యమనుకున్నారు ఫ్రెంచివారు. మారిషస్‌పై సర్వహక్కులు వదులుకుంటూ శాంతి ఒడంబడిక కూడా చేసుకున్నారు. అయితే మారిషస్‌లో ఉన్న ఫ్రెంచి చెరుకు తోటల యజమానుల మనుగడ యథాతథంగా ఉంచితే చాలని కోరారు. ఇంగ్లీషు ప్రభుత్వం అంగీకరించింది. ఫ్రెంచి ప్రభుత్వం తన సైన్యాన్ని ఉప సంహరించుకుంది. కానీ ఇక్కడ ఉండి పోయిన ఫ్రెంచి భూస్వాములు బానిసలను వదులుకోమంటున్నారు. ఈ సమస్యకు పరిష్కారమెలా?

తనపై పూర్తి నమ్మకంతో ఇంగ్లడు రాజు నాలుగో విలియం తనను మారిషస్ పంపించాడు. తాను సామరస్య పూర్వకంగా సమస్యను సమూలంగా తుంచి వెయ్యాలి. అటు ఫ్రెంచి భూస్వాములు అసంతృప్తి చెందితే మరో విప్లవం రావచ్చు లేదా ఫ్రాన్సుతో యుద్ధం రావచ్చు. ఇటు బానిసత్వాన్ని కొనసాగనిస్తే మానవత్వానికి మారణహోమం చెయ్యడమే. అదీగాక ఇంగ్లండు ప్రభుత్వం చేసిన బానిసత్వ నిర్మూలన చట్టాన్ని అమలు చెయ్యలేని అసమర్థ గవర్నరుగా తను చరిత్రలో మిగిలిపోతాడు.

సమస్య గురించి, దాన్ని సున్నితంగా పరిష్కరించడం గురించి ఆలోచిస్తున్న సర్ నికోలాయ్‌ని ఆ రాత్రి నిద్రాదేవత కరుణించలేదు.

★ ★ ★

మర్నాడు ఉదయం పనిమనిషి అడుగుల చప్పుడు వినబడకుండా ఉండేలా నడిచి నెమ్మదిగా కిటికీల తెరలను తీసింది. ఇంకొక పరిచారిక టీకప్పులు, టీపాట్, పంచదార, చెంచాలు ఉంచిన ట్రేను తెచ్చి బల్లమీద పెట్టింది.

భార్యాభర్తలిద్దరూ పనిమనుషులు వెళ్లిన పావుగంటకు లేచి టీ తాగారు. ఆపైన వరండాలోకి వెళ్లి పది నిమిషాలు నిల్చున్నారు. కింద పనివాళ్లు వంటవాళ్లు అటూ ఇటూ తిరుగుతూ పనిచేస్తున్న చప్పుడు విన్పిస్తోంది. స్నానంచేసి, డ్రెస్ చేసుకొనే సరికి బ్రేక్‌ఫాస్ట్ సిద్ధమని చెప్పడానికి ఒక పనివాడు మేడపైకి వచ్చాడు.

నికోలాయ్ దంపతులు మేడదిగి టేబిల్ దగ్గరకొచ్చేసరికి బ్రెడ్, జామ్ ఉడికించిన కోడిగుడ్లు అమ్మగారికీ- బ్రెడ్ జామ్, ఆమ్లెట్లు అయ్యగారికీ ప్లేట్లలో పెట్టి వారి ముందుంచాడు బట్లర్.

"మార్మలేడ్ లేదా? " అడిగింది లేడీ నికోలాయ్.

"లేదు మై లేడీ! ఈ రోజు మెయిల్ బోట్ వచ్చింది. అందులో వచ్చి ఉంటుందనుకుంటాను. మై లేడీ" బట్లర్ వినయంగా చెప్పాడు.

ఇద్దరూ టిఫిను తినేసరికి వేడిగా కాఫీ కప్పులు వారి ముందు పెట్టాడు.

"ఈ రోజు వంట ఏం చెయ్యమంటారో హెడ్‌కుక్ చెప్పమన్నాడు మై లేడీ"

లేడి నికోలాయ్ లంచ్‌కి ఏం చెయ్యాలో చెప్పింది. కాఫీ తాగడం పూర్తయ్యేసరికి గుమస్తా ఉత్తరాలకట్టను తీసుకొచ్చి టేబుల్ మీద పెట్టి నిల్చున్నాడు.

"ఉత్తరాలు చదివాక మిమ్మల్ని పిలిపిస్తాను, మీరికవెళ్లవచ్చు"

గుమస్తా సెల్యూట్ చేసి వెళ్లిపోయాడు.

"డార్లింగ్! ఇదిగో నీ ఉత్తరాలు" అంటూ

భర్త ఇచ్చిన ఉత్తరాలు అందుకున్న లేడీ నికోలాయ్ ముఖం ఆనందంతో వెలిగిపోయింది. ఆమె తల్లి, స్నేహితురాళ్లు రాసిన ఉత్తరాలతో పాటు ఆమె పెద్దకొడుకు రాసిన ఉత్తరం కూడా ఉంది.

సర్ నికోలాయ్ అఫీషియల్ లెటర్స్‌ని ఒక్కొక్కటే చదువుతున్నాడు లేడీ నికోలాయ్ ఉత్తరాలన్నీ చదవడం పూర్తిచేసింది. తన కొడుకు రాసిన ఉత్తరాన్ని పదేపదే చదువుకుంది.

ముఖంలో నవ్వులు మల్లెపూలను తలపిస్తుండగా "అబ్బాయికి ఇంగ్లండు పాలించిన రాజులందరి పేర్లూ కంఠతావచ్చేయిట, వాళ్ల గవర్నెస్ మెచ్చుకుందిట. చిన్నపోనీమీద రైడింగ్ కూడా చెయ్యగలుగుతున్నాడట" అని భర్తతో చెప్పింది.

"నేను చెప్పాను కదా, బ్రిటిష సామ్రాజ్యంలో నా కొడుకులు ఉత్తమ పౌరులవుతారు. తమ్ముని విషయమేమీ పెద్దవాడు రాయలేదా? "

"ఆ సంగతి మా అమ్మరాసింది. ఆల్ఫాబెట్ వచ్చిందనీ, స్విమ్మింగ్ నేర్చుకున్నాడనీ రాసింది"

"గుడ్! ఆవిడ ఆరోగ్యమెలా ఉంది? "

"బాగుంది" అంటూ ఆమె మళ్లీ ఉత్తరాలు చదువుకోసాగింది. అంత ఆనందంలో ఆమె ఉన్నప్పుడు తనకు వచ్చిన ఉత్తరాలలోని విషయం గురించి మాట్లాడటానికి విలియం నికోలాయ్‌కి మనస్కరించలేదు. తీరిగ్గా చెప్పవచ్చులే అనుకున్నాడు.

మధ్యాహ్నం లంచ్ పూర్తయ్యాక నౌకర్లు వాళ్లిద్దరికీ వరండాలో కుర్చీలు వేశారు. వట్టి వేళ్ల తడకల చాపలను తడిపిన తర్వాత ఒక పనిమనిషి పంఖాతాడుని పట్టుకుని లాగుతూ నిల్చున్నది.

"క్రిస్టమస్ దగ్గర పడుతున్నది. ఎండలు పెరుగుతున్నాయి. అందరూ పండగ చలికాలంలో జరుపుకుంటారు. మనం ఎండల్లో చేసుకోవాలి" నిట్టూర్చింది లేడీ నికోలాయ్.

**జనవరి - 2015**
**చతుర ప్రవేశిక విజేతలు వీరే!**

**డ్రాలో ఎంపికైన ఈ ఐదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.**



1. **డి.బి. వెంకటేశ్వర్లు**
   - సీతమ్మధార, విశాఖపట్నం
2. **కనకల అప్పారావు**
   - విజయవాడ
3. **యు. నీలిమ**
   - నేరేడ్‌మెట్, సికింద్రాబాద్
4. **మొహమ్మద్ ఖాసిం**
   - కల్లూరుగూడెం, ఖమ్మం జిల్లా
5. **కె. విజయశేఖర్**
   - శ్రీనివాసపురం, తిరుపతి

**సరైన జవాబులు**

| | |
|---|---|
| 1. డాక్టర్ రాయ్‌చౌదరి | 6. చంద్రభాను రాకేష్ |
| 2. మృణాళిని | 7. శ్రీమతి షరాఫ్ సేర్ |
| 3. శశిప్రభ | 8. 64 శాతం |
| 4. వైద్యం | 9. అలియా సాబుర్ |
| 5. సుబ్రత్ | 10. పురాణం సుబ్రహ్మణ్యశర్మ |

"భూమధ్య రేఖకు దక్షిణాన ఉన్నాం కదా. ఆస్ట్రేలియాలో ఉన్నా ఇలాగే ఉంటుంది"

"మీకు వచ్చిన ఉత్తరాలలో విశేషాలు చెప్పలేదు" అందామె.

"సర్ జాన్‌జెరెమీ వస్తున్నారట. ఇక్కడ ఎండలు తగ్గేసమయానికి మార్చి ఏప్రిల్ లలో రావచ్చు. మనం ఏర్పాట్లు చెయ్యాల్సి ఉంటుంది"

లేడీ నికోలాయ్ ముఖం ముటముటలా

డిపోయింది.

"ఆయన ఎందుకొస్తున్నాడో నాకు అర్థం కాదు. ఇప్పటికి ముప్పైసార్లు వచ్చాడు. ప్రతిసారీ ఇక్కడున్న ఫ్రెంచి వారు ఆయనను తరిమికొట్టారు. ప్రాణగండం తప్పింది. బతుకుజీవుడా అనుకోక మళ్లీ ఎందుకు వస్తున్నట్లో? "

"ముప్పైసార్లు రాలేదు. మూడుసార్లు మాత్రమే వచ్చారు. అప్పటి గవర్నర్ ఆయనకు సరైన సహాయ సహకారాలు అందించలేదు సరికదా ఫ్రెంచివారైన తోట యజమానులందరికీ ప్రైవేటు సైన్యాలున్నాయని, వారిని ఎదిరించడం అసాధ్యమనీ అప్పటికి సమస్యను పరిష్కరించకుండా దాటవేశాడు"

## కొత్తగాలి...



**మనలో మార్పు రావాలి**
**జాతి ఏకమై కదలాలి**
**మురికినంతా తొలగించాలి**
**'స్వచ్ఛభారతం' వర్ధిల్లాలి!**

*- అంబటి వెంకటశివారెడ్డి,*
*యర్రగుంట్ల, కడప జిల్లా*

"అసలు సమస్య ఏమిటో? తోటయజమానులైన ఫ్రెంచివారూ హాయిగా ఉన్నారు. ఇటు బానిసలైన ఆఫ్రికన్ నీగ్రోలూ సుఖంగా ఉన్నారు. మధ్య మన ఇంగ్లీషు వారికేమిటి కష్టం? "

"డార్లింగ్ బానిసగా ఉండడం సుఖంగా ఉంటుందా? ఏ విధమైన జీతభత్యాలు లేకుండా కేవలం యజమాని దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి బతకడాన్ని ఎవరైనా సుఖమనుకోగలరా? "

"వాళ్ల దేశంలో వాళ్లకి సుఖమేముంది? ఈ పాటి కూడూ గుడ్డా లేకే కదా తెల్లవారి దగ్గర పనికి వచ్చారు"

"అక్కడే నువ్వు పొరపడుతున్నావు. ఆఫ్రికాఖండంలోని దేశాలు బీద దేశాలు కావు. బంగారం, వజ్రాలు, లోహాలు, వృక్ష సంపదా దేనికీ వారికి లోటులేదు. ఆఫ్రికా పశ్చిమ భాగంలో ఉన్న మాలీ రాజ్యం యూరపుఖండంలో సగంపైగా ఉంటుంది. ఆ దేశరాజు ఈజిప్టుకి బంగారం తీసికెళ్లినప్పుడు ఈజిప్టులో ధర సగానికి పడిపోయిందట అంత ధనికదేశమది"

"అయితే ఈ నల్ల వాళ్ళంతా బానిసలుగా ఎందుకు అమ్ముడుపోతున్నారు? "

నికోలాయ్ ఇబ్బందిగా కదిలాడు.

"ఆ సంగతే ఎవరికీ అర్థంకావడం లేదు. పోర్చుగీసు నావికులు ఆఫ్రికా ఖండం చుట్టు తిరిగి ఇండియాకి మార్గం కనిపెట్టిన నాటి నుంచీ పోర్చుగల్ కీ, స్పెయిన్ కీ నల్లజాతివారిని బానిసలుగా పట్టికెళ్లడం జరుగుతూనే ఉంది. ఆపైన యూరప్‌లోని ఇతర దేశాలకీ, అమెరికాకీ బానిసలను పట్టికెడుతున్నారు. ఆఫ్రికా దేశాలలో బానిసత్వం సామాన్యమేనంటారు. రాజులవద్ద జీతం తీసుకునే నౌకర్లుండరట. బానిసలే ఉంటారని అంటారు. అప్పుచేసినవారు అప్పుతీర్చలేక బానిసలుగా మారతారట. పిల్లలను అపహరించి బానిసలుగా పెంచుకుంటారట. అందుకే యూరపు వాసులకు తమ ప్రజలను బానిసలుగా అమ్మడానికి అక్కడి ఏలికలు సులువుగా అంగీకరించారనీ అంటుంటారు. మన నుండి తుపాకులు కొనుక్కుందుకు బానిసలను బార్టర్‌ట్రేడ్(వస్తుమార్పిడి)లో ఇచ్చారనీ అంటారు"

"ఎలాగు బానిసలుగా బతకడం అలవాటయినవారికి నల్లజాతి రాజులైతేనేమి, తెల్లజాతి దొరలైతేనేమి? "

"నీలో మహిళలకుండాల్సిన మార్దవం లేదేంటి డార్లింగ్? మనదేశంలో ఎందరో స్త్రీలు బానిసత్వ నిర్మూలనకు పోరాడారు. పోరాడుతున్నారు. ఎలిజెబెత్ హెరిక్, మేరీ లాయిడ్, జేన్ స్మీల్ ఎలిజెబెత్ పీస్,

అన్నైట్ పేర్లని నువ్వు వినలేదా? స్త్రీలకు ఓటుహక్కు లేదు. పార్లమెంట్‌లో స్థానం లేదు. అంత మాత్రాన న్యాయం వైపు నిల బడి పోరాడాల్సిన బాధ్యత లేదా? "

"1833లో బానిసత్వ నిర్మూలన చట్టం వచ్చింది. అయినా ఇంకా బానిసలున్నా రంటే అర్థమేమిటి? బానిసలుగా బతకడం వాళ్లకిష్టమని" వాదించింది లేడీనికోలాయ్.

"ఇనుపగొలుసు తెంచుకుపోవడం ఎవరి వల్లనైనా అవుతుందా? " సర్ నికోలాయ్ కంఠం కోపంతో వణికింది. "నన్ను మార్షి షస్‌కి బానిసత్వ నిర్మూలన చట్టం అమలు చెయ్యడానికి పంపారు. అది నా కర్తవ్యం. మనిషి ఇంకొక మనిషికి బానిసగా ఉండడం అధర్మమని నా నమ్మకం. చట్టం అమలుకు ప్రాణం ఒడ్డి పోరాడుతున్నాను. నా అర్ధాంగిగా నువ్వు ఈ దీక్షలో పాలు పంచుకున్నా సరే. ఈ రోజు వచ్చిన మెయిల్ బోట్‌లో ఇంగ్లండుకి తిరిగి వెళ్లి పోయినా సరే"

లేడీ నికోలాయ్ భర్త కోపాన్ని చూసి భయపడిపోయింది. నిజమే! అనేక సమ యాలలో గుర్రపు స్వారీ చేస్తూ ద్వీపంలో తిరుగుతున్నప్పుడు నల్లజాతి మనుషులనీ, నీగ్రోలని హీనంగా పిలవడం వారితో పశువులు చేసే పని చేయించడం, కొరడా లతో బాదడం తను చూసింది. ఇంగ్లం డులో ఉన్న పిల్లలమీద బెంగతో ఈ బా నిసల కష్టాలగురించి పట్టించుకోలేదు. తన ఆలోచనా సరళి మార్చుకోవాలి. ప్రజా స్వామ్యానికి పుట్టినిల్లయిన ఇంగ్లండులో జన్మించిన తను ప్రతి మనిషికీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలుండడానికీ, సుఖాలనూ, పిల్ల లపై బెంగనూ వదులుకోవాలి. భర్తకు అండ దండలందించాలి.

భార్య ముఖకవళికలను బట్టి ఆమె మ నస్సులో భావాలను అంచనా వేసిన సర్ విలియం నికోలాయ్ భార్య దగ్గరగా కుర్చీ జరుపుకోని "థాంక్యూ డార్లింగ్" అన్నాడు.

ఆమె సన్నగా నవ్వి "బ్రిటిష్ ఎంపైర్ లోని అన్నిదేశాలకూ బానిసల ఎగుమతి ఉందా? " అని అడిగింది.

"ఇండియాలో లేదు. అక్కడ జనాభా ఆ దేశంలో పనిచెయ్యడానికి సరిపోతుంది. ఇంకా చెప్పాలంటే జనాభా ఎక్కువా పని అవసరాలు తక్కువ అని కూడా చెప్పచ్చు ఇంగ్లీషు వారైనా ఫ్రెంచివారైనా పోర్చుగీ సువారైనా అక్కడ జీతమిచ్చే పని చేయిం చుకుంటారుట"

"సర్ జాన్‌జరెమీ వచ్చిన నౌక ఇండియా నుంచే వచ్చిందట కదా? "

"అవును దానిపేరు 'గాంజెస్' అక్కడి ఒక నది పేరు. చాలా ధృఢమైన ఓడ"

ఇండియా గురించి విశేషాలు భర్త చెప్తుండగా భార్య వింటుండగా సూర్యాస్త మయమై చీకటి పడిందని కూడా ఇద్దరూ గుర్తించలేని తన్మయ స్థితి నెలకొంది.

మర్నాడు ఉదయం లేడీ నికోలాయ్ భర్తతో "ఈరోజు నేను ఒకసారి చెరకు తోటలవైపు వెళ్లివస్తాను. నాతో మన సెకండ్ ఫుట్‌మాన్‌నీ, స్కల్లరీ మెయిడ్‌నీ తీసుకెడుతున్నాను. కుక్‌నీ బట్లర్‌నీ పిలిచి విషయం చెప్పాను. వాళ్లు పనివిషయంలో సద్దుబాటు చేసుకుంటామన్నారు. నేను తీసుకెడుతున్నవారిద్దరికీ ఇక్కడి లోకల్ లాంగ్వేజ్ వచ్చు. అందుకే వారిని నాతో తీసికెడదామనుకున్నాను" అంది.

భార్య మనస్సులో ఏముందో ఊహించ గలిగినప్పటికీ విలియమ్ నికోలాయ్ ఆమె వైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"గవర్నర్ భార్యంటే రాజభోగాలను భవించడం కాదు. స్థానిక ప్రజల కష్టసు ఖాలు తెలుసుకోవాలి.. ఆ ప్రయత్నం మీ దే ఉండాలని నిర్ణయించుకున్నాను"

భార్య దృక్పథంలో వచ్చిన మార్పు సర్ నికోలాయ్‌ని సంతోషపెట్టింది. ఎండ తగ లకుండా గొడుగు తీసుకెళ్లమని చెప్పి తన ఆఫీస్ రూంలోకి వెళ్లిపోయాడు.

చెరకు తోటలవైపు వస్తున్న లేడీ గవర్నర్‌ని చూస్తూనే తోట యజమానుల సంఘం నాయకుడు ఆమెకు ఎదురుగా వచ్చి స్వాగతం చెప్పాడు. తను అనుకున్నదొక్కటి అవుతున్నదొక్కటి అని అనుకుందామె. ఆమె గుర్రం దిగేలోగా సంఘనాయకుడు ఇతర తోటయజమానులకు బానిసల ద్వారా కబురుపెట్టాడు. ఆమెను సవినయంగా తన ఇంటికి ఆహ్వానించాడు. తోట యజమానులు కూడా దేశ ప్రజలే. వారితోనూ సంభాషించాల్సిన అవసరము దనుకొని ఆమె అతని ఆహ్వానాన్ని మన్నించి వెళ్లింది. తోటకు ఒకపక్కగా పెద్ద బంగళా! కొంత దూరంలో పశువుల కొట్టాలకన్నా హీనమైన పాకలు. బంగళాలో కిటికీలకూ, వరండాలలోనూ వట్టివేళ్ల తడకలు తడిపి ఉన్నాయి. బంగళా నిండా పంకాలున్నాయి. ప్రతి పంకాను లాగడానికి బయట ఒక్కొక్క నల్లబానిస నిలబడి ఉండడాన్ని ఆమె గమనించింది.

యజయాని ఒక బానిసను పిలిచి ఏదో చెప్పాడు. మారిషస్‌లో మెదటనుంచీ ఉంటున్న ఫ్రెంచివారు.. ఫ్రెంచివారు తీసుకొచ్చిన ఆఫ్రికన్ బానిసలూ భాషాసమస్యను చిత్రంగా పరిష్కరించుకున్నారు. ఫ్రెంచికీ ఆఫ్రికన్ల భాషకు సంకరమైన క్రియోల్ అనే భాష ఉద్భవించి ప్రజాభాషగా స్థిరపడింది. రాజభాషగా ఫ్రెంచి ఉండేది. ఆపైన ఇంగ్లీషువారి పాలన మొదలయినా ఇంగ్లీషుతో పాటు ఫ్రెంచీ ఉండేది. ప్రభుత్వ వ్యవహారాలలో ఉపయోగంలో ఉంది.

లేడీ నికోలాయ్‌కి ఫ్రెంచి తెలుసు. క్రియోల్ రాదు. ఏం చెప్పి ఉంటాడోనని అడగడానికి తన నౌకర్లు లోపలకు రాలేదు. వచ్చినా వారిని అడగడం మర్యాద కాదు. ఆమె ఆలోచనలు ఇలా ఉండగా బయటనున్న బానిసలు, పంకాలను లాగుతున్నవారు ఎండలో కష్టపడుతున్నారు. గాలి చల్లదనాన్ని అనుభవిస్తున్నవారు హాల్లో కూచుని సుఖపడుతున్నారు. ఈ అసమానత పోవాలన్నదే తన భర్త దీక్ష అని లేడి నికోలాయ్ అనుకుంది.

"మేడమ్! సర్‌జాన్ వస్తున్నారట కదా? "

లేడీ నికోలాయ్ ఆశ్చర్యపడింది. చాలా రహస్యమైన విషయమనుకున్నది. ద్వీపమంతా వ్యాపించిందా?

ఆమె మాట్లాడకపోవడంతో తోట యజమాని పొడిగించలేదు. ఈలోగా మరికొందరు తోట యజమానులు భార్యలతో వచ్చి ఆమెకు అభివాదం చేసి సోఫాలలో కూచున్నారు. "మాతృదేశమైన ఫ్రాన్స్‌కి దూరంగా బతకడం కష్టంగా లేదా? " అని ఆమె స్త్రీలను అడిగింది.

"ఫ్రాన్స్ మా మాతృభూమి అని చెప్పుకోడమే కానీ రెండు మూడు తరాలుగా ఇక్కడే సెటిల్ అయ్యాం. మాలో చాలా మంది ఇక్కడ పుట్టి పెరిగిన వాళ్లమే. డచ్చివారు ఈ ద్వీపానికి 'మారిషస్' అని పేరు పెట్టారు కానీ మేం ఐల్‌డిఫ్రాన్స్ అని మార్చుకున్నాం" అందొకామె.

"ఇంగ్లండ్ ఈ ద్వీపాన్ని జయించినా రాజకీయంగా మార్పు వచ్చింది అనుకున్నాం తప్ప మా జీవితాలు మారిపోతాయని అనుకోలేదు. ఫ్రెంచి ప్రభుత్వానికి బదులుగా ఇంగ్లండు రాజుకి కప్పం కడతాం అంతే కదా" అందింకొకామె.

"ద్వీపం పేరు మార్చినా పట్టించుకోలేదు కానీ మమ్మల్ని బానిసలుగా మారిస్తే మేమేం కావాలి? " అంది మరొక ఇల్లాలు.

లేడీ నికోలాయ్ "మిమ్మల్ని ఇంగ్లండు రాజు బానిసలుగా ప్రకటించలేదు. స్వతంత్రంగా జీవించవచ్చనీ మీ తోటలు, మిల్లులు మీ అధీనంలోనే ఉంటాయని పరిస్థితిని యథాతథంగా ఉంచుతామనీ ప్రకటించారు కదా! ఇప్పుడు మీ స్వేచ్ఛకు భంగమేం కలిగింది? " అని ప్రశ్నించింది.

గవర్నర్ భార్యతో ఎంతవరకూ మాట్లా

డవచ్చునో అన్న అనుమానం అక్కడ ఉన్న స్త్రీ బృందానికి కలిగింది. ఇంగ్లీషువారికీ ఫ్రెంచివారికీ మధ్య వెయ్యేళ్ల వైరముంది. ప్రస్తుతం ఇంగ్లండురాజు పాలనలో ఉన్నంత మాత్రాన ఇంగ్లీషు గవర్నర్ భార్య ఎదుట మనస్సు విప్పి మాట్లాడలేని దుస్థితి తమకు లేదు. సర్ జాన్‌జెరీమీని మారిషస్‌లో అడుగుపెట్టనివ్వకుండా వెనక్కి పంపిన ఘనత తమకి ఉంది. ఆ ధైర్యంతోటే ఫ్రెంచిస్త్రీలు తమ మనసు విప్పి లేడీనికోలాయ్‌తో మాట్లాడారు.

"యుద్ధానంతరం మారిషస్‌లో యథాతథంగా పరిస్థితులుంచుతామని చెప్పిన ఇంగ్లీషు ప్రభుత్వం మమ్మల్ని బానిసలను వదులుకోమంటోంది. మీరైతే గవర్నర్‌గా వచ్చారు కనుక మీతో పనివారిని తెచ్చుకోగలిగారు. మాకా అవకాశం లేదు. ఫ్రాన్స్ నుంచి వచ్చి ఇక్కడ కుక్స్‌గా, స్కల్లరీ మెయిడ్సుగా ఫుట్‌మెన్‌గా ఎవరు పనిచేస్తారు? ఈ ఆఫ్రికన్ స్లేవ్స్ లేకపోతే మేమే బానిసలుగా మారి అన్ని పనులూ చేసుకోవాలి" అన్నారు వాళ్లు గట్టిగా.

తోట యజమానుల సంఘనాయకుడు "చెరకు తోటలలో పని చెయ్యడానికి మనుషులుండాలి కదా మేడమ్. ఈ బానిసలే లేకపోతే చెరకుతోటలో సాగు ఉండదు, మిల్లులలో పంచదార తయారవదు, మీ ప్రభుత్వానికి పన్నులుండవు" అన్నాడు.

లేడీ నికోలాయ్‌కి మెదడు వేడెక్కింది. ఆమెను చల్లపరచడానికా అన్నట్లు నలుగురు బానిసలు చెరకురసాన్ని గ్లాసులలో తెచ్చి ఆమె ముందుంచారు.

"మేడమ్! తీసుకోండి. చెరకు గడల పై తొక్కలను తీసి, యంత్రంలో ఈ రసాన్ని తయారు చేస్తారు. ఈ రసం నుంచే పంచదార తయారవుతుంది"

లేడీ నికోలాయ్ కళ్ళముందు ఎండలో బానిసలు కష్టపడి రసాన్ని తీస్తున్న దృశ్యం కదలాడింది. ఆమెకెందుకో బానిసల రక్తాన్ని తాగుతున్నట్లనిపించింది.

"వద్దు ఇప్పుడు ఏమీ తీసుకోను. లంచ్ టైం అవుతున్నట్లుంది" అంటూ లేచింది.

"లంచ్ తీసుకుని వెళ్ళండి మేడమ్. మీకు ఇంగ్లీష్ వంట చేయిస్తాను" అంది ఇంటి ఇల్లాలు.

"వద్దు. సర్ గవర్నర్ నాకోసం ఎదురు చూస్తూంటారు"

మర్నాడు లేడీ నికోలాయ్ ఉదయమే బ్రేక్‌ఫాస్ట్ చెయ్యకుండా బయల్దేరింది. తోట యజమానులు అజమాయిషీ మాత్రమే చేస్తారు కాబట్టి ఆలస్యంగా వస్తారు. బానిసలైతే ఉదయమే లేచి పని ప్రారంభిస్తారని ఆమె ఊహ. ఇద్దరు పనివాళ్ళతో ఆమె కాలినడకనే బయల్దేరింది. గుర్రం

> **కొత్తగాలి...**
>
> **పాలరాతి మందిరంలో**
> **పడుచుబొమ్మ అందం**
> **కన్నెపిల్ల కలల మనసు**
> **సిగ్గుపడిన చందం!**
>
> – యి.భ.వ. రావు,
> చిలకలూరిపేట, గుంటూరు జిల్లా

మీద వెడితే తోట యజమానుల కళ్ళపడవచ్చునని ఆమె భయం.

గవర్నర్ బంగళాకి అతి తక్కువ దూరంలో ఉన్న తోటకు నడిచేసరికే ఆమె అలసిపోయింది. ఉదయం ఎండ కూడా ఆమెకు కొలిమిలో కూచున్నంత వేడిగా అన్పించింది. తోట వద్దకు వెళ్ళేసరికి నిస్త్రాణగా ఉన్న ఆమెకు ఫుట్‌మాన్ తనతో తెచ్చిన కుర్చీని వేశాడు. అక్కడ కూచున్న ఆమెను చూసి బానిసలు భయపడినట్లు దూరదూరంగా జరిగి పని చెయ్యసాగారు. ఆమె సూచనల మేరకు నౌకర్లు క్రియోల్ భాషలో భయపడాల్సిందేమీ లేదని బానిస

లకు చెప్పారు. వారిలో భయం తగ్గినట్లా మెకు అన్పించలేదు. కానీ పని ఆపకుండా చేసుకోసాగారు.

నెమ్మదిగా సూర్యుడు పైకి రాసాగాడు. ఎండ తీవ్రమవుతోంది కానీ, లేడీ నికొలాయ్‌కి వేడిగా ఉన్నట్లనిపించలేదు. కుర్చీకి వెనుకగా ఫుట్‌మాన్ గొడుగుని అమర్చాడు. ఎండలో పనిచేస్తున్న బానిసల కష్టాన్ని చూడడం వల్ల తనకు ఎండ తీవ్రత తెలియడం లేదా అని అనుకుందామె. దూరంగా పసిపిల్లలను నేలమీద ఆకులు పరిచి పడుకోపెట్టారు. పసిపిల్లలు గుక్కపెట్టి ఏడుస్తూంటే ఆడవాళ్ళు భయం భయంగా వెళ్ళి పాలిచ్చి వస్తున్నారు. పిల్లలకు కడుపునిండా పాలిస్తున్నారా? లేక పనిలోకి వచ్చెయ్యాలన్న తొందరలో సగంలోనే వచ్చేస్తున్నారా? అని అనుకుందామె.

సూర్యుడు నడినెత్తిమీదకు వచ్చేసరికి లేడీ నికోలాయ్ లేచి నిల్చుంది. బంగళాకు తిరిగి వచ్చేసరికి శరీరమంతా చెమట! మేడపైకి వెళ్ళి స్నానంచేసి లంచ్‌కి కిందకు వచ్చేసరికి భర్త భోజనం అయిపోవచ్చింది. ఆమె టేబిల్ దగ్గర కూచోగానే ఆయన "బాగా ఎండలో తిరిగి అలసిపోయినట్లున్నావు. నాకు ఆఫీస్‌వర్క్ ఎక్కువగా ఉంది. భోజనం చేసి రెస్ట్ తీసుకో. సాయంత్రం మాట్లాడుకుందాం" అంటూ లేచి వెళ్ళిపోయాడు.

రాత్రి సర్ విలియం నికోలాయ్ వచ్చేసరికి ఆలస్యమైంది. భోజనం చేసి మేడెక్కి బెడ్రూంలోకి వెళ్ళేసరికి నౌకర్లు సుఖనిద్రకు కావల్సిన ఏర్పాట్లు చేసి ఉంచారు. దూరంగా టేబిల్స్ మీద కాండిల్స్ వెలుగుతున్నాయి. కిటికీలలో నుంచి గాలి వీస్తోంది. మంచం పక్కన చిన్నిబల్లపై మంచినీళ్ళ కూజా ఉంది.

లేడీనికోలాయ్ మంచం మీద పడుకుంది కానీ నిద్రరావడంలేదు. భార్య మనసులోని అలజడిని గమనించిన విలియం నికోలాయ్ ఆమె మంచం మీద కూచుని ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని "డార్లింగ్! నిద్రరావడం లేదా? పిల్లలు గుర్తొస్తున్నారా? " అని అడిగాడు.

"పిల్లలు కాదు. ఈరోజు ఉదయం చూసిన దృశ్యం కళ్ళముందే కదుల్తోంది"

నికోలాయ్ ఆమె చేతిని నెమ్మదిగా నొక్కాడు.

బానిసలు పని చెయ్యడం చూసి వచ్చానని చెప్పిందామె. "పొలాల్లో కష్టపడి పని చెయ్యడం తప్పనిసరి. కానీ వారికి జీతం లేదు, సెలవులేదు. ఒక్కరోజూ పని మానడానికి లేదు. ఎక్కడకూ వెళ్ళడానికి లేదు. ఇటువంటి దుర్భర పరిస్థితిని మనమే తెల్లజాతివాళ్ళమే కల్పించాం. మీరు బానిసత్వ నిర్మూలనకు ఎందుకు శ్రమపడుతున్నారో నాకు అర్థమైంది"

"దుర్భర పరిస్థితిని కల్పించిన తెల్లజాతి వారే ఆ పరిస్థితి నిర్మూలనకూ పాటుపడాలి. అది నువ్వు అర్థం చేసుకున్నావు. నాకంతే చాలు"

"మీ భార్యనవడం నా అదృష్టం"

"నీది అమృత హృదయం. ఇది వరకు మన పిల్లలపై మాత్రమే కురిపించిన అమృతాన్ని అందరికీ పంచుతున్నావు. అది నా అదృష్టం" అంటూ ఆయన ఆమెను దగ్గరగా తీసుకున్నాడు.

★ ★ ★

ప్రతి రోజూ చెరకు తోట దగ్గరకు వెళ్ళి మధ్యాహ్నం దాకా కూచోడం అలవాటుగా మార్చుకుంది లేడీ నికోలాయ్. ఆ తోట యజమాని ఆమెను ఇంటికి ఆహ్వానించినా వెళ్ళలేదు. ఆరోగ్య రీత్యా ఎండలో కూచుంటున్నానని చెప్పింది. వారం గడిచేసరికి ఆమె వచ్చి తోట దగ్గర ఉండడం బానిసలకు అలవాటయింది. మరోవారం గడిచేసరికి ఆమెకేసి చూసి చిన్నగా నవ్వడం ద్వారా పలకరించడం మొదలెట్టారు. మూడోవారంలో నౌకరులను దుబాసీలుగా

పెట్టుకుని ఆమె అడిగే చిన్న చిన్న ప్రశ్నలకు సమాధానాలివ్వడం మొదలెట్టారు. ఒకనాడు లేడి నికోలాయ్ పదిగంటలదాకా తోట దగ్గరకు రాలేకపోయింది. ఒక బానిస స్త్రీ చంటిపిల్లాడికి పాలిస్తోంది. లేడీ నికోలాయ్ ఆమెకు కొంచెం దూరంగా కుర్చీ వేసుకుని కూచుంది. పాలు తాగుతున్న పిల్లాడిని పక్కన పడుకోబెట్టి ఆ మహిళ పనిలోకి వెళ్ళబోయింది. ఆకలి తీరలేదేమో పసివాడు తల్లిని వదల్లేదు.

"ఇంకా ఆకలిగా ఉన్నట్లుంది. బాబుకి కడుపు నిండా పాలిచ్చి ఆపైన పనిలోకి వెళ్ళు" అన్న లేడీ నికోలాయ్ మాటలను స్కల్లరీ మెయిడ్ క్రియోల్ భాషలోకి తర్జుమా చేసింది.

ఆఫ్రికన్ మహిళ తడబడింది, ఆపైన కుదరదన్నట్టు తల అడ్డంగా ఊపింది.

"ఏం ఎందుకని? పిల్లాడికి ఆకలి తీరకపోతేఎలా? నీరసించి పోతాడు"

స్కల్లరీ మెయిడ్ తర్జుమా చేస్తూండగా సంభాషణ ఇలా సాగింది.

"నీరసించి పోతే పోనీ నష్టమేమిటి? "

"పసిప్రాణానికి ఏదైనా అయితే? "

"అయితే ఏమవుతుంది? వీడు నాలుగోవాడు చచ్చిపోడానికి"

"ఏమిటలా మాట్లాడుతున్నావు? పిల్లాడు చచ్చిపోతే ఫరవాలేదా? " దుఃఖమో, కోపమో తనలో కలిగిన భావమేమిటో తనకే తెలియలేదు లేడీ నికోలాయ్‌కి.

ఆ మహిళ ఏమీ మాట్లాడకుండా పనిలోకి వెళ్ళిపోయింది. ఆమె వెనుక నుంచి "వాళ్ళకి మనలా ప్రేమాభిమానాలుండవు. రెండుకాళ్ళ మీద నడిచే జంతువులు ఈ నల్లజాతి వాళ్ళు" అన్నమాటలు విన్పించాయి. తిరిగిచూస్తే ఆ తోట యజమాని చేతిలో తుపాకీతో నిల్చున్నాడు.

'జంతువులలో మాత్రం సంతానంపై ప్రేమ ఉండదా? ' అందామనుకున్న లేడీ నికోలాయ్‌కి సంభాషణ పొడిగించాలనిపించలేదు. బంగళావైపు నడిచింది.

రోజులు గడిచిన కొద్దీ లేడీనికోలాయ్‌తో మనసు విప్పి మాట్లాడే చనువు ఆఫ్రికన్ స్త్రీలకు ఏర్పడింది. ఆపైన పురుషులూ ఆమెతో తమ కష్టాలు చెప్పుకోసాగారు. వారికి ఆమె తమతోట యజమానులందరిపైనా అధిపతి అయిన వ్యక్తికి భార్య అని తెలిసింది. ఇదివరకటి అధిపతుల్లా ఇప్పుడున్న ఆయన యజమానులతో కుమ్మక్కయి తమను బాధించడనీ అర్థమయింది. చదువుకునే అవకాశం లేకపోయినా వారికి లోకజ్ఞానంలో కొరత లేదని లేడీ నికోలాయ్‌కి అర్థమైంది. వారి జీవితాల గురించి తెలుసుకునే అవకాశం ఆమెకు కలిగింది.

ఆఫ్రికాలో సహజ భౌతిక వనరుల సంపదకు లోటులేదు. కానీ విద్యాగంధం చాలా తక్కువ. ప్రజాస్వామ్యం అన్న మాట కూడా తెలియని ఫ్యూడల్ వ్యవస్థ బలంగా ఉంది. ఏ పదార్థమైనా నాయకుడు స్వీకరించాకనే తెగలో మిగిలిన వారికి దక్కుతుంది. రెండు తెగలనాయకుల మధ్య ఎప్పుడూ యుద్ధాలు జరుగుతూనే ఉంటాయి. తెల్లజాతివారు ఆఫ్రికన్ తీరంపై అడుగుపెట్టినప్పుడు వారివద్ద ఉన్న తుపాకులను చూసి ఆఫ్రికన్లు భయపడిపోయారు. వాటిని తమపై కాల్చకుండా తెగలోని వారిని బానిసలుగా ఇచ్చేశారు. మరికొందరిని తుపాకులకు మార్పిడిగా ఇచ్చేశారు. ప్రతి తెగనాయకుడికీ శత్రుతెగమీద విజయానికి తుపాకీ కావాలనిపించింది. పోటీపడి ప్రజలను బానిసలుగా అమ్మేశారు. ఒక్కొక్కచోట శత్రుతెగలోని వారిని అపహరించి తెల్లజాతి వారికి ధారాదత్తం చేశారు. శత్రుతెగలో సంఖ్య తగ్గితే తమకు లాభమని యోచన.

"మిమ్మల్ని బానిసలుగా అమ్మేస్తే ప్రతిఘటించలేదా? " లేడీనికోలాయ్ అడిగింది.

ఆమె ప్రశ్న వారికి అర్థం కాలేదు. నాయకుడు చెప్పినట్లు వినాలి కానీ కాదన

డమన్నమాట తెలియదు. ఇనపగొలుసులతో కట్టేసి ఈడ్చుకుపోయి ఓడలలో కుక్కేసినా ఎదిరించాలన్న ఊహ వారికి రాలేదు. నల్లతెగ నాయకుడికైతేనేం, తెల్ల జాతి దొరకైతేనేం ఊడిగం చెయ్యడమే వారికి తెలుసు. బానిసత్వ నిర్మూలన చట్ట మొచ్చింది. కానీ వీరి మనస్సులలో నుంచి బానిస భావాల్ని నిర్మూలించడం చట్టం కన్నా ముఖ్యమనుకుంది లేడీనికోలాయ్.

ఆమెకు ఇంకో బాధాకరమైన విషయం తెలిసింది. ఏ పదార్థమైనా తెగనాయకుడే ముందు స్వీకరిస్తాడన్న సంగతి. అలా స్వీకరించే వాటిలో స్త్రీ శరీరం కూడా ఒకటిగా కొన్ని తెగలలో నియమముందట. తెగనాయకుడు ఒక స్త్రీని శారీరకంగా సొంతం చేసుకున్న తరువాతే ఆమె ఇతరులెవరినైనాయ పెళ్లి చేసుకుని సంసారం చెయ్యవచ్చు.

పగవాడికి కూడా ఇలాంటి కష్టాలు ఉండకూడదు అనుకుంది లేడీనికోలాయ్.


5

**ప**గవాళ్ళకు కూడా ఇలాంటి కష్టాలు రాకూడదు అనుకుంది పుల్లమ్మ. అనుకోడమే కాదు పక్కనే కూచున్న తోడికోడలు లచ్చమ్మతో అంది కూడా.

"ఏం కష్టమొచ్చిందక్కా! కొడుక్కి పెళ్లి చేశావు. కూతురి పెళ్లి ఇదివరకే అయింది. వియ్యాలవారు మంచి వాళ్ళు. నీకింకేం కష్టముంది? "

తోడి కోడళ్ళిద్దరూ దంపుళ్ళకి వెళ్ళి భూస్వాములిచ్చిన నూకలు తెచ్చుకుని గుడిసె ముందు ఎండలో పోసి కాపలా కూచున్నారు.

"కష్టం కాకపోతే ఏమిటి? ఒక్కగా నొక్క కొడుకు. చెన్నపట్నం పంపించాల్సి వచ్చింది. వెళ్ళగానే ఉత్తరం పంపిస్తానని మరిది అన్నాడు. రోజూ తపాలా మనిషి వస్తాడని చూస్తున్నాను. ఇంకా రాలేదు"

లచ్చమ్మ గట్టిగా నవ్వి "అయ్యో రామా! వాళ్ళు వెళ్లి నెల కూడా కాలేదు. ఇంకా చెన్నపట్నం చేరారో? లేదో? అక్కడ ఎవరితోనైనా ఉత్తరం రాయించాలి. తపాలాకి ఇవ్వాలి. వాళ్ళు అంచెలంచెలుగా తేవాలి. అప్పుడే బెంగ పెట్టుకుంటే ఎలా? " అంది.

"నా బాధ నీకేం తెలుస్తుంది" పైకి అని పుల్లమ్మ మనస్సులో 'నీకు పిల్లలుండి వాళ్ళు దూరంలో ఉంటే తెలిసేది' అనుకుంది. తోటికోడలికి పిల్లలు లేరని అనకూడదన్న ఇంగితం పుల్లమ్మకి ఉంది.

లచ్చమ్మ మౌనంగానే కూచుంది.

"ఒక్క విషయం నాగన్నకి చెప్పడం మర్చిపోయానే. ఎప్పటికీ కల్లూ, సారాయీ తాగకు. చుట్టలు కాల్చకు అని చెప్పాలనుకున్నాను మర్చి పోయాను"

"దొరలేవో సీసాల్లోవి తాగుతారట. పొగాకుని తెల్లకాయితంలో చుట్టి కాలుస్తారట. అవైతే ఫరవాలేదా? " అంది లచ్చమ్మ. ఆమెకు తోటికోడలి బెంగ కొంత చిరాకుని కల్గిస్తోంది. తన మొగుడు వెళ్ళినప్పటికీ, నాగన్న వెడుతున్నప్పటికీ ఎంత తేడా? అప్పులు తీర్చలేక అర్ధరాత్రి పారిపోయాడు తన భర్త. ఒంటరిగా ఎలా ఉన్నాడో? ఎక్కడున్నాడో? తెలియదు. నాగన్నకేమిటి ఏడురూపాయల కొలువు దొరికాక చిన్నాన్నతో కలిసి చెన్నపట్నం వెడుతున్నాడు. తన బాధముందు ఈవిడ బాధ ఎంత అనుకుంటున్న లచ్చమ్మకి కడుపులో తిప్పినట్లనిపించింది. ఏమైందబ్బా

ఈ వేళ ఇలా ఉందేమిటి? అన్నట్లు నెల సరి కూడా వచ్చినట్లులేదు, నాగన్న పెళ్ళి హడావుడిలో పట్టించుకోలేదు, అలా అయి ఉంటుందా? కాదేమో? లేదు అయ్యే ఉంటుంది.

తియ్యటి ఆలోచనలలో పడ్డ లచ్చమ్మ ముఖం మీద ఆనందంతో కూడిన చిరు నవ్వు మెరిసింది.

"ఏమే లచ్చీ నవ్వుతున్నావు? నా బెంగను చూశా? "

"అబ్బే! లేదక్కా!"

'ఎలా ఉన్నాడో నా వెర్రి నాగన్న' అను కుంది పుల్లమ్మ.

★ ★ ★

'వెర్రి నాగన్న' అని తల్లి అనుకున్నా నాగన్న చాలా హుషారుగా ఉన్నాడు. ఆనాటి ఉదయమే కృష్ణానదిని పడవలలో దాటారు. రాజానగరం చేరుకున్న నాటి నుంచీ నాగన్నలో ఉత్సాహం పోటు వచ్చిన సముద్ర కెరటాల్లా ఉప్పొంగి పోతోంది. రాజానగరంలో వారం ఎదురు చూస్తేకానీ యజమాని కాశీయాత్ర ముగిం చుకుని ఆ ఊరు రాలేదు. ఆ వారమూ రామయ్య నాగన్నకి కొలువులోని కష్టాలు చెప్తూనే ఉన్నాడు. "ఇదిగో నాగన్నా! మీ అమ్మ ఇచ్చిన పచ్చళ్ళూ, నీ బట్టలూ మూటకట్టుకుని మొయ్యడం కాదు. డేరా బొంగులంటే బరువుంటాయి. రాత్రి అ న్నం తిని పడుకోడం కాదు. ఒక జాము పాటు పహరా ఇవ్వాలి. ఆలోచించుకో! వీలుకాకపోతే ఇప్పుడే వెనక్కి వెళ్ళిపో" అని అంటూనే ఉన్నాడు.

"భయంలేదు. నేను చెయ్యగలను" అని నాగన్న చెప్తూనే ఉన్నాడు.

రాజమహేంద్రవరం చేరుకునే వరకూ బొంగులు మోసిన నాగన్నకు భుజాలు నొప్పిగా అన్పించాయి. రాత్రి జాము సేపు నిద్ర మానుకోడమూ కష్టమనిపించింది. కానీ గోదావరిలో పడవ ఎక్కేసరికి అల సట అంతా తేలిపోయినట్లనిపించింది.

"అమ్మ ఎప్పుడూ పడవెక్కనివ్వలేదు. ఎంత హాయిగా ఉందో! చల్లగా గాలి! ఊగి సలాడే పడవ, బాగుంది చిన్నాన్నా!"

"గోదారివేరు, సంద్రంవేరు. అందులో కెరటాలు ఇక్కడ ఉండవు. ఉప్పుగాలీ ఉండదు"

"అమ్మని బలే ఒప్పించావు చిన్నాన్న"

"మా యజమానినీ ఒప్పించాను. చిన్న పిల్లవాడివైనా నా మీద నమ్మకంతో నీకు పని ఇచ్చారు. నా మర్యాద దక్కించాలి"

"బాగానే పని చేస్తున్నాగా చిన్నాన్నా"

"ఎప్పటికీ ఇలాగే చెయ్యాలి. యజమా నీ, అమ్మగారూ చాలా మంచివాళ్ళు. పని వాళ్ళని కూడా వాళ్ళ బిడ్డల్లాగే చూసుకుం టారు. కాశీలో చలిగా ఉంటే అందరికీ ముతకగుడ్డల్తో చొక్కాలు కుట్టించారు"

"చెన్నపట్నం వెళ్ళాక నేను కూడా చొక్కా కుట్టించుకుంటా"

రామయ్య ఫక్కున నవ్వాడు "ఇంకా ఒక్కకానీ అయినా సంపాదించలేదు. అప్పుడే ఖర్చు గురించి ఆలోచిస్తున్నావా? దుబారా చెయ్యకూడదురోయ్!"

కృష్ణ ఒడ్డున గుడారాల చుట్టూ రాత్రి నాలుగో జాములో పహరా ఇస్తున్న నాగ న్నకు చిన్నాన్న మాటలు గుర్తొచ్చి నవ్వొ చ్చింది. చిన్నాన్న తాగుడుకి అప్పులు చేశాడు. అప్పులు తీర్చాలి కాబట్టి డబ్బు దాచుకోవాలి. తనకేమిటి చొక్కాలు కుట్టిం చుకుంటాడు. అమ్మకి గళ్ళకోకా, చుట్టు చెంగావికోకా కొంటాడు. దొరల్లా చెప్పులు కొనుక్కుంటాడు. అసలు అమ్మను కూడా చెన్నపట్నం తీసికెళ్ళిపోతాడు. కట్టెలు కొట్ట కుండా, వడ్లు దంచకుండా అమ్మ సుఖంగా ఉంటుంది. భవిష్యత్తు గురించిన మధుర మైన ఆలోచనలలో ఉన్న నాగన్నను పక్షుల కూతలు ఇహలోకంలోకి తెచ్చాయి. తూర్పున వెలుగు రేకలు అతనికి జీవి తంలో వెలుగుని తెస్తున్నట్లపించాయి.

"ఏరా నిద్రవస్తున్నదా?" అన్న రామయ్య ప్రశ్నకు నాగన్న "లేదు చిన్నాన్న, జాము సేపేగా పహరా ఇచ్చింది" అన్నాడు.

"అయ్యగారికి ముందుచూపు చాలా ఎక్కువ. రాజమహేంద్రవరం దగ్గర గోదావరిని దాటుతున్నపుడు అక్కడ జమీందారుగారు డేరాలు అవసరం లేదనీ, ప్రతి చోట బస చెయ్యడానికి ఇల్లు దొరుకుతుందనీ చెప్పారు. కానీ అయ్యగారు వినకుండా డేరాలనూ, బొంగులనూ మీ అందరిచేతే మోయించుకొచ్చారు. మీకు కొలువు దొరికింది. ప్రతి చోటా బస దొరకలేదు"

"అవును కలిదిండిలో కానీ, తుమ్మడిలో కానీ బస దొరకలేదు. మచిలీ బందరులో ఇల్లు దొరికింది. మచిలీబందరు ఎంత పెద్ద బస్తీ చిన్నాన్నా. మొత్తం ఇరవైరెండు పేటలున్నాయిట. కాకినాడకన్నా పెద్దబస్తీ. ఊళ్ళో అందరూ మంచివారు. అందుకే కాబోలు ఊరినిండా ముష్టివాళ్ళే"

"ఊరినిండా ముష్టివాళ్ళుండటానికి కారణం ఊళ్ళో మంచి వాళ్ళుండడం కాదురా వెర్రి నాగన్నా. ఇక్కడెవరికీ పంట పండించుకునేందుకు వీలైన భూమిలేదు. భూవిస్తారం లేదుకానీ సంతాన విస్తారం ఉంది. తిండి గడవడానికి ముష్టి ఎత్తుకోడమే మార్గం. శరీరాలు మనశరీరాల్లా ఆరోగ్యమూ, గట్టితనమూ ఉన్నవి కావు. చదువు వచ్చిన వాళ్ళైతే ఇదివరలో పూనా, తంజావూరు వెళ్ళి పండిత సన్మానాలు పొందేవారు. ఇప్పుడు ఆ అవకాశంలేదు కనుక యాచకవృత్తి తప్పదు. కొందరు చెన్నపట్నంలో సంపాదనకు ప్రయత్నిస్తూంటారు"

"చిన్నాన్నా! నీకు ఇన్ని విషయాలు ఎలా తెలిశాయి?"

"అయ్యగారు రాత్రి పడుకునేప్పుడు కాళ్ళు పడుతూ ఉంటాను. ఆ సమయంలో ఇలాంటి సంగతులు చెప్తారు"

"అయితే నేనూ కాళ్ళు పడతాను"

"ముందు నీకు అప్పచెప్పిన పనులు బాగా చెయ్యి"

"చేస్తున్నానుగా, చిన్నాన్నా! మచిలీ బందరు పెద్దబస్తీ కదా! అక్కడున్నవాళ్ళకి ఇంటి బాడుగలే రూపాయలు రూపాయలు నెలకి వస్తాయిట"

"విషయాలు బాగానే తెలుసుకుంటున్నావే, మచిలీబందరు ఇదివరకు అయిదరాబాదు నవాబుదే. కుంఫీణీ దొరలకు



ఇచ్చేశాడు. దాంతో కలకటేరు, కోరటు అన్నీ వచ్చాయి. ఇంటిని బాడుగకు తీసు కునేవారు ఎక్కువయ్యారు. మచిలీబందరు పెద్దబస్తీ అంటున్నావు.. చెన్నపట్నం చూస్తే ఇంకేమంటావో? "

"చెన్నపట్నం ఏమంత పెద్దబస్తీ? కల కత్తా చూస్తే చెన్నపట్నం చిన్న పల్లెలా అనిపిస్తుంది" అన్నాడు అప్పుడే అక్కడకు వచ్చిన ఒక బోయీ.

"నువ్వు కలకత్తా, కాశీ, గయ, ప్రయాగ, పూరీ జగన్నాథం అన్నీ అయ్యగారితో వెళ్ళి చూశావని మాకు తెలుసు. అయ్యగారు అక్కడ నీకు చలికాలంలో చొక్కాలు కుట్టిం చారనీ తెలుసు. ఇప్పుడు గొప్పలు చెప్పక్క రలేదు" అన్నాడు రామయ్య.

"నేనేం గొప్పలు చెప్పాను? చెన్నపట్నం కన్నా కలకత్తా పెద్దదన్నంతలో కోపంతో గింజుకోడం ఎందుకు" అన్నాడా బోయీ.

"నేను గింజుకుంటున్నానా? "

"గింజుకోక ఏం చేస్తున్నావు? " అంటూ బోయీ రామయ్యపై చేయి ఎత్తాడు.

నాగన్న బెదిరిపోయాడు. చిన్నాన్నతో దెబ్బలాడుతున్నవాడు తాగున్నాడని అతని అనుమానం. ఇద్దరినీ ఎలా విడదీయాలా అని ఆలోచిస్తుండగా డేరాల దగ్గర హడా వుడి.. అమ్మగారూ, అయ్యగారూ, కృష్ణాన దిలో స్నానం చెయ్యడానికి వస్తున్నారు. ఇక్కడ దెబ్బలాట ఆగింది.



"ఏరా ఇద్దరూ తాగి ఒళ్లు తెలియకుండా ఉన్నారా? ఇలాగైతే ఇక్కడనుంచే ఇళ్ళకి పొండి" అన్న గంభీరస్వరం వినిపించింది.

"లేదయ్యగారు లేదు" అంటూ ఇద్దరూ వంగి దండం పెట్టారు. నాగన్న కూడా యజమానికి నమస్కరించాడు.

★ ★ ★

యజమాని గుడారం వైపు నడుస్తున్న రామయ్య దగ్గరకు నాగన్న పరిగెత్తు కుంటూ వెళ్ళి "చిన్నాన్నా! ఈ రాత్రి అయ్య గారి కాళ్ళు నేను పడతాను" అన్నాడు.

"నువ్వెప్పుడూ కాళ్లుపట్టే పని చెయ్యలేదు కదరా? "

"ఇదివరకు డేరా బొంగులు మోశానా? పహరా కాశానా? ".

ఆ మాట నిజమే. వదిన ఎప్పుడూ నాగ న్నకి ఏపనీ చెప్పలేదు. లేకలేక కలిగిన సంతానమని అల్లారుముద్దుగా పెంచింది. యాత్ర పూర్తయితే డేరా బొంగులు మోసే పనీ, పహరా కాసే పనీ ఉండవు. అయ్య గారు కొలువులో ఉంచుకోవాలంటే నాగ న్నకి అన్నిరకాల పనులూ రావాలి.

"సరే! జాగ్రత్తగా చెయ్యి. నేను డేరా బయటే కూచుంటాను. అయ్యగారికి నీ పని నచ్చలేదనిపిస్తే లోపలకు వస్తాను"

నాగన్న డేరా లోపలకు వెళ్లాడు. యజ మాని మడత మంచం మీద పడుకుని ఉన్నాడు. మంచం పక్కనే చిన్న ముక్కాలి పీట ఉంది. 'దాని మీద కూచుని కాళ్లు పట్టాలా? ' అని నాగన్న అనుకున్నాడు. కూచోబోయే ముందు డేరా గుమ్మం వైపు చూశాడు. రామయ్య 'నిలబడే ఉండు' అని సైగ చేశాడు. నాగన్న నిల్చునే "దండాల య్యగారూ" అన్నాడు.

"రామయ్య అన్న కొడుకువి కదూ!"

"అవునండయ్యగారూ!"

"ఈవేళ నువ్వు వచ్చావేం? "

నాగన్న మాట్లాడలేదు.

"సరేలే. ముందుగా ఎడంకాలు పట్టు. అదిగో ఆ ముక్కాలి పీట ఇటువైపు వేసు కుని కూచో"

అయ్యగారు చెప్పేకనే కూచోవాలన్న మాట అనుకుంటూ నాగన్న కూచుని యజమాని కాళ్లు పట్టసాగాడు.

"ఎలా ఉందిరా నీకు ఈ కొలువు? "

"బాగుందయ్యగారూ!"

"బాగుందంటే చాలదు. యాత్ర అంటే పల్లకీలు మొయ్యడం, డేరాలు వెయ్యడం కాదు. ఏయే ఊళ్లు చూశాం? అక్కడ ఏమేం ఉన్నాయి? అన్నది గమనించాలి. నువ్వేం నేర్చుకున్నావో చూస్తాను. కృష్ణను దాటాక ఎక్కడెక్కడ ఆగామో చెప్పు"

నాగన్న ఒక్కక్షణం తడబడ్డాడు. సరిగా చెప్పకపోతే కొలువులో నుంచి తీసేస్తారా? అని భయపడ్డాడు.

"ఏంట్రా! ఒక్కూరు పేరూ చెప్పలేవా? "

భయపడుతూ భయపడుతూ "కనగాల, చందవోలు, బాపట్ల, వేటపాలెం, చిన్న గంజాం" అని చెప్పాడు నాగన్న.

"సరిగానే చెప్పావు కదా! ఆ ఊళ్లలో వింతలేమైనా చూశావా? "

"వేటపాలెంలో చీరలు నేస్తున్నారండీ, చిన్నగంజాంలో ఉప్పు పంట ఉందండీ"

"బాపట్లలో, చందవోలులో పెద్ద దేవాల యాలుండేవట. ఇప్పటికీ కొన్ని ఉన్నాయి. ఇటువైపు వచ్చి కుడికాలు పట్టు"

నాగన్న రెండో వైపుకి ముక్కాలిపీట తెచ్చుకున్నాడు.

"ఇంకేం చూశావు దారిలో? " యజ మాని అడిగాడు.

నాగన్న ఒక్కక్షణం కాళ్లు పట్టడం ఆపాడు. అతని మనస్సులో ఒక విషయం గురించి అడగాలని ఉంది. భట్టిప్రోలు పక్కనుంచి నడిచినప్పటి నుంచీ సందేహం పీకుతూనే ఉంది. ఎవరిని అడగాలో తెలి యదు. యజమానిని అడగచ్చో లేదో? అంతకన్నా తెలియదు. అడిగితే కోపగించి కొలువులోనుంచి తీసేస్తారేమో తెలియదు.

"ఏరా ఏమిటి ఆలోచిస్తున్నావు? కాళ్లు పట్టడం మానేశావు"

నాగన్న ఉలిక్కిపడి గబగబా కాళ్లు పిసకడం మొదలెట్టాడు.

"ఏమిట్రా ఆలోచిస్తున్నావు? "

"అబ్బే ఏం లేదండయ్యగారూ" సిగ్గుతో మెలికలు తిరుగుతూ, భయంతో ఒణికిపోతూ నాగన్న సమాధానం చెప్పాడు.

"నౌకర్ల మనస్సులో ఏముందో చెప్పలేని వాడిని కాదు. ఏ భయం లేదు. ఏం కావాలో చెప్పు"

"ఏమక్కరలేదు కానీ.. కానీ.. మనం వస్తున్నదారిలోనండి భట్టిప్రోలు అనే ఊరు ఉందండి. అక్కడో పెద్దమిట్ట ఉందండి. నా పక్కన నడుస్తున్న ఆ ఊరు వాళ్లెవరోనండి ఆ మిట్టను..." నాగన్న ఒక్క క్షణం ఆగి ధైర్యం తెచ్చుకుని "లంజదిబ్బ అని చెప్పుకుంటూ వెళ్లారండి" అని గుటకలు మింగుతూ చెప్పాడు.

యజమాని ఫక్కున నవ్వాడు.

"ఒరేయి నీకెన్ని ఏళ్లురా? "

"మా అమ్మ పదిహేను, పద్నాలుగు అంటుంది కానీ ఇరవై దాటాయండి"

"నువ్వన్న మాటకు అర్థం తెలుసా? "

"మా అమ్మ పెద్దాపురం దంపుళ్ల కెడితే నేను కూడా వెళ్లే వాణ్ణండి. అక్కడ ఓ వీధికి ఈ పేరుందండి. ఆడాళ్లు అందరూ పాడతారండి. ఆడతారండి. మా అమ్మ ఆ వీధి దరిదాపులకి కూడా వెళ్లనిచ్చేది కాదండి. అక్కడ మనుషులున్నారు, ఇక్కడెవరూ లేరండి. మరి ఆ పేరెందుకుందని అనుమానమొచ్చిందండి"

"నీకు పెళ్లయిందా? "

నాగన్న మెలికలు తిరిగిపోయాడు.

"పెళ్లయింది.. ఇంకేం కాలేదండి"

యజమానికి నాగన్న మీద వాత్సల్య భావన కలిగింది. ఆట పట్టిద్దామన్న సరదా కూడా కలిగింది. నౌకర్లతో గంభీరంగా మాట్లాడే ఆయన నాగన్నతో "ఇంకేం కాలేదా? అంటే..? " అన్నాడు.

"అదేనండి. అమ్మాయి ఇంకా చిన్నపిల్లని మా అత్తారు అన్నారండి"

ఎదిగీఎదగని వయస్సు, తెలిసీ తెలియని భావనలు. ఈ సమయంలో కుర్రవాడికి లంజదిబ్బ అన్న మాట ఎలా వచ్చిందో చెప్పచ్చునా? లేదా? అన్న సంశయం ఆయన మనస్సులో మెదిలింది.

"గౌతమ బుద్ధుడి పేరు విన్నావా? "

"పిఠాపురంలో హరికథ చెప్పారండి. దశావతార కథలన్నీ ఇరవై రోజులు చెప్పారండి. బుద్ధుడి కథ కూడా చెప్పారండి. అమ్మవారికి కోళ్లూ, మేకలూ బలివెయ్యద్దని బుద్ధుడు చెప్పాట్ట కదండి. యుద్ధాలు కూడా మానెయ్యమన్నాట్టండి. బుద్ధుడే ఉండి ఉంటే బొబ్బిలి యుద్ధం ఆపేవాడని చెప్పారండి"

"అవును. బుద్ధుడు అన్నిటి మీదా ఆశ వదులుకోమని చెప్పాడు. ఆయన శిష్యులందరూ ఆయన మార్గంలో నడుచుకునేవారు. సన్యాసం స్వీకరించి మఠంలో ఉండేవారు. అయిదారు తరాలు గడిచేసరికి సన్యాసులకి ఆశ వదులుకోడం కష్టమైపోయింది. అందునా ఆడదాని మీద ఆశ వదులుకోడం మరీ కష్టమైంది. మఠంలో సన్యాసులున్నారా? సర్వసంగ పరిత్యాగులే ఉన్నారా? అని అనుమానం కలిగేలా భిక్షువులు స్త్రీలతో సరసాలు ప్రారంభిం

## కొత్తగాలి...

**తీర్చిదిద్దితే పర్యావరణం**
**ధరణే జగతికి ఆభరణం!**
**లేకుంటే మనిషికి**
**ప్రకృతితో 'రణం'**
**ప్రళయానికి స్వాగత తోరణం!**

– బద్దిగం పాండురంగారెడ్డి, కరీంనగర్

చారు. అలా ఉంటేనే మోక్షం అన్నారు. అక్కడి పద్ధతులను ఏవగించుకుని ప్రజలు దాన్ని 'లంజెదిబ్బ' అనడం ప్రారంభించారు. ఇప్పుడు మఠం లేదు కానీ పేరు మిగిలిపోయింది. ఎంతటి మహానుభావుడికైనా శిష్యపరంపర సరైంది లేకపోతే ఆయన చెప్పిన ధర్మమార్గం నిలబడలేదు"

"ఇప్పుడందరూ అలాంటి శిష్యులేనండి. హరికథ విని ఇంటికొచ్చి తాగుతారండి, జూదమాడతారండి. మీరు చెప్పిన పని కూడా చేస్తారండి"

యజమాని సన్నగా నవ్వాడు. ఈ చిన్న కుర్రవాడికి ఇలాంటి సంగతులు చెప్పవచ్చునా? మరి ప్రశ్న అడిగితే ఏం చెయ్యాలి? దొరలసీమలో శిష్యులు ప్రశ్న అడిగితే గురువులు సంతోషిస్తారట. అందుకే తెల్లదొరలు అంత విజ్ఞానాన్ని ఆర్జించి, యంత్రాల సృష్టి చేసి, అభివృద్ధిని సాధించారు. ఈ దేశంలో చాలామందికి చదువుకుందుకు కూడా అవకాశం లేదు.

అనేక సామాజిక, ధార్మిక కారణాలు చూపించి నూటికి ఎనభై మందిని విద్యకు దూరం చేశారు. చదువుకునే వారు కూడా గురువు నేర్పింది నేర్చుకోవలసినదే కానీ ప్రశ్నించకూడదు. మనలో ప్రశ్నించే తత్వం లేని కారణంగానే తెల్లదొరలు భరతభూమిని జయించి పరిపాలించగలుగుతున్నారా? యజమానికి చాలా సేపటి వరకూ నిద్రపట్టలేదు. ఆయనకి నిద్రపట్టినా నాగన్న కాళ్లు పట్టడం ఆపలేదు. ఎందుకంటే అతనూ ఆలోచనలోనే కొట్టుకుపోతున్నాడు. యజమానివి సంశయాత్మకమైన ఆలోచనలు. నాగన్నవి శృంగారపరమైన మధురోహలు.

మర్నాడు మరో మజిలీకి ప్రయాణమై వెళ్లాల్సి ఉంది కానీ యజమాని ప్రయాణం వాయిదా వేశాడు. పరిచారక బృందంలో ఇద్దరు వంటవాళ్ల ఇళ్లు బాపట్లకు దగ్గరలో ఉన్నాయి. వారు స్వగ్రామం వెళ్లి అమ్మన బోలులో కల్సుకుందుకు అనుమతి తీసుకుని వెళ్లారు. వారింకా రానందువల్ల ఆనాడు ప్రయాణం లేదు.

పగలంతా పని లేనందువల్ల నాగన్నకు రాత్రి నిద్రపట్టడం లేదు. వంటకు కావల్సిన నీళ్లు తెచ్చాడు. రాత్రి మొదటి జాము పహరా కాశాడు. ఆ తరువాత చిన్నాన్నకు దగ్గరగా బొంత వేసుకుని పడుకున్నాడు. అటూ ఇటూ దొర్లుతున్న నాగన్నతో రామయ్య "ఏరా! నిద్రపట్టడం లేదా? " అన్నాడు.

"లేదు. అమ్మ గుర్తుకొస్తోంది"

"అమ్మ గుర్తువస్తోందా? మల్లి గుర్తొస్తోందా? "

తన భార్య మల్లమ్మ మాట ఎత్తేసరికి నాగన్నలో సిగ్గూ, చిలిపితనం సమంగా నాట్యం చేశాయి.

"పో చిన్నాన్నా" అంటూ గట్టిగా కళ్లు మూసుకున్నాడు. ఒక కంట్లో తల్లీ, ఇంకో కంట్లో మల్లీ కనిపించారతనికి.

★ ★ ★

"అమ్మో ఇంకో ఉప్పు కాలవ" అన్నాడు డేరా మేకుల సంచీ మోస్తూ అందరి కన్నా ముందు నడుస్తున్న బోయీ. అతని వెనక డేరాబొంగులు మోస్తూ నడుస్తున్న నాగన్న ఆగిపోయాడు. ఇంతకు రెండు రోజుల ముందే ఉప్పుటేరు ఒకటి దాటారు. అందులో విషసర్పాలను తప్పించుకుంటూ రొమ్ములోతు నీళ్లల్లో నడవడం ఎంతో కష్టంగా అన్పించింది. ఇంతలోనే ఇంకో ఉప్పుటేరు వచ్చిందేమిటి? ఇక దారి పొడుగంతా ఇలాగే ఉంటుందా?

నాగన్న ఆగడంతో పరిచారక బృందమంతా ఆగిపోయింది. యజమాని పల్లకీలో నుంచి తల బయటపెట్టి "ఏం ఆగిపోయారు? " అన్నాడు.

"ఉప్పు కాలవ వచ్చినట్టుందయ్యగారూ" అన్నాడు ఆయన పల్లకీ మోస్తున్న బోయీలలో ఒకడు.

"పల్లకీ దింపండి" అన్నాడు యజమాని.

బోయీలు పల్లకీ దింపగానే ఆయన దిగి ఒక పెద్దకర్ర చేత్తో పట్టుకుని "నేను లోతు చూసుకుంటూ ముందు నడుస్తాను. నా వెనకే అందరూ రండి. ఆడవాళ్లనూ, పిల్లలనూ మేనాలలో తీసుకురండి. బళ్లు ఖాళీ చేసి సామానుని రెండో వైపుకి చేర్చండి" అంటూ కర్ర సాయంతో ఏరు లోతు చూసుకుంటూ నడవసాగాడు.

ఆయన వెనకే నెమ్మదిగా అందరూ నడవసాగారు. నెత్తిమీద సరుకులతో నడుస్తున్న నాగన్నకు తల్లి గుర్తొచ్చి నవ్వు వచ్చింది. తనను నీళ్ల దగ్గరకు వెళ్లనిచ్చేదే కాదు. ఇప్పుడు ఇలా నీళ్లలో నడుస్తున్నాడని తెలిస్తే.. నవ్వుకుంటూ రెండోవైపుకి చేరి డేరా బొంగులు గట్టుమీద పెట్టిన నాగన్నకు హాహాకారాలు విన్పించాయి.

సముద్రం పోటు వచ్చిందో? లేదో? కాని ఏరు లోతు పెరిగినట్లుంది. రొమ్ము లోతు కాస్తా మెడ లోతయింది. వాగు వేగం పెరిగిందో? బోయీలు తాగి తూలి పోతున్నారో? కానీ మేనాని వదిలేశారు. మేనాలో కూచున్న ఆవిడ, చేతిలోని పసిపిల్లను గట్టిగా పట్టుకోకుండా వదిలేసి "చచ్చాను బాబోయ్" అని ఏడుపు మొదలెట్టింది. ప్రవాహంలో కొట్టుకుపోతున్న పసిపిల్లను చూసి నాగన్న చటుక్కున నీళ్లలోకి దూకి రెండు మూడు అంగల్లో పట్టుకున్నాడు. మేనాని మిగిలిన నౌకర్లు మునిగిపోకుండా పట్టుకున్నారు. అరగడియపాటు అంతా గందరగోళంగా గడిచింది.

తరువాత అంతా స్థిమితపడ్డాక యజమాని పసిపిల్ల తల్లికి ధైర్యంగా ఉండడం, జాగ్రత్తపడడం ఎలాగో చెప్పాడు. బోయీల్లో ఇద్దరు తాగి ఉన్నారని తెలియగానే వారిని కొలువు నుంచి తీసేశాడు. నెల్లూరు చేరుకునేదాకా నాగన్నకూ, ఇంకో నౌకరుకూ మేనా మోసే పనిచ్చాడు. కృష్ణాష్టమినాడు ఉట్టి కొట్టినంత సంబరమైంది నాగన్నకు.

★ ★ ★

## ఈశ్వరచంద్ర చతురోక్తులు



మనదేశ సాంస్కృతికోద్యమంలో అగ్రగామిగా నిలిచిన పునరుజ్జీవనోద్యమకాలపు మహనీయుడు ఈశ్వరచంద్ర విద్యాసాగర్. వివిధ సందర్భాల్లో ఆయన విసిరిన చతురోక్తులు..

### దెబ్బకు దెబ్బ!

ఒకసారి విద్యాసాగర్ హిందూ కాలేజీ ప్రిన్సిపాల్ ఆంగ్లదొర కెర్‌ను కలిసేందుకు వెళ్లాడు. అప్పుడు కెర్ కుర్చీలో చేరగిలబడి, డెస్క్‌మీద 'వి' ఆకారంలో బూటుకాళ్లను పెట్టి, ఊపుతూ, విద్యాసాగర్ పట్ల నిర్లక్ష్యంగా ప్రవర్తించాడు.

ఇది జరిగాక కొన్నాళ్లకు కెర్ తన్ను కలవడానికి వస్తున్నాడని తెలిసి విద్యాసాగర్ గదిలోని కుర్చీలన్నీ తీయించేసి, మేజాపై కాలిపైకాలు పెట్టుకుని దర్జాగా కూర్చున్నారు.

దాంతో కెర్ ఆగ్రహానికి గురయి ఈ విషయాన్ని పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ డైరెక్టర్ ఎఫ్.జె. మొవట్ దృష్టికి తీసుకెళ్లాడు. సంజాయిషీ అడిగిన ఆ అధికారికి విద్యాసాగర్ 'నేనేం తప్పు చేయలేదు. కెర్‌ను గురువుగా స్వీకరించానంతే' అన్నారు. దాంతో అసలు సంగతి గ్రహించిన ఆ అధికారి విద్యాసాగర్ ఆత్మాభిమానానికి ముచ్చటపడ్డాడు.

"చేతిలో మువ్వలకర్రతో ఎవరబ్బా నడిచి వస్తున్నారు?" అనుకుంటూ లచ్చమ్మ కళ్లకు ఎండ తగలకుండా చెయ్యి అడ్డం పెట్టుకుని తేరిపార చూసింది.

మువ్వల కర్ర నేలమీద తాటిస్తూ నడిస్తే ఆ చప్పుడుకి పాములు పక్కకు పోతాయని కొందరు అలా నడుస్తాంటారు. కానీ అలాంటి కర్ర సంపాదించడం శ్రామికులకి సాధ్యం కాదు. అందుకే ఉప్పాడలో మువ్వల కర్రతో మనిషి కన్పించగానే లచ్చమ్మ ఆశ్చర్యపోయింది.

మనిషి దగ్గర పడుతున్నట్లుగా పెరుగు

తున్న మువ్వల సవ్వడి చెప్తోంది. ఎంత ప్రయత్నించినా ముఖం గుర్తుకు రావడం లేదు. ఏదో ఊరెడుతూ ఇక్కడ కాసేపు విశ్రాంతి కోసం ఆగుతాడేమో అనుకుంది.

నడుస్తున్న ఆ మనిషి "పుల్లమ్మ ఇల్లెక్కడ? " అని ఆడుకుంటున్న అబ్బాయిని అడుగుతూండడం లచ్చమ్మ వింది. తోడికోడలికిలాంటి బంధువులెవరూ లేరే.

ఆ పిల్లాడు "అదిగో ఆ గుడిసే" అంటూ ఆటల్లో మునిగిపోయాడు.

"ఇది పుల్లమ్మ ఇల్లేనా? " అడిగాడు.

"నువ్వెవరు? " అంది లచ్చమ్మ.

"తపాలా రన్నరుని. పుల్లమ్మకి ఉత్తరం తెచ్చాను" అన్నాడతను.

కొత్తగాలి...

**తెలిసిన మేధావులు**
**తెలియనట్లుంటారు!**
**తెలియని మూర్ఖులు**
**తెలిసినట్లుంటారు!!**

– ఆర్.ఎస్. హైమవతి,
చెన్నై

"ఉత్తరమా!" అని అడిగిన లచ్చమ్మ కంఠంలో ఆశ్చర్యమూ, ఆందోళనా కలిసి కనిపించాయి. ఏదైనా పన్ను కట్టని వాళ్లని కోరటు జవాను ఉత్తరం చూపించి పట్టుకుపోతాడు. తన పెనిమిటి ఇక్కడకు వచ్చినప్పుడు తీరువా చెల్లించాడు కదా!

"తీసుకోవమ్మా! నీ గుడిసె ముందు నిల్చోవడం తప్ప నాకు పనిలేదా? " అంటూ విసుక్కున్నాడు తపాలారన్నరు.

"పుల్లమ్మ ఇంట్లో లేదు"

"అయితే ఏమిటి? ఇదేమీ దస్కతు చేసే వ్యవహారం కాదు. పుచ్చుకో. చెన్నపట్నం నుంచి అంచెలంచెలుగా తెచ్చింది ఇక్కడ పడిగాపులు పడ్డానికి కాదు" ప్రభుత్వోద్యోగినన్న గర్వం, తిరస్కారభావం దేశపు గవర్నరు జనరల్ కన్నా ఎక్కువగా ఉన్నాయి తపాలారన్నరు గొంతులో.

చెన్నపట్నం అనగానే లచ్చమ్మ ఎగిరి గంతేసి ఉత్తరాన్ని అందుకుంది. తన మొగుడే రాయించి ఉంటాడు. ఆమె ముఖంలో ఆనందం వెల్లివెరిసింది. ఇది వరకెప్పుడూ లేంది ఉత్తరం రాయించి పంపాడేమిటి? తన సంగతి తెలిసి ఉంటుందా? ఎలా తెలుస్తుంది?

పుల్లమ్మ ఇంటికి తపాలారన్నరుకి దారి చూపించిన కుర్రవాడు "పుల్లమ్మ మామ్మకు ఉత్తరమొచ్చిందోయి" అంటూ ఊరంతా పరుగులు పెట్టాడు. "ఏమిటీ ఉత్తరమా? పుల్లమ్మకా? " అంటూ అందరూ పోగయ్యారు. ఆ ఊళ్లో అంతకుముందు కోర్టు నోటీసులు ఎవర్కైనా వచ్చాయేమోకానీ, ఉత్తరాలు రాలేదు. అక్షరజ్ఞానమే లేనివారికి రాసేదెవరు?

"ఏమే లచ్చీ ఉత్తరమొచ్చిందా? ఎవరు రాశారేమిటి" అంటూ వీరమ్మ అడిగింది.

"ఏమో తెలియదు" అంది లచ్చమ్మ.

"ఏది ఓసారి చూడనియ్యి" గౌరమ్మ ఉత్తరం తీసుకోబోయింది.

"అమ్మో! ఈ ఉత్తరం నాదికాదు. నా తోటికోడలిదట. ఎవరూ ముట్టుకోవద్దు. చిరిగిపోతుందేమో"

"పోనీ నువ్వే చూపించు"

లచ్చమ్మ నెమ్మదిగా కాగితం ఎత్తి పట్టుకుంది. పండితుల దగ్గర తాటాకు పుస్తకాలనే ఆ ఊరి జనం అప్పుడప్పుడు దూరం నుంచి చూసేవారు. కోర్టు నోటీసులను చూడ్డం అరుదే. లచ్చమ్మ చేతిలోని కాగితం వారికి ఆశ్చర్యంగా కన్పించింది. దాని మీద నల్లసిరా అక్షరాలు వింతగా అన్పించాయి.

ఇంతలో పుల్లమ్మ తిరిగొచ్చింది. గుడిసె ముందు గుంపు ఏమిటా అనుకుంటూ వచ్చిన ఆమెకు లచ్చమ్మ ఉత్తరాన్నిచ్చింది.

"మా నాగన్నే రాయించి పంపి ఉంటాడు" అంది పుల్లమ్మ సంబరంగా. తన భర్త పంపించాడనుకుంటున్న లచ్చమ్మలో నిరాశ! పోనీలే క్షేమవార్త తెలుస్తుందిగా అని సరిపెట్టుకుంది.

ఉత్తరంలో ఏముందో ఎలా తెలుస్తుంది? ఊరిపెద్ద వద్దకు ఉత్తరంతో పుల్లమ్మ, ఆమె వెనకే జనమూ వెళ్లారు.

ఉత్తరాన్ని చూసిన ఊరి పెద్ద "నాకు మాత్రం చదవడం వచ్చేమిటి? " రేపు నాగలాపల్లె కరణం దగ్గరకు పట్టికెళ్లు. ఆయన చదివి విన్పిస్తాడు" అన్నాడు.

పుల్లమ్మ సరేనని చెప్పి ఇంటికి వచ్చింది. తోటి కోడళ్లిద్దరూ జొన్న సంకటిని ఉల్లిపాయతో తిన్నారు.

"లచ్చీ రేపు పొద్దు పొడవగానే నాగలాపల్లె వెడతా. నువ్వు ఉదయమే నిద్రలేవకు. దంపుళ్ల దగ్గర మామిడి తొక్కు ఇచ్చింది ఇల్లాలు. అన్నం కూడా ఇచ్చింది. తినేసి పడుకో. అటూ ఇటూ తిరగకు"

"అక్కా నేనూ నీతో వస్తా. ఉత్తరంలో ఏముందో నేనూ వింటా"

"ఏడో నెల వచ్చింది. ఇంకా తిరుగుళ్లేంటి? ఇంట్లో ఉండు"

"నన్ను ఏ పనీ ఎలాగూ చెయ్యనివ్వడం లేదు. నాగలాపల్లె దగ్గరే కదా. ఉత్తరంలో ఏముందోనని కంగారు పడుతూ ఇంట్లో కూచుంటే ఏం సుఖం? "

"కంగారెందుకే పిచ్చిదానా. చెన్నపట్నం వెళ్లగానే తపాలా పంపుతానని మరిది అన్నాడుగా"

"అందుకే రావాలని ఉంది"

పుల్లమ్మ సన్నగా నవ్వి, లచ్చమ్మ బుగ్గపై మీటి "సరే వద్దువు గానిలే" అంది.

మర్నాడు ఉదయం పుల్లమ్మా, లచ్చమ్మా నాగలాపల్లె బయల్దేరే సమయానికి ఊరి జనం పాతిక మంది దాకా వారితో వెళ్లడానికి పోగయ్యారు. మీరెక్కడకని అడిగిన పుల్లమ్మతో "ఎప్పుడైనా మనూరికి ఉత్తరం వచ్చిందేమిటి? కరణంగారు చదువుతుంటే మేమూ వింటాం" అన్నారు.

పుల్లమ్మ గర్వంతో పొంగిపోయింది. అందరూ నాగలాపల్లె నడుచుకుంటూ వెళ్లే సరికి జాము పొద్దెక్కింది. ఇంత మందిని చూసిన నౌకరు లోపలకు పరిగెత్తుకుని వెళ్లి కరణంగారికి విషయం చెప్పాడు. అప్పుడే పూజ పూర్తి చేసుకున్న కరణం గుమ్మంలోకి వచ్చి "ఏమిట్రా కట్టకట్టుకుని వచ్చారు? కలక్టరుగారికి ఏమైనా వినతి పత్రం పంపాలా? " అన్నాడు.

"లేదండయ్యా! మా వాడు చెన్నపట్నం నుంచి ఉత్తరం పంపాడయ్యా! చదివి విని పిస్తారని వచ్చామయ్యా" అంది పుల్లమ్మ.

"నీ కొడుకు చెన్నపట్నంలో ఉన్నాడా? ఏదీ ఉత్తరమక్కడ పెట్టు" అంటూ కరణం వచ్చి వీధి అరుగుమీద కూచున్నాడు.

పుల్లమ్మ ఉత్తరాన్ని అరుగుమీద పెట్టింది. కరణం ఉత్తరాన్ని తీసుకుని పై నుంచి కిందదాకా చూసి "సరే అందరూ కూచోండి, చదువుతా" అన్నాడు.

అందరూ వీధిలో నేల మీద కూచున్నారు. ఎత్తు అరుగు మీద కూచున్న కరణం గొంతు సవరించుకుని "గంగా భాగీరథీ సమానురాలైన మాతృచరణారవిందములకు నమస్కరించి.." అని చదవటం మొదలెట్టాడు.

"నీలా భర్తపోయిన ఆడాళ్లకు గంగా భాగీరథీ సమానురాలు అని రాస్తారు. భర్త ఉంటే మహాలక్ష్మి సమానురాలు అని రాస్తారు. నీ కాళ్లకు దండంపెట్టి.. అని అర్థం"

"అమ్మ నాయనోయ్.. మా నాగన్న చెన్నపట్నం వెళ్లి ఎన్ని నేర్చేసుకున్నాడో" అంది పుల్లమ్మ సంబరంగా.

కరణానికి తిక్కరేగింది. 'చేపలు పట్టే వాడింట్లో పుట్టినోడికి చదువు రావడమా? అనుకుని "అవేం నీ కొడుకు తెలివితేటలు కావు. విషయం చెప్తే ఉత్తరాలు రాసి

## బట్టలకి విందు



ఈశ్వరచంద్ర విద్యాసాగర్ బ్రిటిష్‌వారి విందుకు క్లబ్‌కు వెళ్లారు. నూలు ధోతి, కుర్తా ధరించిన ఆయన్ని గేటుకీపర్ అడ్డుకున్నాడు. క్లబ్ నిబంధనల ప్రకారం సూట్ వేసుకున్నవారినే లోపలికి అనుమతిస్తామని చెప్పాడు.

దాంతో విద్యాసాగర్ సూటు బూటు వేసుకుని క్లబ్ లోపలికి ప్రవేశించారు. విందులో తనకు వడ్డించిన పదార్థాలను తన దుస్తులకు తినిపించేందుకు ప్రయత్నించారు. ఈ తతంగాన్ని చూసిన ఇంగ్లిష్ మిత్రులు ఆశ్చర్యపోతూ ఎందుకలా చేస్తున్నావని అడిగారు. 'జ్ఞానానికి కాకుండా, ఆహార్యానికే మీరు ప్రాముఖ్యమిస్తారు కదా? నాకంటే నా డ్రెస్సే మీరు గౌరవించారు. ఈ విందు వాటికి దక్కడమే సముచితం' అన్నారు.

ఈ జవాబుకు, విద్యాసాగర్ వ్యక్తిత్వానికి, ఇతరులకు కనువిప్పు కలిగించే విధానానికి అందరూ సంబరపడిపోయారు.

పెట్టేవాళ్ళు చెన్నపట్నంలో ఉంటారు. మా అమ్మకు జాబు రాయమంటే వాళ్ళే చక్కగా ఇలాంటివన్నీ రాస్తారు"

"తప్పయిందండయ్యా! చదివి పెట్టండయ్యా" అంది పుల్లమ్మ.

"ఊ సరే. ఇక మాట్లాడకుండా విను" అంటూ కరణం చదవసాగాడు. "చెన్నపట్నం క్షేమంగా చేరినాను. నేనూ, చిన్నాన్నా కలిసి మా యజమాని పాకలో బసచేసియున్నాం. అయ్యగారు నాకు పల్లకీ మోసే బోయీగా కొలువు ఇచ్చినారు. చెన్నపట్నం పెద్ద బస్తీ. అమ్మగారిని దేవాలయాలకు తీసికొనుపోవు పనిని నాకప్పగించినారు. అయ్యగారి ఇల్లు తండియార్పేటలో యున్నది. మైలాపురి, తిరువళ్ళిక్కేణి దేవాలయాలకు అమ్మగారిని తీసుకునిపోవుచున్నాను. ఇంతవరకు ముప్పది అయిదు రూపాయలు జీతంగా ముట్టింది. చిన్నాన్న చెప్పిన ప్రకారం అయ్యగారి వద్దనే దాచుకొన్నాను. చిన్నాన్న క్షేమం. నీకు నమస్కారాలు తెలియచెప్పమన్నాడు. లచ్చమ్మ పిన్ని క్షేమమని తలచెదను. నీ కుమారుడు నాగన్న"

పుల్లమ్మ ముఖం వెలిగిపోయింది. పుత్రోత్సాహమన్న పదానికి ప్రతీకలా ఆమె కనబడింది.

"అయ్యా ఇంకొక్కసారి చదవండయ్యా"

కరణం మళ్ళీ చదివి విన్పించాడు. పుల్లమ్మతో వచ్చినవారంతా తమకే ఉత్తరం వచ్చినంత సంతోషంతో విన్నారు.

"ఎండనపడి వెనక్కిపోవాలి. అమ్మగారు మజ్జిగపోస్తారు. అలా దొడ్డిగుమ్మంవైపు వెళ్ళండి. మజ్జిగ తాగి పొండి" అన్నాడు కరణం.

అందరూ దొడ్డిగుమ్మంవైపు వెళ్ళారు. పుల్లమ్మ లేచి లచ్చమ్మకు చెయ్యి ఆసరా ఇచ్చింది. లచ్చమ్మ లేచాక "అయ్యగారూ! నేను మా నాగన్నకి ఉత్తరం రాయాలనుకుంటే ఎలాగండి?" అని అడిగింది.

"నువ్వా? నువ్వెలా రాస్తావు?"

"అదేనండి, రాయించి పంపాలంటే ఎలాగండీ? కాకినాడ వెళ్ళాలాండి?"

"కాకినాడ దాకా ఎందుకు? నేను రాసిపెడతానులే. పేదదానివి. నీ దగ్గర నేనేమీ తీసుకోను. కాగితానికీ, సిరాకీ రెండు అణాలు ఇస్తే చాలు"

రెండణాలా? అంత డబ్బు తనదగ్గరెక్కడుంది? పుల్లమ్మ ఆలోచనలో పడింది.

"డబ్బు లేదని సందేహించకు. అమ్మగారినడిగి ఈ ఏడాదికి మొత్తం కట్టెలెన్ని కావాలో తెల్సుకో. అడవిలో కొట్టిన కట్టెలన్నీ కాకినాడ అమ్మకానికి పట్టుకుపోక

మాదొడ్లో పడెయ్యి"

"అలాగేనండయ్యా!"

"అక్కా, రెండణాలు పెట్టి రాయించడమెందుకు? నువ్వొక్కర్తివీ రెక్కలు ముక్కలు చేసుకుని కట్టెలు కొట్టాలి. నన్ను పనిలోకి రానియ్యవాయె. మీ మరిది నుంచి వార్త లేకుండా రెండేళ్ళు మనం గడపలేదా? " అంది లచ్చమ్మ నెమ్మదిగా.

"అందుకేగా ఉత్తరం రాయిస్తుంది. కొడుకు త్వరలో పుడతాడని తెలిస్తే మరిది పరిగెత్తుకు వచ్చెయ్యడా" అంది పుల్లమ్మ.

కరణం ఉత్తరం రాసి పెట్టాడు. అక్షరజ్ఞానం లేకున్నా పుల్లమ్మ ఉత్తరంకేసి తాదాత్మ్యంగా చూసింది. కాగితాన్ని చూస్తూ కొడుకుతో మాట్లాడిన అనుభూతి పొందిందామె.

"ఉత్తరం పంపడమెలాగండీ? తపాలా రన్నరుకివ్వాలాండీ? పంపించడానికి ఎంత డబ్బివ్వాలండీ? " చేతిమురుగులు అమ్మి అయినా పంపాలన్న కృతనిశ్చయంతో అడిగింది పుల్లమ్మ.

"నువ్వు డబ్బు ఏమీ ఇవ్వక్కరలేదు. అక్కడ నీ కొడుకే ఇస్తాడు"

"నిన్న ఈ ఉత్తరానికి ఇక్కడ మేమేం ఇవ్వలేదండి" అంది లచ్చమ్మ.

"మీ దగ్గర ఉండదని తెలిసే అక్కడ ఇచ్చేసి ఉంటారు. మామూలుగా ఉత్తరం అందుకున్న వాళ్ళే డబ్బిస్తారు. నాకు కాకినాడలో పని ఉంది. ఈ ఉత్తరాన్ని నేనే తపాలా ఆఫీసులో ఇస్తానులే. నీ కొడుకున్న ఇంటి వివరాలు ఈ ఉత్తరంలో ఉన్నాయి. కంగారుపడద్దు"

పుల్లమ్మా, లచ్చమ్మా కరణం దగ్గర శలవు తీసుకుని, నాగన్న రాసిన ఉత్తరం చేత్తో పట్టుకుని, అమ్మగారిచ్చిన మజ్జిగ తాగి, ఇంటిదారి పట్టారు.

ఆ రాత్రి పుల్లమ్మ కొడుకు రాసిన ఉత్తరాన్ని గుండెమీద పెట్టుకుని పడుకుంది.

"ఏమిటక్కా, రాత్రి కూడా ఉత్తరాన్ని వదలవా? "

"ఏమిటోనే లచ్చీ, ఉత్తరాన్ని పట్టుకుంటే నాగన్నే వచ్చి మాట్లాడుతున్నట్లుందీ"

లచ్చమ్మ కడుపులో బిడ్డ కదిలింది. ఆమె ముఖంలో చిరునవ్వు వెలిగింది.

"అక్కా, చెప్పడం మర్చిపోయాను. నిన్న అమ్మవచ్చి పురుటికి పిల్చుకు పోతానంది. నేను నిన్ను వదిలి రాలేనన్నాను. నిన్ను ఒక్కర్తినీ వదిలి వెళ్ళనూలేను, అలాగని పురిటి బాధ్యత నీమీద పెట్టనూలేను. ఏంచెయ్యాలో తెలియడంలేదు"

"తొలి కాన్పు పుట్టింట్లో అయితేనే మంచిది. అయినా ఎంత దూరమని, పక్క వీధే కదా? "

"ఒక్కర్తివీ ఉండగలవా? "

"బెంగపెట్టుకోకు. ఇదిగో నాబాబు, నా బంగారుకొండ రాయించిన ఉత్తరముంది కదా! ఈ జాబు ఉంటే వాడున్నట్లే"

లచ్చమ్మకి ఆ మాటలు ధైర్యాన్నిచ్చాయి. ఆమె ప్రశాంతంగా నిద్రపోయింది.

పుల్లమ్మకి నిద్రపట్టలేదు. కాగితమ్ముక్క కొడుకుతో సమానమా? ఉత్తరం పక్కనుంటే కొడుకు పక్కనున్నట్లేనా?




"ఉత్తరాలు ఎన్ని వచ్చినా కొడుకులు వచ్చినట్లా? " అనుకుంది లేడీనికోలాయ్. ఆమె పెద్దకొడుకు తాను నేర్చుకున్న విద్యల గురించీ, వాటిలో తాను రాణిస్తున్న విధానం గురించీ పెద్ద లేఖ

రాశాడు. ఆమె తల్లి చిన్నవాడి ముచ్చట్లు రాస్తూ, పసివాడి చేత సంతకం పెట్టించింది. 'యువర్ లవింగ్ సన్' అన్నమాటలు వచ్చీరాని అక్షరాలలో చూసి లేడీ నికోలాయ్ మురిసిపోయింది. అంతలోనే ఆమె కళ్ళలో నీళ్ళు నిల్చాయి. ఉత్తరాలు వస్తే కొడుకులు వచ్చినట్లా? వాళ్ళని చూడాలి కానీ వాళ్ళు రాసిన అక్షరాలు చూసి సంతృప్తి చెందడమా?

"ఉత్తరాలు చదువుకుంటూ తృప్తి చెందాల్సిన అవసరం లేదు. త్వరలో ఇంగ్లండ్ వెళ్ళబోతున్నాం" అన్న సర్ నికోలాయ్ మాటలకు లేడీ నికోలాయ్ తలెత్తి చూసింది. ఆమె ముఖంలో భర్త మాటలకు ఆనందమూ, సరిగ్గా విన్నానా? అన్న అనుమానమూ ఒకేసారి కన్పించాయి.

"సర్ జాన్ జెరెమీ ప్రయాణం చేస్తున్న నౌక రెండు మూడు రోజులలో ఇక్కడకు వస్తుంది. ఆయనతో మనం కూడా లండన్ వెడుతున్నాం. నాకక్కడ నాలుగు నెలలపాటు పని ఉండవచ్చు"

"ఇక్కడ చెరకుతోట యజమానులు ఎంతగా ప్రతిఘటించినా సర్ జెరమీ తన ప్రయత్నం ఎందుకు మానడం లేదో? "

"శిలువ మీద ఎక్కించినా జీసస్‌క్రీస్తు తన నమ్మకాన్ని వదులుకున్నాడా? విశ్వ మానవ కల్యాణానికై పాటుపడేవారు ఎన్నటికీ తమ ప్రయత్నాన్ని వదిలిపెట్టరు. ప్రజాస్వామ్యానికి పుట్టిల్లయిన ఇంగ్లండు పౌరులం. అందరికీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఉండాలని కోరుకోవాలి తప్ప స్వార్థంతో ప్రవర్తించకూడదు"

"సర్ జెరెమీని ఇంతకు ముందు ఇక్కడ అడుగుకూడా పెట్టనివ్వ లేదుకదా? "

"అవును. ఆయన నౌక లంగరు వెయ్యగానే ఇక్కడున్న ఫ్రెంచి వారంతా ఎదురు తిరిగారు. పేరుకి తోట యజమానులే కానీ అందరికీ సొంత సైన్యాలున్నాయి. నౌక నుంచి రహస్యంగా ఆయనను దింపారు. దాంతో భూస్వాములు తిరుగుబాటు చేశారు. చివరకు ఆయన వెనుతిరిగిపోవలసి వచ్చింది. ఈ విషయాన్ని ప్రతిష్ఠాత్మకంగా తీసుకున్న బ్రిటీషు ప్రభుత్వం ఆయనను మళ్ళీ పంపింది. ఇక్కడ న్యాయమూర్తులు ఆయనను ఉద్యోగంలో ప్రవేశించనివ్వలేదు. అప్పటి మారిషస్ గవర్నర్ సర్ చార్లెస్ కూడా తోట యజమానులతో కుమ్మక్కయ్యాడనే అంటారు"

"ప్రభుత్వం అందుకేగా మిమ్మల్ని నియమించింది" లేడీ నికోలాయ్ కంఠంలో కించిత్తు గర్వం.

"కావొచ్చు. తోటయజమానులు తిరగబడినా.. వారి తిరుగుబాటుని అణచి వెయ్యడానికి కోట నిర్మాణం కూడా ప్రారంభించాను. 'ఫోర్ట్ అడిలెయిడ్' అనాలని నా ఊహ. ఫ్రెంచి ప్రభావమింకా పోనందువల్లనేమో 'లాసిటడెల్' అంటున్నారు"

"సర్‌జెరెమీ ఏం చేస్తానంటున్నారు? "

"ఇక్కడ కోర్టులో వాదించి బానిసత్వం సంపూర్ణంగా నిర్మూలన చెయ్యాలన్నది ఆయన కోరిక. లేడీ జెరెమీ కూడా వస్తున్నారు. ఆతిథ్యం విషయంలో జాగ్రత్త వహించాల్సి ఉంటుంది"

"వాదనలు వినడానికి నేను రావచ్చా? "

"కోర్టులో విజిటర్స్ గ్యాలరీలో నీకూ, లేడీ జెరెమీకి ప్రత్యేక ఏర్పాట్లు చేస్తా. స్త్రీలు వాదనలు విన్పించకూడదు కానీ వినడానికేమీ అభ్యంతరంలేదు"

★ ★ ★

పోర్ట్ లూయిలో కోర్టు ప్రాంగణం కిటకిటలాడుతోంది. చిన్న ద్వీపమైన ఆ దేశంలోని భూస్వాములందరూ తరలి వచ్చారు. వారి న్యాయవాదులు సిద్ధంగా ఉన్నారు. సర్ జాన్ జెరెమీ తాను చెప్పదల్చుకున్న విషయాన్ని స్థిరంగా, స్పష్టంగా చెప్పడానికి తయారుగా ఉన్నాడు.

విజిటర్స్ గాలరీలో లేడీ నికోలాయ్, లేడీ జెరెమీలతో పాటు ఫ్రెంచి భూస్వా

ముల భార్యలు చాలామంది ఉన్నారు. లోపల జరుగుతున్న వాద ప్రతివాదాలు తమగురించేనని తెలియని ఆఫ్రికన్ బాని సలు కోర్టుబయట నిలబడి ఉన్నారు. ఏక్ష ణాన్నైనా యజమానికి యజమానురాలికి సేవలందించడానికి సిద్ధంగా ఉండాలని మాత్రమే వారికి తెలుసు.

న్యాయమూర్తులు అనుజ్ఞనిచ్చాక సర్ జాన్ జెరెమీ వాదనను ప్రారంభించాడు.

"యువరానర్! మనదేశమైన ఇంగ్లండు ప్రజాస్వామ్యానికి పుట్టినిల్లు. ప్రతిపౌరుడికీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలుండాలన్నది మన మహారాజు నాలుగో విలియం విశ్వాసం. అందుకే బానిసల వ్యాపారాన్ని ఏనాడో నిరోధించారు. ఇక్కడ తోట యజమానుల వద్ద ఉన్న బానిసలందరికీ స్వేచ్ఛాస్వాతం త్ర్యాలు ప్రసాదించాలని నా మనవి"

భూస్వాముల న్యాయవాది "ఫ్రాన్స్, ఇంగ్లండ్‌ల మధ్య జరిగిన యుద్ధంలో ఫ్రాన్స్‌ది కిందిచేయి అయింది. ఆ సమ యంలో అనేక ఒడంబడికలు జరిగాయి. అమెరికా ఖండంలోని క్యూబెక్‌పై ఏనాటికీ హక్కు కోరమని ఫ్రెంచివారన్నారు. ఇండి యాలోని పాండిచ్చేరిని కన్నెత్తి చూడ బోమని ఇంగ్లీషువారు చెప్పారు. మారిషస్‌ని ఇంగ్లీషువారి హస్తగతం చేస్తా మనీ, అయి తే ఇక్కడి పరిస్థితులు యథా తథంగా ఉంచాలనీ ఫ్రెంచి ప్రభుత్వం చెప్పింది, ఇంగ్లీషు ప్రభుత్వం అంగీకరిం చింది" అని బల్లగుద్ది చెప్పాడు.

సర్ జెరెమీ శాంతంగానే "పరిస్థితులు యథాతథంగా ఉంచగలమని చెప్పిన మాట వాస్తవమే. కానీ ఒడంబడిక నాటికే బానిసల వ్యాపారం నిషేధింపబడింది. అందుకే పరిస్థితుల మార్పు జరగలేదని కోర్టువారికి మనవి" అన్నాడు.

న్యాయశాస్త్రంలోని సూక్ష్మవిషయాలను వివరిస్తూ అలా జరిగిన వాదోపవాదాలు

## కిడ్నీ సంగతులు

చతుర సమాచారం

గుండె, ఊపిరితిత్తులు, కాలేయం తర్వాత మనిషి మనుగడకి అవసరమైన ప్రధాన అవ యవం మూత్రపిండాలు. ప్రతీ మనిషికి రెండు కిడ్నీలు ఉంటాయి. అరుదుగా కొందరు ఒక కిడ్నీతో పుడతారు. కిడ్నీల గురిం చిన కొన్ని విషయాలివిగో..

★ అమెరికాలో ఏటా కిడ్నీ జబ్బులతో 82,000 మంది మర ణిస్తున్నారు.

★ 47000మంది డయాల సిస్ మీద జీవిస్తున్నారు.

★ 1,20,000 మంది కిడ్నీ దాతల కోసం వేచి చూస్తు న్నారు.

★ కొత్త కిడ్నీతో 40 ఏళ్ల జీవించవచ్చు

★ కిడ్నీ ఇచ్చినవారు మరణించే శాతం చాలా స్వల్పం. 0.3 శాతం అంటే 3000 మందిలో ఒకరు



★ కిడ్నీలోంచి 24 గంటల్లో 200 క్వార్ట్‌ల రక్తం వడగట్టబడుతుంది

★ కిడ్నీ డయాలసిస్ చేయించుకునే వారిలో 23 శాతం మంది మొదటి సంవత్సరంలోనే మరణి స్తున్నారు.

★ మూడేళ్ళపాటు డయాలసిస్‌తో జీవించిన వారిలోని 60శాతం మంది 67 సంవత్సరాల్లో మరణి స్తారు.

★ ఓ కిడ్నీ బరువు ఆరు ఔన్సులు. అది ఐదు అంగుళాల పొడవుం టుంది.

★ 2-3 గంటల్లో పూర్తయ్యే లేప్రోస్కోపిక్, ట్రాన్స్‌ప్లాంటేషన్ పద్ధతి ఇటీవలే కనుగొన్నారు.

లేడీ నికోలాయ్‌కి అర్థం కాలేదు. న్యాయమూర్తులనూ, కోర్టు ప్రాంగణంలోని ఇతరులనూ, ఎండెక్కి శరీరాలను మండిస్తున్నా కదలకుండా కోర్టు బయట నిల్చున్న బానిసలనూ చూస్తూ కూచుందామె.

ఇద్దరి వాదనలనూ వింటూన్న న్యాయమూర్తులు మధ్యాహ్నమయ్యే సరికి లంచ్ విరామం ప్రకటించారు.

★ ★ ★

జెరెమీ దంపతులూ, నికోలాయ్ దంపతులూ భోజనానికి కూర్చున్నారు. భోజనం చేస్తుండగా విలియం నికోలాయ్ "సర్ జెరెమీ, మీకన్నా వయస్సులోనూ, అనుభవంలోనూ చిన్నవాడిని. మీకున్నంత విజ్ఞానం కూడాలేదు. మీరేమీ అనుకోనంటే చిన్నమనవి" అన్నాడు.

ఏమిటన్నట్లుగా చూశాడు జాన్‌జెరెమీ.

"బానిసత్వ నిర్మూలన విషయంలో మీ పట్టుదల నాకు తెలియందికాదు. మీకున్న ప్రగాఢమైన విశ్వాసం ఈ విషయంలో న్యాయమూర్తులకు లేకపోవచ్చు. మీరు సంయమనం కోల్పోరాదని నా మనవి"

సర్ జెరెమీ చిరునవ్వు నవ్వాడు.

లేడీ జెరెమీ సీరియస్‌గా "ఓడలో మారిషస్‌కి వస్తున్నంతసేపూ ఈ విషయం గురించి చెప్తూనే ఉన్నాను. బానిసత్వ నిర్మూలన విషయంలో మారిషస్‌కి రావడం ఇది మొదటిసారికాదు. ఇదివరలో వచ్చినప్పుడు న్యాయమూర్తులను పక్షపాత దృష్టితో వ్యవహరిస్తున్నారనీ, నల్లజాతివారిని హీనంగా చూస్తున్నారనీ, భూస్వాములతో కుమ్మక్కయ్యారనీ మీరు నిందించారు. కార్యసాధకత్వమంటే మీకు తెలియదు. పని నడిపించుకోవాలంటే పేచీ కోరుతనం పనికిరాదు" అంది.

"కార్యసాధకత్వమంటే తెలియకుండానే రవి అస్తమించని బ్రిటిష సామ్రాజ్యంలోని దేశాలలో 'బానిస' అన్నమాట లేకుండా

## చతుర ప్రవేశిక

### ఫిబ్రవరి చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

| | |
|---|---|
| 1. నాగన్న తల్లి? | 6. విలియం నికోలాయ్ ఎవరు? |
| జ. | జ. |
| 2. లచ్చమ్మ భర్త? | 7. పుల్లమ్మకు ఉత్తరం చదివి వినిపించింది? |
| జ. | జ. |
| 3. నాగన్న ఏ దేశం వెళ్లాడు? | 8. చెరకుతోటలు ఎవరి అధీనంలో ఉన్నాయి? |
| జ. | జ. |
| 4. పూర్వీకుల ఆచూకీ కోసం వచ్చింది? | 9. లచ్చమ్మ కొడుకు? |
| జ. | జ. |
| 5. నాగన్న భార్య? | 10. 'ఏటి ఒడ్డున నీటి పూలు' రచయిత్రి? |
| జ. | జ. |

పంపినవారి పేరు: ---------------------------------------- వయసు (   )

చిరునామా: ----------------------------------------

-------------------------- పిన్‌కోడ్ :                ఫోన్ నెం :

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 04023318181, Ex: 6658, 6532

గడువు తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

చెయ్యగలిగానా? " అన్నాడు సర్‌జెరెమీ.

"మొదటి నుంచీ బ్రిటన్ అధీనంలో ఉన్న దేశాలూ, బ్రిటన్ సంపూర్ణంగా ఆక్ర మించుకున్న దేశాలూ వేరు, మారిషస్ వేరు. ఇక్కడ పరిస్థితులకూ, బ్రిటిషు సామ్రాజ్యంలోని ఇతర దేశాల పరిస్థితు లకూ పోలికలేదు. అక్కడ తోటయజమా నులు బ్రిటిషువారు. ఇక్కడున్నది ఫ్రెంచి వారు" అన్నాడు సర్ నికోలాయ్.

"ఈవేళ సంయమనం కోల్పోకుండా శాంతంగా నా వాదనలను విన్పిస్తానని మాట ఇస్తున్నాను" అన్నాడు సర్‌జెరెమీ.

భోజనానంతరం కొంతసేపు విశ్రమిం చిన తరువాత సర్‌జెరెమీ, సర్‌నికోలాయ్ కోర్టుకు వెడుతుండగా "సర్ జెరెమీ! మీకు చెప్పదగిన వాడిని కానని ఇదివరకే మనవి చేశాను. ఫ్రాన్సుకీ, మనదేశానికీ మధ్య నున్న విరోధం మీకు తెలియందికాదు. స్వేచ్ఛా స్వాతంత్ర్య విషయాలలో కూడా మనదేశాల మధ్య అగాధముంది. ఫ్రెంచి విప్లవం జరిగినప్పుడు పరిస్థితిలో మార్పు వస్తుందని ఆశించాం. విప్లవానంతరం ఫ్రెంచివారు బానిసత్వాన్ని రద్దు చేశారు. కానీ నెపోలియన్ అధికారాన్ని చేజిక్కించు కున్నాక విముక్తిపొందిన వారందరినీ బాని సలుగా ప్రకటించాడు. మారిషస్ బ్రిటన్ వశమైనప్పటికీ మార్పు తీసుకురావడం కష్టంగానే ఉంది. సాధ్యమైనంత సామమా ర్గంలోనే వెళ్ళాలన్నది నాకోరిక. తప్పనిస రైతే నేను యుద్ధానికీ సిద్ధమే. కానీ నేను శాంతికాముకుణ్ణి" అన్నాడు సర్‌నికోలాయ్.

"భయపడకండి. నేను కూడా వాతావ రణం వేడెక్కకుండానే వాదనలు వినిపి స్తాను. ఇదివరకటి గవర్నర్‌లా కాకుండా మీరు నా ఆశయాన్ని గౌరవించడం నా అదృష్టం. మనమిద్దరం కలిసి బ్రిటీషు సామ్రాజ్య సిద్ధాంతాలను పరిరక్షిద్దాం" అన్నాడు సర్ జెరెమీ.

కోర్టులో న్యాయమూర్తులు ఆసీనుల య్యాక వాదనలు ప్రారంభమయ్యాయి.

సర్ జెరెమీ "న్యాయశాస్త్రంలోని సూక్ష్మ విషయాలను ఎవరికి నచ్చినట్లుగా వారు సమర్థించుకోవచ్చు. కానీ, యువరానర్! మానవత్వం దృష్ట్యా కూడా సమస్యను పరిశీలించాలని కోరుతున్నాను. మనతోటి మనిషిని కాళ్లకు, చేతులకు ఇనపగొలుసు లు వేసి పశువులను కట్టేసినట్లుగా కట్టె య్యడం మనుషులు చేసే పనేనా? వారిని కొరడాలతో బాదడం మన మతం అంగీక రిస్తుందా? " అని గట్టిగా అన్నాడు.

భూస్వాముల తరపు న్యాయవాది "తోటి మనిషి, సాటిమనిషి అని సర్‌జెరెమీ గారంటున్నారు. ఇక్కడ ఉన్న బానిసలెవ రికీ స్వేచ్ఛ అంటే తెలియదు. జీతానికి పనిచెయ్యడం వారెరుగని మాట. ఆఫ్రికా ఖండంలోనూ వారు బానిసలే. ఆఫ్రికా రాజుల వద్దకన్నా ఇక్కడే వారి జీవితం బాగుంది" అని చెప్పాడు.

"అక్కడ వారు స్వతంత్రులుగా జీవిం చారా లేదా అన్నది ప్రస్తుత చర్చలో భాగం కాదు. మనవద్ద వారు బానిసలుగా జీవించడం న్యాయమా? అన్యాయమా? అన్న విషయానికే వాదన పరిమితం కావాలి. బ్రిటన్‌లో బానిసత్వం లేదు. బ్రిటీషు సామ్రాజ్యంలో ఎక్కడా బాని సత్వం ఉండరాదనే మహారాజు విలియమ్ నిర్ణయించారు. ప్రభుత్వం తరపున వారి అభిప్రాయాలు తెలియచెయ్యడానికే నేను వచ్చాను" అన్నాడు సర్ జెరెమీ.

"దెయ్యాలు వేదాలు వల్లించడం అంటే ఇదే. బ్రిటన్‌లో బానిసత్వం లేదు. కానీ బ్రిటీషు వ్యాపారులు తమ ఉత్పత్తులను ఆఫ్రికాలో బానిసలకు మారకంగా అమ్మ డం, ఆ బానిసలను తీసుకువెళ్లి అమెరికా లో పంచదారకు మారకంగా అమ్మడం, పంచదారను తమ దేశానికి తీసికెళ్లి లాభా లు గడించడం నిజం కాదా? "

"ఒకప్పుడు బానిసల వ్యాపారం వాస్త

వమే. కానీ ఇప్పుడది చట్టవిరుద్ధం"

"సంపూర్ణంగా ఆపగలిగారా?" ఎదురు తిరిగినట్లుగా ప్రశ్నించాడు భూస్వాముల న్యాయవాది.

"వ్యాపారం ఆపే ప్రయత్నం ఆగలేదన డానికి ఆఫ్రికా తీరం వెంబడి అనునిత్యం గస్తీ తిరిగే బ్రిటీషు నేవీయే సాక్షి. ఇక్కడ బానిసత్వ నిర్మూలన ప్రయత్నం ఆగలేదన డానికి నేనే సాక్షి" అన్నాడు సర్ జెరెమీ.

కోర్టు ఆనాటికి వాయిదా పడింది.

★ ★ ★

ఆదివారం ఉదయమే చర్చికి వెళ్లి ప్రార్థన చేసుకున్న తర్వాత లేడీ నికోలాయ్ "నేను చెరకు తోటల వైపు వెళ్లి చూస్తాను. మీరు విశ్రాంతి తీసుకోండి. మీ గదిలో రెండు నవలలు పెట్టించాను. ఇష్టమైతే చదువుకోవచ్చు" అంది లేడీ జెరెమీతో.

"నేను కూడా మీతో వస్తాను. ఇక్కడకు వచ్చాక గుర్రపు స్వారీ చెయ్యనే లేదు" అంది లేడీ జెరెమీ.

ఇద్దరూ గుర్రాల మీద బయలుదేరారు. ఒక ఫుట్‌మాన్, ఒక మెయిడ్ వారిని అనుసరించారు.

తోట దగ్గర గుర్రాలు దిగగానే ఇద్దరికీ పనివాడు రెండు కుర్చీలు వేసి గొడుగులు పట్టుకు నిల్చున్నాడు. దూరాన తోటలో ఆఫ్రికన్ బానిసలు పనిచేస్తున్నారు. కొంత సేపయ్యాక ఒక మహిళ బిడ్డకు పాలివ్వ డానికి వచ్చి, అక్కడ నేలమీద మట్టిలోనే కూచుని, పసివాణ్ని ఒళ్లోకి తీసుకుంది.

"గొడుగులున్నా, కుర్చీలో కూచున్నా ఎండకు తాళలేకుండా ఉన్నాం. మండుటెం డలో పనిచేస్తున్నారు. పెన్నీ జీతమైనా లేదు పాపం. అందుకే కాబోలు జాన్‌కి బానిసత్వ నిర్మూలనపై అంత పట్టుదల" అంది లేడీ జాన్ జెరెమీ.

"విలియం కూడా ఎప్పుడూ ఈ విషయం గురించే ఆలోచిస్తూ ఉంటాడు. బానిసలు బానిసలుగానే మిగిలిపోవాలని నేను అనుకోవడం లేదు. కానీ వారి మన స్సులో ఏముందో కూడా ఆలోచించాలి కదా" అంది లేడీ విలియం నికోలాయ్.

"అదేమిటి? ఎవరికైనా బానిసగానే ఉండాలని ఉంటుందా?" అని ఆశ్చర్యంగా అంటూ లేడీ జెరెమీ రుమాలుతో ముఖం తుడుచుకుంది. రుమాలును తిరిగి మెడ చుట్టూ పెట్టుకునే లోగా అది కిందప డింది. ఆ క్షణాన వీచిన గాలికి ఎగిరి దూరంగా పిల్లకు పాలిస్తున్న మహిళ దగ్గర పడింది.

లేడీ నికోలాయ్ దగ్గరున్న మెయిడ్ వెళ్లే లోగా మహిళ రుమాలుని వింతగా చూసి, చేత్తో పట్టుకుంది. వెంటనే భయపడింది. రుమాలుని కింద పడెయ్యడానికీ భయమే, చేతిలో ఉంచుకోడానికీ భయమే.

ఆమె ముట్టుకున్న రుమాలుని తిరిగి తీసుకోవడానికి లేడీ జెరెమీ ఇష్టపడలేదు. "కింద పడిపోయిందిగా. ఆమెను ఉంచేసు కోమని చెప్పు" అంది మెయిడ్‌తో.

మెయిడ్ వెళ్లి క్రియోల్ భాషలో ఆ విషయం చెప్పింది. ఆఫ్రికన్ బానిస భయపడిపోతూ పసివాణ్ని కింద దించి నిలబడింది. ఆకలి తీరక బిడ్డ ఏడుస్తున్నా పట్టించుకోకుండా కుర్చీల్లో కూచున్న శ్వేత జాతి స్త్రీల వద్దకు పరుగున వచ్చింది.

క్రియోల్ భాషలో కొంత ప్రవేశం సంపాదించిన లేడీ నికోలాయ్ "గుడ్డ బాగుందా?" అని అడిగింది. నల్లజాతి యువతి తల ఊపింది. లేడీ నికోలాయ్ "అయితే నీ వక్షస్థలం చుట్టూ కట్టుకో" అంది. ఆమె తల అడ్డంగా ఊపింది.

"చూశారా! మొల చుట్టూ గుడ్డ తప్ప పైన కప్పుకునేందుకు కూడా ఏమీ లేదు. మనవంటి వారిని చూసిన తరువాతనైనా వస్త్రధారణ పద్ధతిని మార్చుకోవాలన్న ఊహ వారికి రాలేదు. ఒక్కసారిగా స్వేచ్ఛ నిచ్చినా వారు అంగీకరిస్తారా? అని నా అనుమానం" అంది లేడీ నికోలాయ్

"నాతో వస్తావా? మా ఇంట్లో పనికి పెట్టుకుని నెలకు పౌండు జీతమిస్తాను" అంది లేడీ జెరెమీ బానిసతో.

ఆ మాటలను మెయిడ్ క్రియోల్ భాష లోకి అనువాదం చేసి చెప్పింది. బానిస మహిళకు ఆ మాటలు అర్థం కాలేదో, భావం తెలియలేదో, భావం తెలిసి భయం వేసిందో, భయంలేక పోయినా విషయం నచ్చలేదో కానీ ఆమె పరిగెత్తుకుంటూ పొలంలోకి వెళ్లిపోయింది.

ఆకలికి పసిబిడ్డ గుక్కపట్టి ఏడవడం ఆపలేదు.

★ ★ ★

సోమవారం కోర్టులో వాదనలు తిరిగి ప్రారంభమయ్యాయి.

తోట యజమానుల న్యాయవాది "యువరానర్! ఆఫ్రికా దేశాలనుంచి మనుషులను మేం బలవంతంగా కానీ, తస్కరించిగానీ ఇక్కడకు తీసుకురాలేదు. ఆఫ్రికా చీకటి ఖండమని మీకు మనవి చెయ్యాల్సిన పనిలేదు. తీర ప్రాంతంలో తిరగగలమేమోకాని లోపలికి వెళ్లి మనుషులను తీసుకురావడం అసాధ్యం. ఆఫ్రికా దేశాల రాజులు, వర్తకులు వారి దేశపౌరులను మాకు ఇచ్చివేశారు. చీకటి ఖండంలోని అడవులలో జంతువుల్లా బతకడం కన్నా మావద్ద పని చెయ్యడమే వారికి మంచిది. అనాగరికులైన నల్లజాతి వారికోసం నాగరికులైన శ్వేత జాతీయులు ఎందుకు న్యాయ పోరాటం చేస్తున్నారో అర్థం కావడంలేదు" అన్నాడు.

సర్ జెరెమీ ముఖం మామూలుగా ఉన్నప్పుడే ఎర్రగా ఉంటుంది. కోపంతో అది మధ్యాహ్నవేళ సూర్యుడిలా భగభగలాడే కందగడ్డకన్నా ఎర్రగైంది.

"యువరానర్, శరీరపు రంగు భగవంతుడిచ్చింది. తెలుపు, నలుపులకు హెచ్చుతగ్గులు కల్పించడం సరైన పద్ధతి కాదు. శాస్త్ర విజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకొని యంత్రాలను కనిపెట్టినంతలో మనం మాత్రమే నాగరికులమనుకోవడం అసంబద్ధం. స్వేచ్ఛకు మరోపేరు గ్రేట్ బ్రిటన్! బానిస అనే వాడెవడూ బ్రిటన్ గాలి పీల్చడానికి లేదు. ఎందుకంటే స్వేచ్ఛావాయువు పీల్చిన వాడు బానిస కాలేడు"

"సర్ జెరెమీ మాటలతో గారడీ చేస్తున్నారు. సూటిగా ఆయన సమాధానం చెప్పాలని కోర్టుకి మనవి చేస్తున్నాను. మేం బానిసలను తయారుచెయ్యలేదు. మావద్ద ఉన్నవారు పుట్టుబానిసలే" అన్నాడు భూస్వాముల న్యాయవాది.

"ఆ మాట నిజం కాదు. ఆఫ్రికా ఖండంలోని అనేక దేశాలలో బానిసలుగా ఉన్న వారికి కూడా భూమి కొనుగోలు అధికారం, తమ స్వేచ్ఛను కొనుక్కునే హక్కు ఉన్నాయి" అన్నాడు సర్ జెరెమీ.

"అక్కడ ప్రభువుల అంగీకారం లేకుండా మేం తీసుకురాగలమా? "

"వాస్తవానికి జరిగిందదే. కొందరు నాయకులు యూరోపియన్ ఉత్పత్తులకు ఆశపడి బానిసలను మారకంగా ఇచ్చి ఉండవచ్చు. కానీ తమ దేశ జనాభాలో అధిక శాతం తరలి పోతుండడాన్ని గమనించి కాంగోరాజు పోర్చుగీసు ప్రభుత్వానికి తన వ్యతిరేకత తెలియజేశాడు. అంగోలారాణి పోర్చుగీసు వారిని తన రాజ్యం నుంచి వెళ్లగొట్టడానికి ప్రయత్నించి విఫలమైంది. అమాయకులైన వారికి మన కర్మాగారాలలోని వస్తువులను ఎరగా చూపి మోసం చేశాం, ఆపైన మందుగుండు సామానుతో వశపరచుకున్నాం. మనం నాగరికులమని చెప్తున్నారే. సాటి మనిషిని పశువుకన్నా హీనంగా చూడడం ఏవిధమైన నాగరికత? మన మతం మనకు ఇలాంటి నీతిని బోధించడంలేదే"

వాద ప్రతివాదాలు పదిరోజులకు పైగా సాగాయి. కోర్టువారు తీర్పుని త్వరలోనే వెలువరిస్తామనీ, అయితే తీర్పుకి మహా

రాజు నాలుగో విలియం ఆమోదముద్ర ముందుగా పడాలనీ తెలియచేసి కోర్టుని నిరవధికంగా వాయిదా వేశారు.

★ ★ ★

ఇంగ్లండువెళ్లే నౌకకు లంగరెత్తే ప్రయత్నాలు జరుగుతున్నాయి. చిన్న చిన్న పడవలలో జనం వెళ్ళి అక్కడ నిచ్చెనలను ఎక్కి ఓడలోకి చేరుకుంటున్నారు. ఆఖరుగా నికోలాయ్, జెరెమీ దంపతులు ఓడ ఎక్కడానికి వచ్చారు.

లేడీ జెరెమీ ఆనందంగా ఉంది. భర్త సంయమనం కోల్పోకుండా వాదనలు విన్పించాడు అంతే చాలనుకుందామె.

సర్ జెరెమీ ఆనందంగా ఉన్నాడు. ఇదివరలో మూడుసార్లు వచ్చినా సాధించలేని పనిని ఈసారి సాధించగలిగాడు. ఫలితం కూడా అనుకూలంగానే కన్పిస్తోంది.

నికోలాయ్ ఆనందంగా ఉన్నాడు. ఏ పనిమీద బ్రిటీష్ ప్రభుత్వం తనను మారిషస్ పంపిందో అది నెరవేరేలాగే ఉంది.

లేడి నికోలాయ్ అందరికన్నా ఆనందంగా ఉంది. ఆమె త్వరలోనే తన కొడుకులతో సమయం గడపబోతోంది.




ఇంగ్లండు నుంచి వచ్చిన నౌకకు చెన్నపట్నంలో లంగరుదించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. కూవం నది ఒడ్డున కూచుని నాగన్న ప్రయాణికులు ఒడ్డుకు చేరడాన్ని వింతగా చూస్తున్నాడు. ఎప్పుడూ యజమానురాలిని దేవాలయాలకు తీసుకువెళ్లడమే పనిగా ఉండేది. ఈనాడు యజమానిని కోటకు తీసుకొచ్చిన బోయీలలో అతనొకడు. అయ్యగారు కోట వెలుపల పల్లకీదిగి లోపలకు వెళ్ళారు. సాయంత్రం దాకా అయ్యగారు పనిలోనే ఉంటారు. అందుకని బోయీలు కూవం ఒడ్డుకు వచ్చారు.

ఓడలోని ప్రయాణికులు నిచ్చెనల మీదుగా జాగ్రత్తగా కిందకు దిగుతున్నారు. ఓడ పక్కనే ఉన్న చిన్న పడవల నెక్కి కూవం నదిలోకి చేరుకుని నదిమీద ఉన్న చిన్న వంతెన నుంచి వేలాడతీసిన తాళ్ల నిచ్చెనలపైకి భయం భయంగా ఎక్కి నది ఒడ్డుకి చేరుకుంటున్నారు.

"మా అమ్మ ఉప్పాడలో నన్ను చిన్న పడవలోకే ఎక్కనిచ్చేది కాదు. ఇక్కడ చూడు ఆడవాళ్లు కూడా సీమనుంచి పెద్ద ఓడలో వచ్చి సముద్రంలో నిచ్చెనమీదుగా దిగి పడవలో ప్రయాణం చేసి తాళ్ల నిచ్చెనలు కూడా ఎక్కుతున్నారు" అన్నాడు నాగన్న తన తోటి బోయీ ఆర్ముగంతో.

"అందుకే వాళ్లు దొరలయ్యారు. మన రాజులందరూ చేతగాని వాళ్లయ్యారు. మా ఆర్కాటు నవాబు చూడు రాయపేటలో ఉంటూ తెల్లజాతివారి మోచేతి నీళ్లు తాగుతున్నాడు" అన్నాడు ఆర్ముగం.

"అవునుగానీ మన అయ్యగారేంటి కోట బయటే పల్లకీ దిగిపోయారు. ఆయన పని చేసేది లోపలెక్కడో కదా!"

ఆర్ముగం చిద్విలాసంగా నవ్వాడు.

"నువ్వెప్పుడు అమ్మగారి సేవలోనే ఉంటావుగా నీకేం తెలియదు. సీమ దొరలు మన పల్లకీలను లోపలకు రానివ్వరు. దొరతనం వారెవరైనా ఎదురయినా అయ్యగారు పల్లకీ దిగాల్సిందే. ఆయన అజమాయిషీ అంతా మనమీదే. దొరల దగ్గర ఆయన కుక్కినపేను"

"అయ్యగారు చాలా మంచివారు. ఆయననేమీ అనకూడదు"

"అవునులే! మీ తెలుగు వాడు కాబట్టే, మీ ఉప్పాడ బోయీలంటే ఇష్టం కాబట్టే నువ్వు మెచ్చుకుంటావు. నీకు అక్షరాలు కూడా నేర్పిస్తున్నారట కదా!"

"వాళ్ల పిల్లలకు చదువు చెప్పడానికి గురువుగారు వస్తారు. నాకు అక్షరాలు నేర్పమని అయ్యగారు ఆయనకు చెప్పారు

కావలిస్తే నువ్వు నేర్చుకోవచ్చు"

"ఛీఛీ!! తెలుగక్షరాలు నేనెందుకు నేర్చుకుంటాను?- తమిళమైతే మంచి భాష. నేర్చుకున్నా ఉపయోగం"

"ఏం తెలుగు మాట్లాడడం లేదా?"

"మాట్లాడక చస్తానా? మీ వాళ్లందరూ వచ్చి మానెత్తిన కూచున్నారు. మా ఆర్కాటు నవాబు పాలన ఉంటే మాకు ఈ ఖర్మ పట్టక పోను"

నాగన్నకు సంభాషణ కొనసాగించాలనిపించలేదు. ఓడలోనుంచి దిగుతున్న ప్రయాణీకులను, గుర్రాలపై తిరుగుతున్న దొరలనూ, సముద్ర తరంగాలనూ చూస్తూ కూచున్నాడు.

★ ★ ★

అడవిలో పుల్లమ్మ కట్టెలు కొడుతోంది. లచ్చమ్మ తోటికోడలు కొట్టిన పుల్లలను ఏరి మోపు కడుతోంది. లచ్చమ్మ మూడు నెలల కొడుకు చెట్టుకు కట్టిన గుడ్డ ఉయ్యాలలో నిద్రపోతున్నాడు.

"నాగన్న నుంచి అప్పుడొచ్చిన ఉత్తరమే, మళ్లీ జాబులేదు" అంది పుల్లమ్మ.

లచ్చమ్మ నవ్వింది.

"నవ్వవే! నీ కొడుకైతే నీ పక్కనే ఉన్నాడు కాబట్టి నీకే బాధాలేదు, నా కష్టం నీకెలా తెలుస్తుంది?" అంది పుల్లమ్మ.

"అదికాదక్కా! చెన్నపట్నమంటే పిఠాపురమా? క్షణాలమీద వార్త తెలియడానికి. మనం రాయించిన ఉత్తరం వాళ్లకి అందాలి, వాళ్లు దాన్ని చదివించుకోవాలి, ఎవరి చేతనయినా ఉత్తరం రాయించాలి, తపాలా రన్నరు తీసుకు రావాలి. అయిదారు నెలలయినా పట్టదా?"

"అన్నాళ్లు పడుతుందా? అవునులే అంచెలంచెలుగా తీసుకొస్తారు కాబోలు బంగారు తండ్రి వెళ్లి అప్పుడే ఏడాదవుతోంది. ఈసారి వస్తే మళ్లీ వెళ్ళనివ్వను"

"మరయితే సంద్రం మీద చేపల వేటకు పంపుతావా?"

"అమ్మో! చచ్చినా పంపను"

"మరేం చెయ్యమని చెప్తావు? నీతో కట్టెలు కొట్టమంటావా?"

"ఛఛ! ఇలాంటి పనులు పరువు తక్కువవి కావా?"

లచ్చమ్మ ఫక్కున నవ్వింది.

"నవ్వవే నవ్వు.. రేపు నీ కొడుకు పెద్దయ్యాక నువ్వేం చేస్తావో చూస్తా. నవ్విన నాపచేనే పండుతుంది"

'చేను' మాట వినగానే లచ్చమ్మ నవ్వడం ఆపి కలల్లో తేలిపోయింది. తన కొడుక్కి ఏపనీ చెయ్యాల్సిన అవసరం ఉండదు. తన మొగుడు ఇంకో రెండేళ్లు పనిచేసి కూడబెట్టిన డబ్బుతో పొలం కొంటాడు. తన కొడుకు భూకామందు అవుతాడు. మహారాజులా బతుకుతాడు.

తల్లిని కలలోనుంచి ఇలలోకి తేవడానికా అన్నట్లు లచ్చమ్మ కొడుకు లేచి ఏడవడం మొదలుపెట్టాడు. లచ్చమ్మ బిడ్డను ఉయ్యాలలో నుంచి తీసుకొని, నేలమీద కూచుని, పాలివ్వడం మొదలెట్టింది.

హడావుడిగా పాలిచ్చి పనిలోకి పరిగెత్తవలసిన బానిస బతుకుల గురించి లచ్చమ్మకు తెలియదు.

పుల్లమ్మ కూడా తోటికోడలి పక్కనే కూచుని కూనిరాగాలు మొదలుపెట్టింది.

పుల్లమ్మ, లచ్చమ్మా కట్టెల మోపుల్ని కాకినాడలో అమ్మి, తమ ఊరు చేరుకునే సరికి ఊరిపెద్ద ఎదురయ్యాడు.

"ఏం పుల్లమ్మా! వారమయి ఊళ్లోలేవు. తపాలా రన్నరు నీకుత్తరం ఇచ్చివెళ్ళాడు"

పుల్లమ్మ ముఖం చేటయింది.

"ఏది బాబూ ఉత్తరం?"

"మెల్లో వేసుకుని తిరుగుతానేంటి? ఇంట్లో ఉంది. రేపు వచ్చి పట్టుకెళ్ళు"

ఇంటికొచ్చిన తరువాత పుల్లమ్మ ఊరిపెద్దమీద ఆగ్రహం ప్రదర్శించింది.

"అక్కా! ఉత్తరం ఇప్పుడిస్తే మాత్రం ఏం చేస్తావు? ఇప్పటికిప్పుడు నాగలాపల్లె

కరణం దగ్గరకు వెళ్లగలవా? కాకినాడ నుంచి ఈవేళే వచ్చాం. ఈ రాత్రికి కును కు తియ్యి. పొద్దు పొడవగానే వెడదాం.

"ఉత్తరం చదవడమెందుకే? మా నాగన్న ఉత్తరం చూస్తేనే చాలు"

లచ్చమ్మ ఒళ్లో పసివాడు కిలకిలా నవ్వాడు.

"వాడికీ తెలుస్తోంది. వాడి అన్న ఉత్తరం రాశాడని" అంటూ పుల్లమ్మ మురిసిపోయింది.

మర్నాడుదయమే బాబుని చంకనేసుకుని లచ్చమ్మా, ఉత్తరాన్ని గుండెలకి హత్తుకుని పుల్లమ్మా నాగలాపల్లె వెళ్ళారు. ఉత్తరంపై కొత్త మోజు తీరిందేమో ఊళ్లో వాళ్లెవరూ వెంబడించలేదు.

నాగలాపల్లె కరణం ఉత్తరం చదివి వినిపించసాగాడు. వీధిలో నేలమీద కూచుని తోటికోడళ్ళు వినసాగారు.

"గంగా భాగీరథీ సమానురాలైన మాతృ చరణారవిందములకు నమస్కరించి తమ కుమారుడు నాగన్న వ్రాయునది"

ఇదివరలో వినడం వల్లనేమో పుల్లమ్మ అర్థమడగలేదు.

"చెన్నపట్నం చాలా పెద్ద బస్తీ. ఇక్కడున్న వింతలన్నిటినీ మీకు చూపించాలని ఉంది. మా యజమాని చాలా మంచివారు. నాకు అక్షరములు నేర్పించుచున్నారు. ఈసారి నేనే తమకు ఉత్తరం రాయగలనని భావిస్తున్నాను. ఒక వింత మట్టుకు రాస్తున్నాను. మనం నీళ్ళను నూతిలో నుండి చేదుకొందుం కదా? దొరలట్లు చేయరు. ఇక్కడ ఏడుబావులను పేరుతో బావులున్నవి. వాస్తవమునకవి పది బావులని మా యజమాని చెప్పారు. అందులోని నీటిని పికోటాలతో తోడి ఎత్తులోనుండు టాంకులలో నిలువచేయుదురు. యంత్రములతో వడగట్టి గొట్టములద్వారా తెల్లవారి ఇళ్లకు పంపుదురు. మర తిప్పినచో ఇంటిలో నీరు వచ్చును. ఆ మరలను కుళాయిలందురట. మా యజమానితో ఒక దొర ఇంటికి వెళ్లగా అక్కడున్న తెలుగు సేవకుడు నాకు చూపించాడు. మనవారి ఇళ్లలో కూడా దొరతనము వారు కుళాయిలను అమర్చెదమని చెప్పిరట కానీ ఎవరూ అంగీకరించలేదట"

ఉత్తరం చదువుతున్న కరణం "అవును మరి ఆ అనాచారపు పనికి ఎవడొప్పుకుంటాడు? జాతివాడు గొట్టంలో పంపిన నీరు మనం ఎలా తాగుతాం? " అన్నాడు.

"మా యజమాని ఇంటి నూతిలో నీరు రుచిగా నుండదు. ఎద్దులపై నీరు తెచ్చి బిందె నీళ్లు రెండు దుడ్డుల చొప్పున అమ్ముచున్న వారి దగ్గర కొని వాడుకొనుచున్నారు. నీరు అమ్మే దినములు వచ్చునని, పోతులూరి వీరబ్రహ్మంగారు చెప్పిరట. చిన్నాన్న క్షేమం. లచ్చమ్మ పిన్ని క్షేమమని తలచెదను. చిత్తగించవలెను. మీ కుమారుడు నాగన్న"

పుల్లమ్మ అడగకుండానే కరణం ఉత్తరాన్ని మరోసారి చదివి విన్పించి "మీ వాడికి ఉత్తరం పంపుతావా? " అన్నాడు.

పుల్లమ్మ అటూఇటూ కాకుండా తల ఊపింది. కిందటిసారి ఉత్తరం రాసి పంపినందుకు ఏడాదికి సరిపోయే కట్టెలు కొట్టి పట్టుకొచ్చి దొడ్లో పడేయాల్సి వచ్చింది. ఇప్పుడేమడుగుతారో?

"కట్టెలవసరం లేదులే. మావాడి ఉపనయనం వచ్చే సోమవారం పెట్టుకున్నాం. ఆ సమయంలో బంధువులంతా వస్తారు. అమ్మగారికి మనుషులు కావాలి. మీ ఇద్దరూ వచ్చి ఇక్కడే ఉండండి. భోజనాలిక్కడే చేద్దురు గాని. వెళ్ళేటప్పుడు రెండు పాత చీరలిస్తారులే"

పుల్లమ్మ ఉత్తరం రాయించింది.

★ ★ ★

ఇంగ్లండు వెళ్లే నౌక డెక్‌మీద జెరెమీ దంపతులూ, నికోలాయ్ దంపతులూ కూచుని ఉన్నారు. భోజనానంతరం కాఫీ

సేవిస్తూ కబుర్లు చెప్పుకుంటున్నారు. ఆకాశం నిర్మలంగా ఉంది. అష్టమి చంద్రుడు పల్చటి వెన్నెలను కురిపిస్తు న్నాడు. అక్కడక్కడ చుక్కలున్నాయి.

కొంతసేపు మామూలు సంగతులు మాట్లాడుకున్నాక సర్‌నికోలాయ్ "మారిష స్‌లో పరిస్థితుల మీద రిపోర్టు పూర్తయిం దనుకుంటాను" అన్నాడు.

"రమారమి పూర్తయినట్లే. నా సూచన లను మాత్రం రాయవలసి ఉంది" అన్నాడు సర్ జెరెమీ.

లేడి నికోలాయ్ "ఒక చిన్న విషయం మనవి చేస్తాను. నేను ఒక సాధారణ గృహిణిని, ఆర్థిక, రాజకీయ రంగాలలో పరిచయం లేదు. ఇది బానిసలతో ఎక్కు వగా సంభాషణ చెయ్యడం వల్ల తెలుసు కున్న సంగతి మాత్రమే" అంది.

సర్ జెరెమీ "స్త్రీలు పార్లమెంటు మెంబర్లు కాలేకపోవచ్చు ఓటు హక్కు ఉండకపోవచ్చు. అంత మాత్రాన స్త్రీల అభిప్రాయాలకు విలువ లేదని బ్రిటీషు ప్రభుత్వం భావించడంలేదు. నిర్భయంగా మీ ఉద్దేశం చెప్పండి" అన్నాడు.

"ఆఫ్రికా నుంచి తీసుకొచ్చిన నల్ల జాతీయులకు యజమాని ఆస్తిలో భాగం గా ఉండడమే తెలుసు. జీతం తీసుకుని వారు పని చేయ్యమంటే చేస్తారా? అన్నది నా అనుమానం. దండోపాయం పని చేసి నట్లుగా ధనం వారిదగ్గర పనిచేస్తుందా? వారి చేత పని చేయించగలదా? అని మరో అనుమానం" అంది లేడి నికోలాయ్.

సర్ నికోలాయ్ "ఇంకో విషయం కూడా గుర్తించాలి. బానిసల చేత ఎన్ని గంట లైనా యజమానులు పని చేయించుకో వచ్చు. కానీ కార్మికులకైతే పని గంటలకు లెక్క ఉంటుంది. రోజుకి ఎనిమిది లేదా పది గంటలు మాత్రమే పని చేయించు కునే నియమముంటే మారిషస్‌లో ప్రస్తుతమున్న నల్ల జాతీయులు సరిపోక పోవచ్చు" అన్నాడు.

"మీ సందేహాలు సబబే! నా రిపోర్ట్‌లో వీటినీ ప్రస్తావించి సూచనలిస్తాను" అన్నాడు సర్‌జెరెమీ.

★ ★ ★

పుల్లమ్మ రాయించిన ఉత్తరం చెన్నప ట్నంలో ఉన్న నాగన్నకు అందింది. తను రాయించిన ఉత్తరం అందుకున్న వెంటనే అమ్మ ఉత్తరం రాయించినట్లుంది. మూడు నెలలు తిరక్కుండానే అమ్మనుంచి జవాబు వచ్చిందనుకున్నాడు. ఈ మూడు నెలల్లో తెలుగు అక్షరాలు చదవడం కొంచెం కొంచెం రాయడం నేర్చుకున్న నాగన్న ఉత్త రాన్ని తనే చదువుకోసాగాడు. కూడబలు క్కుంటూ చదువుకుంటున్న నాగన్నకు కన్నతల్లి ఎదురుగా నిలబడి మాట్లాడుతు న్నట్లనిపించింది.

"చిరంజీవి కుమారుడు నాగన్నకు ఆయురారోగ్య ఐశ్వర్యాలతో పుత్ర పౌత్రాభి వృద్ధిగా ఆశీర్వదిస్తూ అమ్మ రాయించిన లేఖాంశాలు. మీ పిన్ని లచ్చమ్మకు మగపిల్లవాడు జన్మించాడు. మాతా శిశు వులు క్షేమమని చిన్నాన్నకు చెప్పగలవు. మీ అత్తవారు ఉప్పాడ వచ్చేవ్యక్తి ద్వారా కబురంపినారు. త్వరలో నీ కార్యం చెయ్య వలెనని సంకల్పించినారు. నేను సరేనని వార్త పంపినాను. వ్యక్తురాలయిన పిల్లను పుట్టింటనే ఉంచరాదు. మాఘమాసంలో ఆలమందలో వారింటనే శుభకార్యం. మీ యజమానిగారి అనుమతి తీసుకుని నీవు, చిన్నాన్న రావలసినది. ఆ సమయమునే చిన్నాన్న పుత్రుని నామకరణం జరుపవ చ్చును. ఇట్లు, మీ అమ్మ"

జాబు చదువుతున్న నాగన్న ముఖంలో సిగ్గుతో కూడిన చిరునవ్వు మెరిసింది.

"ఏంట్రా నీలో నువ్వే నవ్వుకుంటు న్నావు? ఏమి రాయించిందేమిటి మీ అమ్మ" అన్నాడు రామయ్య.

"చిన్నాన్నా! నీకు కొడుకు పుట్టాడట.

నాకు తమ్ముడు పుట్టాడంటే సంతోషంగా ఉండదా? అందుకే నవ్వుకున్నాను"

"నిజమా? ఏదీ ఉత్తరం చదువు" సంబరంగా అన్నాడు రామయ్య.

"విషయం చెప్పానుగా అదీగాక నాకు గబగబ చదవడం రాదు"

"అయితే ఉత్తరమియ్యి పంతులుగారి చేత చదివించుకుంటా"

"నేను విషయం చెప్పానుగా ఇంకెందుకు ఉత్తరం?" అంటూ నాగన్న ఉత్తరాన్ని తన పెట్టెలో పెట్టుకోబోయాడు.

"ఏమిట్రా దాచేసుకుంటున్నావు? అమ్మ రహస్యాలు రాసిందా?"

"అబ్బే ఏంలేదు చిన్నాన్నా" అంటున్న నాగన్న కంఠంలో తడబాటు కన్పించింది.

"అరె! విషయం చెప్పరా"

"చిన్నాన్న అదీ.. అదీ... నాకు కార్యం వచ్చే మాఘమాసంలో అని రాసింది"

"ఓరినీ! అయితే నీకు తమ్ముడే కాదు కొడుకు కూడా పుడతాడన్నమాట. ఉత్తరమియ్యి అయ్యగారికి చూపించి ఊరెళ్లడానికి అనుమతి తీసుకోవాలి"

★ ★ ★

ఉత్తరం అందిన నాలుగు రోజులకు కానీ రామయ్యకు యజమానితో మాట్లాడే వీలు దొరకలేదు. ఉత్తరం చూపించి ఊరు వెళ్లడానికి అనుమతి అడిగిన రామయ్యతో యజమాని "డిసెంబరులో దొరలనందరినీ దర్శించి వారి పండుగకు బహుమతులు సమర్పించాల్సిన పని ఉంటుంది. కాబట్టి ప్రతిరోజూ సవారీ కట్టాల్సిందే, జనవరిలో వెళ్లండి" అన్నాడు.

దొరల నెలలకూ, తమ నెలలకూ తేడా చూసుకుని లెక్కవేసి రామయ్య "సంక్రాంతి సమయానికి ముందు బయల్దేరవచ్చునాండి?" అని అడిగాడు

"సరే" అన్నాడు యజమాని.

రామయ్య ఒక్కక్షణం తటపటాయించాడు. తనను అభిమానంగా చూస్తున్న యజమాని కొలువును వదిలి వెళ్ళిపోవడం అతనికి ఇష్టంలేదు. అలాగని భార్యాబిడ్డలకు దూరంగా ఉండిపోవడమూ ఇష్టం లేదు. విషయం ఎలా విన్నవించాలా అని ఆలోచిస్తున్న అతనితో యజమాని "డబ్బు ఏమైనా కావాలా?" అని అడిగాడు.

రామయ్య నెమ్మదిగా "నన్ను మీకన్నకొడుకులా చూసుకుంటున్నారండి. మిమ్మల్ని తండ్రిలాగే భావించుకుని సేవ చేసుకుంటున్నానండి. మీ కొలువు వదిలిపోవాలని లేదండి. తమరు శలవిప్పిస్తే మా ఊళ్లో పొలం కొనుక్కుని వ్యవసాయం చేసుకోవాలని ఉందండి. మీరు ఎలా చెప్తే అలాచేస్తానండి" అన్నాడు.

"నిన్ను వదిలిపెట్టాలని నాకూ లేదు, కానీ నువ్వు భూజీవనం చేస్తానంటే కాదనను. నీ జీతమంతా నాలుగేళ్ళుగా నాదగ్గరే దాచుకున్నావు. నీ ఖర్చులకోసం నువ్వు తీసుకోగా మిగిలింది వడ్డీవ్యాపారంలో పెట్టాను. నాలుగు వందల రూపాలకన్నా ఎక్కువే ఉన్నట్లుంది. నువ్వు వెళ్ళేటప్పుడు డబ్బుగా తీసుకెళ్ళినాసరే లేదా కాకినాడలో వర్తకుడి పేర ధర్మహుండీగా తీసుకెళ్ళినా సరే"

"చిత్తం! ఇప్పుడే ఆ వివరాలెందుకండి"

"ఏరా నాగన్న నీమాటేమిటి?"

"నేను మళ్ళీ మీ దగ్గర పనిచేయ్యడానికి వచ్చేస్తానండి. ఖర్చులకోసం ఒక పాతిక

## కొత్తగాలి...



**పెళ్లయిన కొత్తలో**
**మగాళ్లు కొత్తబండ్లు!**
**కొన్నాళ్లయ్యాక**
**తెగ 'తాగు'తారు**
**'పొగ' వదులుతారు!**

– కనకసాయినాగ్, పెనుగొండ

రూపాయలిప్పిస్తే చాలండి"

"సరే, ఇంకా రెండునెలలపైనే ఉందిగా" అన్నాడు యజమాని.




**మా**రిషస్‌లో బయల్దేరిన ఓడ లివర్ పూల్ వద్ద తీరాన్ని తాకింది. సర్ జెరెమీ దంపతులూ, సర్ నికోలాయ్ దంపతులూ ఓడదిగి గుర్రపు బగ్గీలలో లండన్ చేరుకున్నారు. లేడీ నికోలాయ్ తన పిల్లలతో ఆటపాటలలో మునిగిపోయింది. సర్‌నికోలాయ్, సర్ జెరెమీలకు దర్శనమిచ్చే లోగా నాలుగో విలియం మహారాజు మంత్రివర్గ సమావేశం ఏర్పాటు చేశారు.

ప్రధానమంత్రి "సర్ జెరెమీ ఇచ్చిన రిపోర్టునూ, మారిషస్‌లో న్యాయమూర్తులిచ్చిన తీర్పునూ కూలంకషంగా చర్చించడానికి మహారాజు ఈ సమావేశాన్ని ఏర్పాటు చేశారు. ప్రతివారూ తమ అభిప్రాయాలను నిర్భయంగా వెల్లడించవచ్చు" అన్నాడు.

విదేశీవ్యవహారాలనూ, యుద్ధ విషయాలనూ పర్యవేక్షించే మంత్రి "రిపోర్టు నాకు సమ్మతంగా ఉంది. బానిసత్వ నిర్మూలన ద్వారా ఫ్రెంచి ప్రభుత్వాన్ని దెబ్బతియ్యడానికి ఇది మంచిమార్గం. బ్రిటనులో ఉన్నది ప్రజాస్వామ్యమనీ, అందరి హక్కులనూ కాపాడతామనీ ప్రపంచమంతా చాటిచెప్పడానికి మేలైన పద్ధతి. దీంతో అన్నిదేశాలవారూ ఫ్రెంచివారిని కాదని మనవైపే మొగ్గుతారు" అన్నాడు.

దేశవ్యవహారాలను చూసే మంత్రి "బ్రిటనులో కూడా శాంతి నెలకొనడానికి ఇది సోపానమవుతుంది. దేశంలో బానిసత్వనిర్మూలన జరిగిన మాట వాస్తవమే. కానీ బ్రిటీషు సామ్రాజ్యంలోని ఇతర దేశాలలో బానిసల చేత పనిచేయించుకుంటున్నారన్న అసంతృప్తి ఆయా దేశాల ఉద్యమకారులలో ఉంది. మారిషస్‌లో బానిసత్వ నిర్మూలన ద్వారా ఉద్యమాన్ని తగ్గుముఖం పట్టించవచ్చును" అన్నాడు.

"ఒకే దెబ్బకు రెండు పిట్టలన్నదే మన ప్రభుత్వ విధానం" అన్నాడు మహారాజు.

ప్రధాన మంత్రి "ప్రభువులు సర్‌నికోలాయ్‌ని మారిషస్‌కి పంపడంలోనే తమ రాజకీయ విజ్ఞతను ప్రదర్శించారు. సర్‌నికోలాయ్‌కి ఆఫ్రికన్లపై సానుభూతి ఎక్కువ. అందుకే ఫ్రెంచి తోటయజమానులను నిలవరించాడే తప్ప వారితో ఏకమైపోలేదు. ఇక సర్‌జెరెమీ పట్టుదల జగద్విఖ్యాతం" అన్నాడు నవ్వుతూ.

"ఫ్రెంచి తోట యజమానులను పూర్తిగా విస్మరించరాదు. బానిసలను లేకుండా చేసి చక్కెర ఉత్పత్తిని ఆపరాదంటే వారు అంగీకరించక పోవచ్చు. వారికి తగిన పరిహారం చెల్లించాలి" అన్నాడు మహారాజు.

బ్రిటనులోనూ, బ్రిటిషు సామ్రాజ్యమంతటా ఉన్న బానిసల యజమానులకు నష్ట పరిహారంగా ఇరవై మిలియన్ల పౌండ్లు చెల్లించడానికి నిర్ణయించడమైంది. అందులో పది మిలియన్ల పౌండ్లు బ్రిటనులోనూ, పది మిలియన్ల పౌండ్లు సామ్రాజ్యంలోని ఇతర దేశాలలోనూ చెల్లిస్తారు. ప్రభువుల అనుజ్ఞ అయితే మారిషస్‌లోని తోట యజమానులకూ రెండు మిలియన్ల పౌండ్లు కేటాయిస్తారు" అన్నాడు ప్రధానమంత్రి.

యువకుడైన ఒక మంత్రి "నష్టపరిహారానికి నిర్ణయించిన ఇరవై మిలియన్ల పౌండ్లూ సామాన్య ప్రజల నుంచి వసూలు చెయ్యడం ధర్మం కాదేమోనని

ప్రభువులకు విన్నవిస్తున్నాను" అన్నాడు.

మహారాజు ఆర్థిక వ్యవహారాల మంత్రి వైపు సాభిప్రాయంగా చూశాడు.

"శక్తిమంతమైన బ్రిటీషు సింహాసనానికి ఆదాయం సమకూరేది సామ్రాజ్యంలోని తోట యజమానుల నుంచీ, ఈస్టిండియా కంపెనీ వంటి విదేశీ వర్తకుల నుంచీ అన్నది మరువరాదు. వారంతా లాభాలు గడిస్తేనే సామ్రాజ్యం వర్థిల్లుతుంది. వారికి నష్టం కలిగేలా బానిసత్వ నిర్మూల ఉద్యమం జరుగుతోంది. ఉద్యమకారులంతా సామాన్య పౌరులే. తమ ఉద్యమం విజయవంతం కావాలని కోరుకుంటున్నారు కనుక పన్ను చెల్లించడానికి వారు బాధపడబోరు" అన్నాడు ఆర్థిక మంత్రి.

తమది కుటిలనీతి అన్న విషయాన్ని బ్రిటిషువారు ఏనాటికీ అంగీకరించరు. ప్రజల కోసమే ప్రభుత్వమన్నది వారు ఢంకా భజాయించి చెప్పేమాట. ప్రజల కోసం, ప్రజల అభిప్రాయాలను గౌరవిస్తూ పరిపాలన చేస్తున్నట్లుగా కన్పించడం వారికి వెన్నతో పెట్టిన విద్య. ఆ కారణంగానే ఐరోపా ఖండంలో ఎన్నిదేశాలున్నా బ్రిటిషువారు మాత్రమే రవి అస్తమించని సామ్రాజ్యాన్ని స్థాపించగలిగారేమో!

మంత్రివర్గ సమావేశమైన మర్నాడు మహారాజు సర్ నికోలాయ్, సర్ జెరెమీలకు దర్శనమిచ్చాడు. ప్రధానితో పాటు ఇండియాలో రెగ్యులేటింగ్ చట్టం అమలు చేసే మంత్రి కూడా అక్కడే ఉన్నాడు.

ప్రధాని ముందురోజు జరిగిన సమావేశంలో ముఖ్యాంశాలను తెలియచేశాడు.

సర్ నికోలాయ్ "రెండు మిలియన్ల పౌండ్లు తోట యజమానులను తప్పక సంతృప్తిపరుస్తాయి" అన్నాడు.

మహారాజు "విముక్తి పొందిన బానిసలు సంఖ్య దృష్ట్యా కానీ, వారి ఆలోచనా దృష్ట్యాకానీ తోటలలో పనిచేయడానికి సరిపోరని మీ రిపోర్టులో ఉంది. ఆ విషయమై ఆలోచించాలి" అన్నాడు.

"బ్రిటను నుంచి కానీ, ఇతర ఐరోపాదేశాల నుంచి కానీ తక్కువ వేతనాలతో తృప్తిపడే కార్మికులు దొరకకపోవచ్చు. మనం ఆసియా ఖండంపై దృష్టిసారించాలి. చైనా, మలయా, ఇండియా..." అంటూ ఆగాడు ప్రధాని.

"ఇండియా కరువు కాటకాలతో దీనస్థితిలో ఉంది. కాబట్టి ఇండియాపై దృష్టిసారించడం మంచిదేమో? బలవంతంగా పంపిస్తున్నట్లుగా కన్పిస్తే ప్రజలలో తిరుగుబాటు రావచ్చు. ఎక్కువ సామంతో వ్యవహరిస్తే ఎవరూ కదలకపోవచ్చు. కొంత నయానా, కొంత భయానా మారిషస్‌కి కార్మికులను పంపేలా ఈస్టిండియా కంపెనీతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపండి" అని మహారాజు రెగ్యులేటింగ్ చట్టం అమలు చేసేమంత్రికి చెప్పి సమావేశాన్ని ముగించాడు.

★ ★ ★

చెన్నపట్నంలో దొరలు క్రిస్మస్ పండుగను ఘనంగా జరుపుకున్నారు. ఇంగ్లీషువారి ప్రాపకం కోరే రాజులూ, జమీందారులూ, ఉద్యోగులూ, వ్యాపారులూ వారికి కానుకలు సమర్పించుకున్నారు.

సంక్రాంతి పదిరోజులు ఉందనగా రామయ్యా, నాగన్నా ఉప్పాడ వెళ్ళేందుకు యజమాని అనుమతి అడిగారు. ఆయన అయిదు వందల రూపాయలకు కాకినాడలో వర్తకుని పేర రామయ్యకు ధర్మ హుండీనిచ్చాడు

"అయ్యగారూ, మీ దగ్గర నా డబ్బు అంత ఉందాండి? "

"నాలుగు వందల చిల్లర ఉంది. మిగతాది నా బహుమతి. పొలం కొనుగోలులో, వ్యవసాయంలో జాగ్రత్త"

రామయ్య యజమానికి సాష్టాంగ నమస్కారం చేశాడు. యజమాని నాగన్నకు పాతిక రూపాయలు ఇవ్వబోయాడు.

"అయ్యగారూ, యాభై ఇప్పించండి"

"పాతికే కదా నువ్వడిగింది? "

"అవుననుకోండి కానీ..."

"నిన్ననే బందరు వీధికెళ్ళామండి. అక్కడ చీరలు చూసి మావాడు ముచ్చట పడి బేరమడిగాడండి. ధర విన్నాక పాతిక చాలవనిపించింది" అన్నాడు రామయ్య.

"ఏరా అప్పుడే నువ్వు పెళ్లానికి చీరలు కొనేంత పెద్దవాడివయ్యావా? " అన్నాడు యజమాని.

"అబ్బే కాదండీ. మా అమ్మకండి"

"అమ్మకీ కొను, మీ ఆవిడకీ కొను. డబ్బు విచ్చలవిడిగా ఖర్చుపెట్టకు. ఇదిగో యాభైరూపాయలు. తిరిగి వచ్చినప్పుడు నువ్వు మిగిలిన డబ్బు నాకిస్తే దానికి రెట్టింపు నీ జమలోకి రాస్తాను. సరేనా"

"అలాగేనండి" అంటూ నాగన్న యజమాని పాదాలకు నమస్కరించాడు.

★ ★ ★

రెండేళ్ళ తరువాత వచ్చిన కొడుకుని చూసి పొంగిపోయింది పుల్లమ్మ.

"నాతండ్రీ, నాతండ్రీ ఎంత చిక్కిపోయావురా అసలు ఏమైనా తింటున్నావా? నేను పిలిచి పెడితేకానీ నీకు తిండి ధ్యాసే ఉండదు. ఈవేళ నాలుగు రకాలు వండి పెడతాను. హాయిగా తిని నిద్రపో. చెన్న పట్నం నీళ్లు పడ్డట్లు లేవు"

వాస్తవానికి ఉప్పాడ వదిలి వెళ్ళినప్పటికన్నా నాగన్న ఒళ్లుచేశాడు. ప్రతి రోజూ యజమానురాలు తమ ఇంట్లో మిగిలిన పప్పూ, కూరలూ, సేవకులకు ఇస్తూంటుంది. పండగలలో పిండివంటలూ ఇస్తుంది. సేవకులలో అందరికన్నా చిన్నవాడని నాగన్నకు యజమాని పని కూడా తక్కువే చెప్పేవాడు. కానీ ఏ కన్న తల్లి మనస్సూ బిడ్డ చిక్కిపోలేదన్న మాటను అంగీకరించదు గదా!

నాగన్న చిన్న వెదురుపెట్టె తీసి "అమ్మా ఇదిగోనే నీకు వెండి కడియాలు తెచ్చాను" అంటూ తల్లికిచ్చాడు.

ఆమె "నా బంగారు కొండా! ఎంతవాడివయ్యావురా! అమ్మకు కడియాలు చేయించి తెచ్చావు" అని మురిసిపోతూండగా "ఇదిగో రెండు చీరలు కూడా తెచ్చాను. ఈచీర బందరులో కొన్నాను, కోటకొమ్మంచు చీర. ఈ చీరేమో చీరాలలో కొన్నాను, గళ్ళచీర. మూడు రూపాయలన్నాడు. రెండున్నరకి ఇవ్వమన్నాను" అన్నాడు.

"వదినా! నీ కొడుకు తెలివి మీరిపోయాడు. చీరలెంత నాణ్యత చూస్తున్నాడో, ఎంత చక్కగా బేరం చేస్తున్నాడో" అన్నాడు కొడుకుని ముద్దులాడుతున్న రామయ్య.

"పిన్నీ! ఇదిగో నీకు చుట్టుచెంగావిచీర" అంటూ అచ్చమ్మకిచ్చాడు నాగన్న.

"సరేకానీ నాగన్నా నీ పెళ్ళానికేమీ కోకలు కొనలేదా? " అంది పుల్లమ్మ.

నాగన్న సిగ్గుతో మెలికలు తిరిగిపోతూ "దానికీ తెచ్చానులేవే" అన్నాడు.

"ఏదీ చూపించు" వెదురు పెట్టెలోకి చూసింది పుల్లమ్మ.

నాగన్న చీరలు బయటకు తీశాడు.

"అబ్బో! బాగున్నాయిరా! ఇటువంటివి ఎప్పుడూ చూడలేదే" అంది పుల్లమ్మ.

"దీన్ని మధుర చుక్కల చీర అంటారు. ఈ చీరేమో దొరల కర్మాగారంలో నేశారు. ఈ తెల్లచీరకి గోపురం అంచుంది చూశావా. దీన్ని కంచి నుంచి తెచ్చి అమ్ముతూంటే కొన్నా. రెండు రూపాయలన్నాడు. రూపాయకి బేరమాడాను. ఇదేమో నెల్లూరి గజ్జెల పట్టెడ. ఇవి మురుగులూ, కడియాలూ"

"బాగున్నాయి" అనిపైకి అన్న పుల్లమ్మ మనసులో "స్వామీ నాగేంద్రా నా కొడుక్కి కార్యమైన ఏడాది తిరక్కుండా కొడుకుని ప్రసాదించు. నీపేరే పెట్టుకుంటా" అని మొక్కుకుంది.

★ ★ ★

నాగన్న కార్యానికి రామయ్యనూ, లచ్చ

మ్మనూ వెళ్ళమని పుల్లమ్మ చెప్పినా అంతా కలిసి పుల్లమ్మను కూడా బయల్దేరతీశారు.

"ఉప్పాడ నుంచి రెండు, మూడు ఆమడలు మించి ఎక్కడకూ వెళ్ళలేదు. నీ కూతుర్ని కాపరానికి పంపడానికి కూడా మేమే వెళ్ళాం. నువ్వూ రా" అని మరిదీ తోటికోడలూ బలవంతం చేశారు. సింహాచలం స్వామిని దర్శించుకుందువు అంటూ నాగన్న తల్లికి ఆశ చూపాడు. పుల్లమ్మ వారి మాట తీసెయ్యలేక బయల్దేరింది.

తుని దగ్గర తాండవ నదినీ, అనకాపల్లి దగ్గర శారదా నదినీ నడుములోతు నీళ్ళలో దాటిస్తూ నాగన్న గోదావరి, కృష్ణ పెన్నలను ఎలా దాటుతారో వర్ణించి చెప్పాడు. చెన్నపట్నంలో తెల్లజాతివారి గురించీ, ఓడల గురించీ, ఆడవాళ్ళు ధైర్యంగా నిచ్చెన మీదుగా పడవలలోకి దిగడం గురించీ తెలియచెప్పాడు. పుల్లమ్మ ఆశ్చర్యానందాలతో కొడుకు చెప్పేది వింటూ ప్రయాణం చేసింది.

ఆలమంద వియ్యాల వారింటికి చేరుకునే సరికి పుల్లమ్మ కూతురూ, అల్లుడూ ఎదురయ్యారు. "మాకన్నా ముందే వచ్చారు" అంటూ కూతుర్ని దగ్గరకు తీసుకుని సంబరపడింది పుల్లమ్మ.

కార్యం కార్యక్రమాలు పూర్తయ్యాక ఉప్పాడ చేరుకున్నారంతా. ఆ సమయంలో అల్లుడు నరసయ్య చెప్పిన వార్త పుల్లమ్మకు పిడుగుపాటులా తోచింది.

"అత్తమ్మా! నేను కూడా చెన్నపట్నం పనికి వెడుతున్నా" అన్నాడు నరసయ్య.

"అదేమిటి మీ తాత ఒప్పుకోడన్నావుగా?" అంది పుల్లమ్మ.

"మా తాత చచ్చిపోయాడత్తమ్మా! ఇంకా చెప్పాలంటే చంపేశారు"

"చంపేశారా? అదేమిటి నాకు వార్త పంపలేదేమిటి? అక్కడకు వచ్చి వియ్యాల వారిని చూసేదాన్నిగా?"

"వస్తే నిన్నూ చంపేవారేమో"

పుల్లమ్మ బిత్తరపోయింది.

నరసయ్య వివరంగా చెప్పాడు. వాళ్ళ తాత ఉండే ఊరి జమీందారుకీ, పక్కఊరి జమీందారుకీ మధ్య తగాదాలు జరుగుతూ ఉండేవి. ఒకసారి పోట్లాటలో పక్కఊరి జమీందారు దారులు కాసి పదిమందిని చంపించాడు. వ్యవహారం కోరటులో విచారించారు. సరైన సాక్ష్యంలేక జమీందారుని వదిలేశారు. జమీందారు కక్షకట్టి సాక్షులకు చంపించాడు. సాక్ష్యం చెప్పిన వారిలో నరసయ్యతాత ఒకడు.

"సాక్ష్యం సరిగా లేదని వదిలేశారా? మీ తాత లాంటివారు సాక్ష్యం చెప్పారు కదా. ఇదే అయిదరాబాదు జమానా అయితే ఆ జమీందారుని ఉరితీసేవారు. మీ తాత బతికేవాడు" అంది పుల్లమ్మ

## కొత్తగాలి...



**ప్రతి ఛానల్‌లోను**
**ప్రవచనాల ప్రవాహం**
**నా సంగతేమో కాని**
**నా టీవీ పుణ్యం చేసుకుంది!**

**– తాజీ ప్రసాద్,**
చెన్నై

"దొరల పద్ధతి వేరొదినా! వందమంది తప్పుచేసినవాళ్ళనయినా వదిలెయ్యాలి కానీ తప్పుచేయనివాణ్ణి శిక్షించకూడదన్నది వాళ్ళ పద్ధతి. మన వాళ్ళయితే తప్పుచేసిన వాణ్ణి ఒకర్ని కూడా వదిలెయ్యకూడదంటారు" అన్నాడు రామయ్య.

"ఇదేం బాగోలేదు" అంది లచ్చమ్మ.

"ఎవరి పద్ధతి మంచిదో, ఎవరి పద్ధతి మంచిదికాదో చెప్పాల్సింది మనలాంటి మనుషులు కాదు. ఈ ధర్మాలు నిర్ణయించాల్సింది భగవంతుడే అని అయ్యగారంటూ ఉంటారు" అని నాగన్న అన్నాడు.

"మీ అమ్మ నాన్నా సరేనంటే నేనేమం టాను? అలాగే వెళ్ళు నాగమ్మ నాదగ్గరే ఉంటుందిలే" అంది పుల్లమ్మ.

"లేదు అత్తమ్మా! తీసుకెడతా! ఇద్దరూ సంపాదించకపోతే ఇల్లు గడవదు"

'ఇదే సందు' అనుకుంటూ నాగన్న "అవునే అమ్మా. నేనూ మల్లిని తీసికె డతా" అన్నాడు.

"అమ్మబాబోయ్! ఆ తెల్లదొరల మధ్యకి ఆడవాళ్ళా? ఇంకేమైనా ఉందా?" అని పుల్లమ్మ భయం భయంగా అంది.

రామయ్య నచ్చచెబుతూ "నాగన్నని పంపే ముందూ ఇలాగే భయపడ్డావు. ఇప్పుడు చూడు నాగన్న ఎంత సంపాదనా పరుడయ్యాడో. తెల్లదొరలుండే చోటువేరు, మనవాళ్ళుండే చోటువేరు. నాగమ్మా, మల్లమ్మా, మనవాళ్ళ ఇళ్ళల్లో పనిచేస్తారు. అక్కడే ఉంటారు" అన్నాడు.

"ఇక నేనూ, లచ్చమ్మా మాత్రం ఇక్కడెం దుకు? అందరం అక్కడికే పోదాం"

"ఆ విషయమే మాట్లాడదామనుకుంటు న్నాను. నా సంపాదనంతా మా అయ్య గారి దగ్గరే దాచుకునేవాణ్ణికదా. ఆయన ఆ డబ్బుని వడ్డీకి తిప్పారు. ఈ నాలుగేళ్ల నా సంపాదనా, వడ్డీ కాకుండా కొంత డబ్బు బహుమతిగా చెప్పి నాచేతిలో అయిదు వందలు పెట్టారు. ఇక్కడ పొలం కొని వ్యవసాయం చేసుకుంటూ ఇక్కడే ఉంటా" అన్నాడు రామయ్య.

లచ్చమ్మ ముఖం గర్వంతో, ఆనందంతో మెరిసింది. పుల్లమ్మ సంబరంగా "నిజ మేనా మరిదీ?" అంది.

నాగన్న "అమ్మా, రెండేళ్ళు ఓపిక పట్టు నేనూ ఇక్కడికే వచ్చి పొలంకొని వ్యవ సాయం చేస్తా" అన్నాడు.

పుల్లమ్మ "రెండేళ్ళను మించి రెండు గడి యలు కూడా ఓపిక పట్టను" అంది.

★ ★ ★

"రెండేళ్ళయింది. ఏమిటో మా నాగన్న నుంచి ఏ వార్తా లేదు" అంది పుల్లమ్మ కట్టెల్ని మోపులుగా కడుతూ.

ఆమెతో పాటు అడవిలో కట్టెలు కొడు తున్న చుక్కమ్మ "వార్తలేక పోడమేమిటి? తపాలా రన్నరు కన్పించాడంటే పుల్లమ్మకే ఉత్తరం అని ఉప్పాడ ఊరు ఊరంతా చెప్పుకుంటారు. అయినా రెండేళ్ళెక్కడ యింది. ముందు చైత్రం కాక ఆ ముందు చైత్రానికేగా చెన్నపట్నం వెళ్ళింది" అంది.

"అదికాదు చుక్కమ్మా. వాడికి కార్యమ యింది మాఘంలోనేగా. ఈపాటికి కొడు కు పుడితే నాకు మనశ్శాంతిగా ఉండేది. పోనీ కూతురు కడుపునైనా ఓ కాయకా స్తుందా.. అదీలేదు. పిల్లలిద్దరికీ పిల్లలు పుడితే చాలు నాకే కోరికాలేదు"

"అలాగే అనుకుంటాం. మనవలు పుడితే ఇంకే కోరికలూ ఉండవా? వాళ్ళు మనకళ్ళ ముందే ఉండాలనిపిస్తుంది. కొడుకూ, కోడలూ, కూతురూ, అల్లుడూ చెన్నపట్నంలో ఉంటే ఎలా? ఉప్పాడ వచ్చేస్తే బాగుండనిపిస్తుంది. మరిది పదెక రాలు భూమి కొంటే కొడుకు పాతిక ఎక రాలు కొనాలనిపిస్తుంది. అవునుకానీ నీ మరిది భూస్వామి అయ్యాడు కదా నువ్వింకా కట్టెలు కొట్టుకుంటూ, వడ్లు దంపుకుంటూ బతుకుతున్నావేం?"

"అందరూ అడిగిన మాటే అడిగావు. మరిదీ తోటికోడలూ నన్నింట్లో ఉండమనే అంటున్నారు. ఇంట్లోనే కూచుంటే మనస్సు మానాగన్న మీదకే పోతుంది. వాడిమీద బెంగ. అన్నం తినాలనిపించదు, నిద్రప ట్టదు. అందుకే ఇలా పని చేసుకుంటూ కాలం వెళ్ళదీస్తున్నాను. వాణ్ణి వదిలి క్షణ మైనా ఉండలేననుకునేదాన్ని, నాలుగేళ్ళుగా గుండ్రాయిలా ఉన్నాను. ఇంకెన్నాళ్ళో?"

"ఇంకెన్నాళ్ళు? ఈసారొస్తే ఇక చెన్న పట్నం వెళ్ళనని చెప్పేడన్నావుగా. మరిది లానే భూమికొని సేద్యం చేస్తాడేమోలే"

"అదే జరిగితే నీ నోట్లో ఇంత పంచదార

పోస్తా. నా మరిదిలానే లంకల్లో భూమిని కొంటే కూరగాయలు పండించి కాకినాడలో అమ్ముకుంటే బోలెడు ఆదాయం"

"లచ్చమ్మ అదృష్టమే అదృష్టం. నా మొగుడూ చెన్నపట్నం వెళ్ళాడు. ఇక్కడకు మించి అక్కడ తాగుతున్నట్లుంది. ఇక్కడ అప్పులు తీరలేదు. అక్కడ కొత్త అప్పులట. మా బావకొడుకు కబురు తెచ్చాడు"

"అధైర్యపడకు మారతాడులే"

చుక్కమ్మ మూతితిప్పి, కట్టెను గొడ్డలితో గట్టిగా కొట్టింది. భర్తమీద కోపాన్ని చెట్టు మీద చూపిందేమో ఒక్క దెబ్బకే కర్ర విరిగి కింద పడింది.

కొట్టిన కట్టెలను కాకినాడలో అమ్మి పుల్లమ్మ ఉప్పాడ చేరుకునేసరికి రామయ్యా, లచ్చమ్మా ఇంటి ముందు కూచుని కబుర్లు చెప్పుకుంటున్నారు. పిల్లవాడు గుమ్మంముందు ఆడుకుంటున్నాడు.

"రారా! నాగప్పా! రా! ఇదిగో పండు" అంటూ పుల్లమ్మ మరిదికొడుకును పిలిచింది. పిల్లవాడు పరిగెత్తుకుంటూ వచ్చి ఆమెకు చేతులందించాడు. వాణ్ణి ఎత్తుకుని ఆమె ముద్దులాడుతుండగా లచ్చమ్మ "అక్కా! వాడు నీ కొడుకో నా కొడుకో తెలియడంలేదు. వాడికి పేరు పెట్టడం నుంచీ అంతా నీ ఇష్టమే" అంది

"అవును ఇద్దరూ ఇంట్లోనే ఉన్నారేం. పొలానికి పోలేః" పుల్లమ్మ అడిగింది.

"నాలుగు రోజులుగా పొలం పనిమీదే ఉన్నాం వదినా. వంగతోట పనిపూర్తయింది. ఇంక నీళ్ళుపెట్టడమే. బీరపాదులకీ పందిళ్ళు పది రోజుల తర్వాత వేస్తా. పనివాళ్ళకి నీళ్ళు పెట్టేపని చెప్పి వచ్చాను. పదిరోజుల పాటు ఖాళీయే"

"ఒకరి కింద పనిచేసే రోజులు పోయి నలుగుర్ని పనిలో పెట్టుకునేంతగా మీ నాన్న ఎదిగాడురా నాగప్పా. మీ నాగన్నయ్య కూడా త్వరలో అలాగవ్వాలి. ఈ సారి నువ్వే ఉత్తరం రాయించు. 'నాగన్నయ్యా, నాగన్నయ్యా. నాకు ఆడుకుందుకు తొందరగా కొడుకుని కను. నాగమ్మత్తా, నాగమ్మత్తా నువ్వు తొందరగా కూతుర్నికను. నేనే చేసుకుంటా' అని ఉత్తరం రాయించు" అంది పుల్లమ్మ పిల్లవాడితో.

లచ్చమ్మ "సరిపోయింది. ఇప్పటి నుంచే పెళ్ళి మాటలా!" అంది.

రామయ్య "నాగమ్మ చెన్నపట్నంలో ఉంది. కూతురు పుడితే మాత్రం ఈ పల్లెటూరోడ్ని చేసుకుంటుందా" అన్నాడు.

"ఎందుకు చేసుకోదు? నేను ఒప్పిస్తాగా, పట్నంలో ఉంటే మాత్రం వాళ్ళనాన్న చేసేది నౌకరీ పనే కదా. మా నాగప్ప పదెకరాల ఆసామీ" అంది పుల్లమ్మ.

రామయ్యా, లచ్చమ్మా నవ్వారు. విషయం అర్థం కాకపోయినా పసివాడు నాగప్పకూడా నవ్వాడు. మరిదీ, తోటికోడలూ ఎగతాళిగా నవ్వినందుకు కోపమూ, పసివాడి అమాయకపు నవ్వుకు ఆనందమూ పుల్లమ్మలో ఒకేసారి కలిగాయి.




కొడుకు దగ్గరనుంచి ఉత్తరం కోసం ఎదురుచూస్తున్న పుల్లమ్మకు కొడుకు వస్తున్నాడన్న వార్తను ఊరి చివర ఆడుకుంటున్న పిల్లలు పట్టుకొచ్చారు. ఆయాసంగా పరిగెత్తుకుంటూ వచ్చిన పిల్లలు "పుల్లమ్మమ్మా! నాగన్న మామయ్య వస్తున్నాడు. ఇంకా నాగమ్మ పిన్ని, వాళ్ళాయనా అంతా వస్తున్నారు. మూటలూ, పెట్టెలూ మోసు



కొస్తున్నారు. మాకు మిఠాయి పెట్టు" అన్నారు.

"ఏమిటీ, నిజమేనా! లోపల గూట్లో తాటితాండ్ర ఉంది. తీసుకోండి" అంటూ పుల్లమ్మ ఊరి చివరకు వేగంగా నడవడం మొదలెట్టింది. కొంతదూరం వెళ్ళేసరికి ఆమెకు నలుగురు నడిచి రావటం కన్పించింది. తల్లిని చూసిన నాగన్న వేగంగా దగ్గరకు వచ్చి భుజాన ఉన్న కావిడి కింద పెట్టి, ఆమె చుట్టూ చేతులు వేశాడు.

"ఎన్నాళ్ళయిందిరా నా తండ్రీ! ఎంత చిక్కిపోయావురా!" అంటూ పుల్లమ్మ కొడుకు ఒళ్ళంతా నిమిరింది.

"ఏమ్మా! నేను లావయ్యానా? " అంటూ నాగమ్మ వచ్చి తల్లి పక్కన నిల్చుంది.

"అదేం మాటే తల్లీ! నువ్వు కూడా చిక్కిపోయావు" అంటూ కూతురి భుజం మీద చెయ్యి వేసింది పుల్లమ్మ.

"అంతేలే కొడుకు మీద ప్రేమతో వెయ్యో వంతైనా కూతురి మీద ఉండదు. చూస్తానుగా ఈవేళ రొయ్యలకూరే వండుతావో, చేపల పులుసే వండుతావో"

"రెండూ చేస్తాను, సరేనా? "

"ఇక్కడ దారిలో నిలబడి మాట్లాడడమేనా. ఇంటికి వెళ్ళేదేమైనా ఉందా? " అన్నాడు నరసయ్య.

"పదండి. ఇంటికి వెడదాం. వేణ్ణీళ్ళు పెడతాను. స్నానాలు చేసి, భోజనాలు చేసి, విశ్రాంతి తీసుకోండి. అప్పుడు తీరుబడిగా మాట్లాడుకుందాం"



"చిన్నాన్న ఏడమ్మా? " అన్నాడు నాగన్న.

"లంకలో పొలం కొన్నాడుగా! పిన్నీ, చిన్నాన్నా అక్కడే ఉన్నారు. రేపు వస్తారు. కూరగాయలు బాగా పండుతున్నాయి. ఈ ఏడు ఇంకో రెండు ఎకరాలు కొందామని చూస్తున్నాడు"

భోజనాల దగ్గర నరసయ్య తన కొలువు విశేషాలు చెప్పాడు.

"మా అయ్యగారిది వడ్డీ వ్యాపారం అత్తమ్మా! ఆయన కింద చాలామంది గుమాస్తాలు పని చేస్తుంటారు. ఎన్నెన్ని దస్త్రాలుంటాయో. ఒక్కరి కాగితాలు ఇంకొకరి దగ్గరకు పట్టికెళ్ళి ఇచ్చే పని నాది. రోజంతా అటూ ఇటూ తిరగడమే అనుకో. అందరి నోట్లోనూ ఒక్కటే మాట నరసయ్యా! నరసయ్యా!"

"నీడపట్టున పనేనన్నమాట"

"మా అయ్యగారు కోటలో కొలువు మానేశారమ్మా. ఆయనకు చెన్నపట్నం దగ్గరలో చాలా భూములున్నాయి. నేను పొలంలో పని చేస్తున్నా" అన్నాడు నాగన్న.

"మంచిదే కదా. ఇక్కడ భూములు కొనేసరికి వ్యవసాయంలో కిటుకులన్నీ తెలుస్తాయి" అంది పుల్లమ్మ.

నాలుగు రోజులు చెన్నపట్నం కబుర్లూ, వింతలూ, విశేషాలు చెప్పుకున్నాక అయిదో నాడు రామయ్యతో పొలానికి వెళ్ళారు నాగన్న, నరసయ్య.

చిన్నపిల్లవాణ్ణి చూస్తాండమని కూతురికీ, కోడలికీ చెప్పి పుల్లమ్మా, లచ్చమ్మా

నీళ్ళు తీసుకురావడానికి ఊరి బావి దగ్గరకు వెళ్ళారు.

"అసలీ ఆడవాళ్ళిద్దరూ చెన్నపట్నం ఎందుకు వెళ్ళారో తెలియడంలేదు. అక్కడ వీళ్ళేం పనిచేసి సంపాదించడటం లేదుట. నా దగ్గరే ఉంచమంటే వినలేదు" అంది పుల్లమ్మ.

"పోనీలే ఏదో మొగుళ్ళకి ఇంత వండి పెడుతున్నారుగా" అంది లచ్చమ్మ.

"ఆఁవండి పెట్టడానికి మనిషి కావాలేమిటి? మరిది ఒక్కడే నాలుగేళ్ళు ఉండ్లేదా ఏమిటి? "

"అక్కా, దేనికీ ఊరుకోవు! వయస్సులో ఉన్నవాళ్ళు కలిసి ఉండాలనిపించదా? "

"అదేనే నా బాధ.. కలిసి ఉన్నాక కడుపుకో కాయ కాయద్దా? "

"సరేలే ఎండెక్కుతోంది. పద ఇంటికి పోదాం"

★ ★ ★

రాత్రి భోజనాల వేళకు తిరిగి వచ్చారు రామయ్యా, నరసయ్యా, నాగన్నా.

"వదినా, పొలం ఎక్కడ కొంటే బాగుంటుందా? అని నాలుగు ఊళ్ళూ తిరిగి వస్తున్నాం. నేను ఇంకో రెండు ఎకరాలు కొందామనుకుంటున్నానా, ఆ పక్కనే నాగన్న అయిదెకరాలు తీసుకుంటున్నాడు. పక్కపక్కనే ఉంటే పండించడం సులభం కదా అనుకుంటున్నాం"

"పొలం కొంటున్నావా? అయితే ఇక్కడే ఉండిపోతావన్నమాట. అయినా అప్పుడే చెప్పావుగా, రెండేళ్ళు ఓపికపట్టు అని. రెండేళ్ళకే పొలం కొంటున్నావు. ఇంకెక్కడా కొలువు చెయ్యక్కరలేదు. హాయిగా వ్యవసాయం చేసుకుంటూ ఉండచ్చు" అని ఎంతో ఆనందంగా అంది పుల్లమ్మ.

"ఇక ఇప్పటికి చెన్నపట్నం వెళ్ళడం లేదు" అన్నాడు నాగన్న.

చెన్నపట్నం వెళ్ళడం లేదంటూ ఇంకెక్కడికి వెడతావు అని అడగాలని పుల్లమ్మకు తెలియదు.

ఉప్పాడ వంటి కుగ్రామంలో పుట్టి పెరిగిన ఆమె, చెన్నపట్నం తెలివితేటల గురించి ఊహలో కూడా అందుకోలేనంత అమాయకురాలు.

★ ★ ★

మర్నాడు మధ్యాహ్నం. అందరూ తీరిగ్గా కూచున్నప్పుడు నాగన్న తల్లిదగ్గర అసలు విషయం చెప్పడం ప్రారంభించాడు.

"అమ్మా, మా అయ్యగారు కోటలో కొలువు మానేశారని చెప్పాను కదా. నా మీద అభిమానముంది కాబట్టి కొలువు తీసెయ్యకుండా వాళ్ళ పొలంలో పనికి పెట్టుకున్నారు. జీతం నెలకు అయిదు రూపాయలే. అంటే రెండు రూపాయలు తగ్గిందన్నమాట"

"పోనీలే ఎంతయితే ఏమిటి? ఇంక అక్కడ పనికి వెళ్ళవుగా"

"అక్కడకు వెళ్ళకపోతే మాత్రం పరిస్థితులు మారతాయా? దేశమంతా కరువు కాటకాలు వచ్చాయి. తిండానికి గింజలేదనుకో. చెన్నపట్నంలో దొరలు గంజిదొడ్లు అనిపెట్టి బీదాబిక్కీ అందరికీ గంజి పోస్తున్నారు" చెప్పాడు నాగన్న.

"ఇదంతా ఎందుకు చెప్తున్నావు? ఇక్కడా పరిస్థితి అలాగే ఉంది. చాలా మంది పొలాలు బీడు పెట్టారు. మీ చిన్నాన్న లంక పొలాల్లో కూరగాయలు పండిస్తున్నాడు. మనికిక్కడ బాగానే ఉంది. ప్రతి ఏడూ వానలు పడకుండా ఉంటాయేమిటి? "

"వానలు పడినా ఎంత పండుతుంది చెప్పు? ఏదో కూటికీ, గుడ్డకీ అంతే కదా!"

"ఎందుకు ఇలా మాట్లాడుతున్నావో తెలియడంలేదురా? "

"వచ్చే ఏడు కూడా వానలు పడలేదనుకో లంకలో కూడా పంటలు పండవు కదా"

"ఎందుకా అశుభం మాటలు? వచ్చే ఏడు వానలు పడతాయి!"

"లేదమ్మా! ఇంకో నాలుగేళ్ళదాకా పడవుట. చెన్నపట్నంలో వానలెప్పుడు పడతాయో, ఎంత పడతాయో చెప్పేవారున్నారు.

"చెన్నపట్నమెందుకు? ప్రతి ఉగాదికీ పిఠాపురంలో పాదగయ దగ్గర శాస్త్రులు గారు చెప్తారు"

"అయ్యో! అలా కాదమ్మా! తెల్లదొరలు అన్నీ సరిగ్గా లెక్కకట్టి చెప్తారు"

"అయితే ఏమంటావు? "

"ఇంకో నాలుగైదేళ్ళయినా కరువు కాట కాలుంటాయి. చెన్నపట్నంలో కన్నా మంచి కొలువు ఇప్పిస్తానని ఒకాయన నా దగ్గరకు వచ్చి చెప్పాడమ్మా!"

"కాకినాడలోనా? రాజమండ్రంలోనా?

"కాదమ్మా"

"విశాఖపట్నం కలకటేరు దగ్గరా? "

"కాదమ్మా"

"మరి ఎక్కడరా? "

"నువ్వు ఔనంటే వివరంగా చెప్తా"

"ఎక్కడో చెప్పకుండా నేను ఔననీ, కాదనీ ఎలా అనగలనురా? నీ మాటలు వింటూంటే నాకేదో భయంగా ఉంది. నిన్ను వదిలి ఉండలేనురా నాగన్నా"

నాగన్నకు ఎలా చెప్పాలో తెలియలేదు. అతనికి తల్లి అంటే విపరీతమైన ప్రేమ. తల్లిని సుఖపెట్టాలనీ, అమ్మ కాయకష్టం చెయ్యకూడదనీ అతని కోరిక. కొన్నాళ్ళు అమ్మను వదిలిపెట్టి చెన్నపట్నంలో ఉంటే బాగా డబ్బు సంపాదించి పొలం కొని అమ్మకింద నౌకర్లూ, దాసీలూ ఉండేలా చెయ్యొచ్చనుకున్నాడు. యజమాని కోటలో కొలువు మానెయ్యడం, కరువు కాటకాలు రావడంతో అనుకున్నంతగా డబ్బు వెనకెయ్యలేకపోయాడు. మంచి కొలువు ఇప్పిస్తానన్న మనిషి చెప్పిన మాటను కాదనడం ఎలా?

నాగన్న చిన్నాన్న వైపు చూశాడు. రామయ్యకు వివరాలన్నీ చెప్పాడు కాబట్టి చిన్నాన్న తన తల్లిని ఒప్పించి కొత్త కొలువుకు అంగీకరించేలా చెప్తాడని నాగన్నకు గట్టి నమ్మకం. ఇదివరలో అమ్మను అంగీకరింపచేసి చెన్నపట్నం తీసికెళ్ళాడుకదా!

రామయ్య అయోమయ పరిస్థితిలో ఉన్నాడు. వదినగారిని ఎలాగోలా అవుననేలా చేసి చెన్నపట్నానికి నాగన్నను తీసికెళ్ళాడన్నమాట వాస్తవమే. తను కూడా ఉన్నాడు కాబట్టి ఆవిడ కొడుకుని పంపించింది. అదీగాక చెన్నపట్నం తెలియని ఊరుకాదు. నెలా, నెలన్నరలో నడిచి వెళ్ళిపోవచ్చును. ఉప్పాడ, కాకినాడ, విశాఖపట్నం, విజయనగరం, బరంపురం మొదలైన ఊళ్ళనుంచి ఎందరో బోయీలు వెడుతూనే ఉంటారు. ఇప్పుడు దేశంకాని దేశం, పేరైనా తెలియని దేశం, మన వాళ్ళెవరూ వెళ్ళని దేశం.. నాగన్న ఓడమీద వెడతానంటే వదిన ఎప్పటికీ ఒప్పుకోదు. తను ఆమెను ఒప్పించలేడు. సంద్రంమీద చేపల వేటకే పంపనిది ఓడమీద వేరే దేశం పంపుతుందా?

చిన్నాన్న ఏమీ మాట్లాడకపోవడంతో నాగన్న తన బావగారివైపు చూశాడు. నరసయ్య పక్కన ఉన్నప్పుడే కొత్త కొలువు గురించిన వివరాలు తెలిశాయి. నరసయ్య కూడా పొలంపనికి ఇష్టపడలేదు. అలాగని నాగన్నను వెళ్ళవద్దని అడ్డుచెప్పలేదు. తన తల్లితో మాట్లాడి బావగారు ఒప్పించగలడని నాగన్న అనుకున్నాడు. ఇంటి అల్లుడి మాటను ఏ అత్తగారూ కాదనలేదు కదా!

నరసయ్య నోరు విప్పలేకపోయాడు. నాగన్న చేరుదామనుకుంటున్న కొత్త కొలువుమీద అతనికి సంపూర్ణమైన విశ్వాసం లేదు సరికదా భయం కూడా ఉంది. ఇక్కడ ఉన్న యజమానుల్లా అక్కడ వాళ్ళు జీతాలు సరిగ్గా ఇస్తారా? మన వాళ్ళ దగ్గర పనిచెయ్యడం సులువు. తెల్లదొరల దగ్గర పనిచెయ్యడం కష్టం. అందులోనూ ఆ తెల్లదొరలు కూడా ఇంగిలీషు వారు కాదుట. పరాసు వాళ్ళుట. దేశం

ఇంగిలీషు వారిదే కానీ తోటలన్నీ పరాసు వారివట. ఇంగిలీషువారికీ, పరాసువారికీ ఎప్పుడూ యుద్ధాలేనని చెన్నపట్నంలో ఒక బొట్లేరు తనతో చెప్పాడు. ఆ బొట్లేరుకి మహాపొగరు. తను తెల్లదొరల దగ్గరపని చేస్తున్నందుకు తను తెల్లదొరలంత గొప్ప వాణ్ణి అనుకుంటాడు. సీమరాజుగారిక యినా గర్వం ఉందో లేదో కానీ వీడికి మహాగీర. తను కూడా ఏ తెల్లదొర దగ్గ రైనా నౌకరీ సంపాదించి వీడి బీరమణ చాలి.. నరసయ్య ఆలోచనలు ఇంటి దగ్గ రి ఇంగ్లీషువారి బట్లర్ మీదకుపోయాయి.

చిన్నాన్న కానీ, బావగారు కానీ మాట్లా డకపోడంతో తల్లిని ఒప్పించే బాధ్యత తన మీదే ఉందనుకున్నాడు నాగన్న.

"అమ్మా! మనం తెల్లదొరల పాలనలో ఉన్నామా? "

"అవును ఇది వరకు అయిదరాబాదు జ మానాలో..."

"అవునా! మనరాజుగారు సీమలో ఉంటారు. సీమకు వెళ్ళాలంటే ఓడనెక్కి వెళ్ళాలి. అక్కడ రాజుగారూ, రాణీగారూ ఉంటారు. అక్కడ చాలా చలిగా ఉంటుం దట. ఇళ్ళూ, వీధులూ అంతా మంచు ముక్కలతో నిండిపోతుందట. ఆ మంచు ముక్కల్ని ఓడలలో తెచ్చి ఇక్కడ పేద్ద మేడలో దాచుకుంటారు. ఆ మేడను అయిసు హవుజు అని అంటారు"

కొడుకు చెప్పిన వింతలు వింటూ పుల్లమ్మ "అమ్మో! నీకెన్ని సంగతులు తెలు సురా నాగన్నా" అని మురిసిపోయింది.

"వింటున్నావా? దొరలంటే ఎంత గొప్ప వాళ్ళనుకున్నావు? ఇక్కడ మన చప్ప న్నారు దేశాలన్నిటికీ సీమరాజుగారే రాజు గారు. అంతేకాదు లంకకీ ఆయనే రాజుగా రు. లంకని దొరలు సిలోను అంటారు"

"లంకంటే రావణాసురుడి లంకేనా? " అని అడిగింది పుల్లమ్మ.

నాగన్న అవునన్నాడు. పుల్లమ్మ "అబ్బో దొరలు చాలా గొప్పవాళ్ళు" అంది.

"అవును కదా! దొరలెంత గొప్పవాళ్ళంటే మన చప్పన్నారు దేశాలకే రాజులు, లంకకి రాజులు, మారిషస్సు అని ఇంకో లంక ఉంది దానికీ సీమరాజుగారే రాజు"

"రావణాసురుడి లంక కాకుండా మారీ చుడి లంక ఇంకొకటి ఉందా" అంది పుల్లమ్మ.

"మారీచుడు కాదు మారిషస్సు"

"సరే ఏదో ఒకటి. అవునుకానీ నాగన్నా రాములవారు వంతెన కట్టినట్లుగా దొరలూ వంతెన కట్టేరా? "

"దొరలు ఓడలో వెడతారు. సీమ నుంచి ఓడల్లో వచ్చినట్లే లంకకీ ఓడలోనే వెడతారు"

"గొప్ప విషయమే. అవును కానీ నాగ న్నా, ఇన్ని విషయాలు ఎలా తెలుసుకు న్నావు? "

"మా యజమాని కొన్ని చెప్పారు. చెన్న పట్నంలో ఉంటే అన్నీ తెలుస్తాయి"

"మారీచుడి లంక గురించి కూడా మీ అయ్యగారే చెప్పారా? "

"లేదు. మారిషస్సు అనకుండా మారీచు డేమిటి? మారిషస్సులో చెరుకు తోటలు ఉన్నాయట! పంచదార తయారుచేసే మర లున్నాయిట!"

"పంచదారను మరలో చెయ్యడమే మిటి? " ఆశ్చర్యపోయింది పుల్లమ్మ.

"అది అంతేలే. దొరలు నూనె తియ్యడా నికి మనలా గానుగాడరు. దానికీ మరలే. బట్టలు నెయ్యడానికీ మరలే. నీళ్ళు తోడడా నికీ మరలే. ఏమనుకున్నావు? "

"అమ్మ బాబోయ్! అన్నీ మరలే"

"అవును అంతే. ఇప్పుడు మారిషస్సులో చెరుకు తోటల్లో పనిచెయ్యడానికి మను షులు కావాలిట. దొరలు కదా నెలకు తొమ్మిది రూపాయల జీతమిచ్చి తీసికెడ తామన్నారు. ఇక్కడ నుంచి ఎవరెవరు వస్తామంటారో కనుక్కోడానికి మనుషుల్ని

కొలువులో పెట్టుకున్నారు. అలాంటి మనిషి ఒకడు నన్ను 'వస్తావా?' అని అడిగాడు. మా అమ్మనడిగి చెప్తానన్నాను"

అమ్మను ఒప్పించి వస్తాను అన్నది నాగన్న మనస్సులో మాట. పైకి అన్నమాట మాత్రం వేరు. అమ్మనడిగి ఆమె ఒప్పుకుంటే వస్తానని పైకి అన్నాడు, కానీ ఎలాగైనా ఒప్పించాలన్నది అతని ఉద్దేశ్యం.

పుల్లమ్మ గుండె గుభిల్లుమంది. ఇదేమిటి కొడుకు ఎక్కడో ఉన్న మారీచుడి లంకకి వెడతానంటున్నాడు. వద్దంటే మానేస్తాడా? మానేసి ప్రతిక్షణమూ తనని కోపగించుకుంటూ ఉండడా? తను వాణ్ణి వదిలి ఉండలేదని వాడికి తెలియదా? కన్నతల్లి మనస్సుని కన్న కొడుకే గ్రహించకపోతే ఎలా? తల్లికి పిల్లల మీదున్న ప్రేమ పిల్లలకు తల్లిమీద ఉండదా?

తన మనస్సులోని ఆలోచనా ప్రవాహానికి అడ్డుకట్ట వేస్తూ పుల్లమ్మ "ఇక్కడ నుంచి నిన్ను తీసికెళ్ళడమెందుకు? అక్కడ పనివాళ్ళు లేరా?" అని అడిగింది.

ఈ ప్రశ్నకు నాగన్నకు జవాబు తెలియదు. ఎక్కడో దూరాన మారిషస్ అనే ద్వీపముందనీ, అక్కడ చెరుకు తోటలో పనిచేస్తే నెలకు తొమ్మిది రూపాయలిస్తారనీ, అయిదేళ్ళపాటు అక్కడే ఉండి పని చెయ్యాలనీ మాత్రమే అతనికి తెలుసు. మారిషస్ ద్వీపం ఫ్రెంచి వారి అధీనంలో ఉండేదనీ, ఫ్రెంచి తోట యజమానులు ఆఫ్రికా ఖండం నుంచి నల్లజాతి బానిసలను తెచ్చి గొడ్డు చాకిరీ చేయించుకునేవారనీ అతనికి తెలియదు. మారిషస్ కూడా ఆఫ్రికా ఖండంలోనే ఉందని అతనికి తెలియదు. ఆ మాటకొస్తే ఆఫ్రికా అన్న ఖండముందనే తెలియదు.

ఫ్రెంచివారి నుంచి ఇంగ్లండు మారిషస్ని కైవసం చేసుకుందనీ, బానిసత్వ వ్యవస్థను నిర్మూలన చేసిందనీ, ఫ్రెంచి తోట యజమానులకు రెండు మిలియన్ల పౌండ్లు నష్టపరిహారమిచ్చిందనీ, వారివద్ద పని చెయ్యడానికి ఇండియానుంచి కార్మికులను రవాణా చేస్తోందనీ నాగన్నకు తెలియదు.

అతనికి తెలిసిందొకటే. మారిషస్లోని చెరుకు తోటల్లో పనిచేస్తే నెలకు తొమ్మిది రూపాయల జీతమిస్తారు. అక్కడకు వెళ్ళడానికి ఓడకి కేవు కూడా దొరలే పెట్టుకుంటారు. తనూ, భార్యా ఇద్దరూ పనిచేస్తే నెలకు పద్దెనిమిది రూపాయలు సంపాదించవచ్చు. ఖర్చులు పోనూ నెలకి పదిహేను రూపాయలైనా మిగుల్తాయి. ఉప్పాడకు తిరిగివచ్చి ఇరవై ఎకరాల భూమి అయినా కొనుక్కోవచ్చు.

మారిషస్ గురించి నాగన్నకు ఏమీ తెలి

## శరీరం బరువు కాదా?

ఒక సభలో ప్రసంగించేందుకు వెళుతున్న విద్యాసాగర్ తనతోపాటు వచ్చిన ఓ యువ అధికారి సూట్‌కేసును మోసేందుకు కూలీవాడి కోసం గట్టిగా కేకవేయడం గమనించారు. వెంటనే అతనితో 'ఈ చిన్న పెట్టెకోసం కూలీ



వాడు ఎందుకండీ? మీరే తీసుకెళ్లవచ్చు కదా?' అని అన్నారు విద్యాసాగర్.

దానికా అధికారి 'నేను చదువుకున్నవాడిని. బరువులు మోయడం నా హోదాకు, గౌరవానికి భంగం కాదా?' అన్నాడు గర్వంగా.

'నిజమైన చదువు మనిషిలో నమ్రతను వృద్ధి చేస్తుందేకానీ బడాయిని పెంచదు. ఈ చిన్ని సూట్‌కేసును పట్టుకునేందుకే ఇంతలా ఆలోచించేవాడివి.. నీ శరీరాన్ని ఎలా మోసుకెళతావు? అది కూడా నీకు బరువు అనిపించట్లేదా?' అని సున్నితంగా విమర్శించారు.

ఏం చెప్పాలో తోచక నిరుత్తరుడయ్యాడా యువ అధికారి.

యదు. అక్కడ దొరలు పనివాళ్ళను ఎలా చూసుకుంటారో తెలియదు. నెలకి పది హేను రూపాయలు మిగుల్చుకోవచ్చునా? అన్నది అంతకన్నా తెలియదు. తెలిసిందొ కటే డబ్బు సంపాదించాలి, మిగుల్చుకో వాలి. తిరగి వచ్చి భూమి కొనాలి. అమ్మను సుఖపెట్టాలి.

పుల్లమ్మ మళ్ళీ అడిగింది "ఇక్కడ నుంచి నిన్ను తీసికెళ్ళడమెందుకు? అక్కడ పని వాళ్ళు లేరా?"

నాగన్న "ఉండే ఉంటారు! కానీ ఇక్కడ పనివాళ్ళంత బాగా పని చెయ్యలేరేమో? ఉప్పాడ బోయీలంత బాగా ఎవ్వరూ పల్లకీ మొయ్యలేరని మా యజమాని

> **కొత్తగాలి...**
>
> **కష్టసుఖాలు**
> **మనసుని అనుసరిస్తాయి**
> **ఆత్మను మాత్రం కాదు!**
>
> **– ఆర్.ఎస్. హైమవతి,**
> **చెన్నై**

ఎప్పుడూ అంటూంటారు" అన్నాడు.

"నిన్ను వదిలి ఉండలేనురా. లేకలేక కలిగిన సంతానం నువ్వు. పుట్టకి మొక్కీ, చెట్టుకి మొక్కీ, కడుపు పండితే చాలను కుని కన్నానురా. చెన్నపట్నమయితే పోనీ అని సరిపెట్టుకున్నాను. ఇక్కడ భూమి కొంటానంటున్నావు. చిన్నాన్నలా ఆ భూ మి సాగు చేసుకుంటూ ఇక్కడే ఉండిపో"

"అది కాదమ్మా. ఈ కరువుకాలంలో.." అంటూ నాగన్న ఏదో చెప్పబోయాడు.

రామయ్య కల్పించుకుని "నాగన్నా! ఊరుకో! అమ్మకు హఠాత్తుగా ఇలాంటి విషయాలు చెప్తే తట్టుకోలేదు. కొన్నాళ్ళ పాటు ఇలాంటి విషయాలు మాట్లాడకు" అన్నాడు.

నాగన్నతో మాట్లాడి ఎక్కడో ఉన్న దూరదేశం వెళ్ళకుండా మరిది ఆపుతా డని పుల్లమ్మ ఆశ పెట్టుకుంది.

★ ★ ★

వారం గడించింది. నాగన్న రోజూ చిన్నాన్నతో పొలానికి వెళ్ళి వస్తున్నాడు. పొలానికి పక్కనే ఉన్న పొలం కొనే విష యంలో బేరాలు కూడా జరుగుతున్నాయి. ఇంక కొడుకు ఇక్కడే ఉండి పోతాడని పుల్లమ్మ అనుకుంది.

ఓరోజు ఉదయమే నరసయ్య "అత్తమ్మా, విజీనగరం వెళ్ళి మా అమ్మనీ, నాన్ననీ చూసి వస్తాం. నేనూ, నాగమ్మా రేపు ఉదయమే బయల్దేరతాం. వాళ్ళని చూసివచ్చాక ఉప్పాడలో నాలుగు రోజు లుండి చెన్నపట్నం వెడతాం" అన్నాడు.

పుల్లమ్మ సరేనంది.

"అమ్మా! నేనూ, మల్లమ్మా కూడా ఓసారి ఆలమంద వెళ్ళి మా అత్తమామల్ని చూసి వస్తాం" అన్నాడు.

"నువ్వెందుకురా? దాన్ని పంపించు" అంది పుల్లమ్మ.

"అదేమిటమ్మా! అలా అంటున్నావు? ఓసారి వెళ్ళి వస్తాను. వారం మాత్రమే ఉంటానక్కడ"

"నాగన్నా! నిన్ను వదిలి ఉండలేను. ఎప్పుడూ నా దగ్గరే ఉండిపో. నీ చేతిలోనే నా ప్రాణం పోవాలి"

"అమ్మా! చావు గురించి మాట్లాడకు. నువ్వు కాక నాకు ఇంకెవరున్నారు?"

"మరయితే నన్ను వదిలి ఎక్కడకూ వెళ్ళకు"

"ఎక్కువ రోజులు ఉండను.." అంటూ న్న నాగన్నను అడ్డుకుని రామయ్య "నాగన్నా! అమ్మ చెప్పిన మాట విను. మల్లమ్మను పంపించు. ఓ నెలరోజులుండి వస్తుంది" అన్నాడు.

★ ★ ★

భార్యా, చెల్లెలూ, బావగారూ వెళ్ళినరోజు మధ్యాహ్నం నాగన్న తల్లితో మళ్ళీ తన కొత్త కొలువు గురించి మాట్లాడాడు. భోజనానికి పల్చని రాగిజావ చేసింది పుల్లమ్మ.

"కొంచెం చింతపండు పచ్చడి వెయ్యి అమ్మా" అన్నాడు నాగన్న.

"అయిపోయింది నాగన్నా. నంజుకుందుకు ఏమీ పెట్టలేక పోతున్నందుకు ఎంతగా కుమిలి పోతున్నానో నీకు తెలియదు. అడవిలో కట్టెలు కొట్టినా కాకినాడలో అమ్ముడుపోవంలేదు. ఇళ్లాళ్ళందరూ వంటలే చేసుకోడం లేదు, కట్టెలేం చేసుకుంటాం అంటున్నారు. చిన్నాన్న కూరలు అమ్మలేకపోతే వాటినే ఉడకపెట్టుకు తింటున్నాం. ఇంటికి అల్లుడొచ్చాడు కదాని ఈ వారమూ అంగట్లో అప్పుచేసి వంట చేశాను"

"అందుకే కదా నేను ఎక్కడో అక్కడ కష్టపడి సంపాదించాలనుకుంటున్నాను. పల్లెటూళ్ళోనే ఉంటావు కనుక నీకు కష్టాలు తెలియవు. ఉడకబెట్టుకు తినడానికి నీకు కూరలైనా ఉన్నాయి. చెన్నపట్నం నుంచి వస్తున్నప్పుడు దారిలో చూశాను. మట్టి నీళ్ళలో కలుపుకుని, ఆ నీళ్ళు వడపోసుకుని తాగి ప్రాణం నిలుపుకుంటున్నారు. పట్నంలో ఫరవాలేదు. దొరలు గంజిదొడ్లు పెట్టి బీదాబిక్కీని కాపాడుతున్నారు. నేను కొందామనుకుంటున్న పొలం కూడా పండించలేక ఆ రైతు చవగ్గా అమ్మేస్తున్నాడు"

"చవగ్గానే భూమి దొరుకుతోందిగా. ఇప్పుడే కొంటే మంచిది. వచ్చే ఏడాది వానలు బాగా పడితే పంట మీద చాలా లాభం గడించవచ్చు"

"వాన పడకపోతే ఏం చెయ్యాలి? నాలుగైదేళ్ళ దాకా పడవని చెన్నపట్నంలో చెప్పారని చెప్పాను కదా. చెన్నపట్నంలో మా అయ్యగారి దగ్గర దాచుకున్న డబ్బుంది కాబట్టి పొలం కొంటున్నాను"

"పొలం కొనేది సాగుబడి చెయ్యడానికా? బీడు పెట్టడానికా? "

"వానలు పడితే చిన్నాన్న సాగు చేస్తానన్నాడు. ఫలసాయం నీకే ఇస్తానన్నాడు. నువ్వింక కట్టెలు కొట్టడం, మోపులు కట్టి ఊరూరా తిరిగి అమ్మడం చెయ్యొద్దమ్మా! నువ్వు కష్టపడకూడదు. అదే నా కోరిక"

"నిన్ను వదిలి ఉండడం కన్నా కష్టమేముంటుందిరా నా బంగారు తండ్రీ"

"నిన్ను వదిలి ఉండడం నాకు మాత్రం ఇష్టమా? చెప్పు"

"మరైతే ఇక్కడ ఉప్పాడలో ఉండిపోతేనా? వ్యవసాయపు పనులున్నప్పుడు అందరం పొలంలోనే ఉందాం. లేకుంటే ఇక్కడుందాం. నీకూ పిల్లాపాపా కలిగితే వాళ్ళతో నేనుంటాను. నువ్వూ మల్లమ్మా పొలం పనులు చేద్దురు గానీ"

"అలా కాదమ్మా"

"ఎలా కాదురా. ఇంకేం మాట్లాడకు"

"వానలు పడితేనే కదా వ్యవసాయం చెయ్యగలిగేది? "

"అదే నేనూ అడుగుతున్నా వానలు పడకపోతే మారీచుడి లంకలో చెరకు మాత్రం ఎలా వేస్తారు? అసలే చెరకుకి నీళ్ళెక్కువ కావాలి. వాళ్ళకే పంట లేకపోతే నీకు జీతమెలా ఇస్తారు? "

ఈ ప్రశ్నతో కొడుకు ప్రయాణాన్ని ఆపగలననుకుంది పుల్లమ్మ. ప్రయాణం మాటేమో కానీ ప్రశ్నకు సమాధానం తెలియక నాగన్న సంభాషణను మాత్రం ఆపేశాడు.

పుల్లమ్మ కనుబొమలెగరేసి, నవ్వి, గుడిసెలోకి వెళ్ళిపోయింది. నాగన్న ఆలోచిస్తూ నులక మంచం మీద నడుం వాల్చాడు.

★ ★ ★

"అమ్మా, మొన్న నువ్వు నన్ను ఒక విషయం అడిగావు గుర్తుందా? ఆ విషయమే రెండు రోజులుగా ఆలోచిస్తున్నా"

"నిన్ను నేనడిగేది ఒక్క విషయమే

కదురా నాగన్నా. ఎప్పుడూ నా కళ్ళ ఎదుటే ఉండు. ఇంక మీదట ఎక్కడికీ వెళ్ళకు"

"ఆ విషయం కాదు. మారిషస్సులో వానలు పడకపోతే చెరకు ఎలా పండి స్తారు? నీకు జీతమెలా ఇస్తారు? అని అడిగావు. మనకిక్కడ వానలు పడకపోతే అక్కడ వానలు పడవని ఎలా చెప్తాం? మనకు శ్రావణంలో వానలు కురుస్తా యా? మరి చెన్నపట్నంలో పుష్యంలోనూ, మాఘంలోనూ కురుస్తాయి తెలుసా? అలాగే మారిషస్సులో వేసవిలో వానలు కురుస్తాయేమో మనకేం తెలుసు? "

"ఎప్పుడు వానలు కురుస్తాయో కూడా తెలియని చోటకి ఎలా వెడతావురా నా తండ్రీ"

"మరి చెన్నపట్నం పెళ్ళి నాలుగేళ్ళు న్నాను కదా"

"చెన్నపట్నమంటే చిన్నాన్నతో పంపిం చాను కాబట్టి ధైర్యంగా ఉన్నాను. ఉప్పాడ బోయీలు ఎప్పటినుంచో చెన్నపట్నం వెడుతూనే ఉన్నారు"

"ఇప్పుడు కొందరు ఉప్పాడ బోయీలు మారిషస్సు కూడా వస్తున్నారు. ఇంకేమిటి నీకు భయం? "

"పోనీ చెన్నపట్నంలోనే కొలువు చెయ్య రాదా మీ యజమాని మంచి వారంటు న్నావు కదా? "

"మంచివారే కానీ ఆయనే కోటలో కొలువు మానుకున్నారు. పొలంలో పనిచె య్యమన్నారు. నెలకు అయిదు రూపా యలే ఇస్తున్నారు. అక్కడయితే తొమ్మిది రూపాయలు. మల్లి కూడా పనిచేస్తానంది. నెలకి పద్దెనిమిది రూపాయలు. అయిదే ళ్ళలో ఎంత మిగుల్చుకోవచ్చో చూడు. ఇక్కడకొచ్చాక పెద్ద భూకామందు అయి పోవచ్చు"

"అమ్మబాబోయ్! అయిదేళ్ళే! అంతకాలం నిన్ను చూడకుండా బతకగలనా? " అం టూ పుల్లమ్మ ఏడవసాగింది.

నాగన్నకు ఏం చెయ్యాలో, తల్లిని ఎలా ఓదార్చాలో తెలియలేదు

★ ★ ★

అప్పుడప్పుడూ నాగన్న మారిషస్ ప్రయాణం గురించి మాట్లాడడం, పుల్లమ్మ కాదంటూ ఉండడం, వాగ్వివాదాలూ, పుల్ల మ్మ ఏడుపులుగా నెల గడిచింది. నరస య్యా, నాగమ్మ పిఠాపురం వచ్చారనీ, పాద గయలో ఒకరాత్రి నిద్రచేసి మర్నాటికి ఉ ప్పాడ వస్తారనీ కుర్రాడు వార్త తెచ్చాడు.

ఆనాడు సాయంత్రం రామయ్య పుల్ల మ్మను సముద్రతీరానికి తీసికెళ్ళాడు. అక్క డయితే ప్రశాంతంగా ఏ విధమైన ఆటం కాలూ లేకుండా మాట్లాడుకోవచ్చని అతని ఉద్దేశ్యం.

"వదినా, నాగన్న విషయం ఏమిటాలో చించావు? "

"ఆలోచించడానికేముంది మరిదీ! ఇక్క డ భూమి కొనుగోలుకి రాతకోతలైపో యాయి కదా. నీతోపాటే వ్యవసాయం చేసుకుంటూ ఉంటాడు"

"నాగన్న అలా అనుకోవడం లేదే. మారి షస్సు వెళ్ళి బాగా సంపాదించుకుని రావా లని వాడికుంది. ఇక్కడ వ్యవసాయం కూడా అంత గిట్టుబాటు కావడం లేదు. నువ్వూ చూస్తున్నావుగా, వెళ్ళనిస్తేనే మంచిదేమో, ఆలోచించు"

"మరిదీ! నా మనస్సు తెలిసే అంటు న్నావా? కొడుకుని వదిలి ఉండగలనా? ఏదో పని చేసుకుంటూ కలోగంజో కలిసి తాగడం సుఖం కాదా? "

"వదినా! తల్లిప్రాణం నీకు అలాగే అన్పి స్తుంది. వాడికి బాగా సంపాదించాలనీ, అమ్మను సుఖపెట్టాలనీ ఉంటుంది. వాడు కళ్ళెదుట ఉండడమే నాకు సుఖం అని అనకు. జావలోకి చింతపచ్చడైనా లేకుండా తింటున్నాం. జావకూడా లేనినాడు ఏ కూరలో ఉడకపెట్టుకుంటున్నాం. మట్టి

నీళ్ళు తాగే రోజులు మనకీ వస్తా యేమో? పిల్లల్ని ప్రేమించడమంటే వాళ్ళ సుఖసంతోషాలకి అడ్డుపడడం కాదు"

"మరిదీ! మరీ అంత కరుగ్గా మాట్లాడ కయ్యా!" అంది పుల్లమ్మ రుద్ధమైన కంఠంతో.

"అలా కాదు వదినా. ఒక్కసారి ఆలో చించు. ఇక్కడేముందని వాణ్ణి ఉండిపో మ్మనగలం? ఎటుచూసినా కరువూ, కాటకం. అయిదేళ్ళ తర్వాత వచ్చేస్తాడుగా. అప్పుడింక నీ కళ్ళెదుటే ఉంటాడు"

పుల్లమ్మ ఆలోచనలో పడింది.

★ ★ ★

మర్నాడు ఉదయమే నాగమ్మ, నర సయ్య పిఠాపురం నుంచి తిరిగి వచ్చారు.

"అదేమిటి మల్లమ్మ రాలేదా?" అంది పుల్లమ్మ.

"వాళ్ళ అమ్మా, నాన్నా తీసుకొచ్చి దిగపె డతామన్నారు" అంది నాగమ్మ.

పుల్లమ్మ సామాన్ల కోసం అంగడికి బయల్దేరుతుంటే నరసయ్య "అత్తమ్మా! నేనూ వస్తాను" అంటూ లేచాడు.

"నువ్వెందుకయ్యా అల్లుడూ" అంది పుల్లమ్మ.

"ఫరవాలేదు" అంటూ నరసయ్య ఆమెతో బయల్దేరాడు. దారిమధ్యలో రావి చెట్టు కింద బాటసారులు కూచుందుకెవరో పుణ్యాత్ములు కట్టించిన అరుగులు ఉన్నా యి. ఒక్క క్షణం కూచుని వెడదామన్నాడు నరసయ్య. పుల్లమ్మ తటపటాయిస్తూ కూచుంది. రెండు క్షణాలయ్యాక ఆమె "అల్లుడూ! విజీనగరం నుంచి నడిచి నడిచి అలసిపోయి ఉంటావు. ఇక్కడ కూచో. నేను సరుకులు తీసుకొస్తా" అంది.

"అత్తమ్మా! అంగడికి నేను రావడం ఇష్టం లేదు కదూ!"

"అబ్బెబ్బె! అలా ఏం లేదు. కలిసే వెడదాం"

"అత్తమ్మా! నిజం చెప్పు. అంగట్లో అరు వు పెట్టి సరుకులు తెస్తున్నావు కదూ! నాగ న్నకి ఈ విషయం తెలుసా?"

"నాగన్నకి తెలుసు. యజమాని వాడి డబ్బుకి కాకినాడ వర్తకుడికి ధర్మహుండీ ఇచ్చాడు. పొలం కొనుగోలుకే కానీ ఆ డబ్బు ముట్టుకోవద్దని చెప్పాను"

"అరువు పెట్టి తెస్తున్నావు, ఎలా తీరు ద్దామనుకుంటున్నావు? అసలు అరువు పెట్టి తెచ్చే అవసరమేమిటి? అల్లుడొచ్చా డని అన్ని వంటలు చెయ్యాలా? నీకు నేనొకటీ, నాగన్న ఒకటీ కాదు. నేనూ నీ కొడుకులాంటివాణ్ణే"

"అల్లుడూ" అంది పుల్లమ్మ. గొంతు డగ్గుత్తికతో ఆమెకు మరోమాట రాలేదు.

"దేశమంతా కరువే అత్తమ్మా! మా అయ్యగారిది వడ్డీ వ్యాపారం కాబట్టి నాకు జీవనం గడుస్తోంది. ఇంకో రెండేళ్ళుపోతే అమ్మనీ, నాన్ననీ చెన్నపట్నం తీసికెళ్ళి పోతా! వ్యవసాయం ఏమాత్రం గిట్టుబాటు కావడం లేదు"

"నాగన్న పొలం కొనేశాడు. రాతకోత లయిపోయాయి. ఇంక డబ్బు ఇవ్వడం, కాకినాడ కలకటేరు నుంచి కాగితం తెచ్చు కోడమే మిగిలుంది"

"పొలం విషయాలు మీ మరిది చూసు కుంటాడులే. నాగన్న మారిషస్సులో కొలు వుకి వెళ్ళినా ఫరవాలేదు"

"అదేమిటి అల్లుడూ? నువ్వు కూడా

**కొత్తగాలి...** 

**పసిపాప నవ్వు**
**సరిగమల సంకేతం**
**ముసలితనపు నవ్వు**
**అనుభవాల సందేశం!**

– సి. కామేశ్వరరావు,
కాశీబుగ్గ

అలాగే అంటున్నావు?" అంది పుల్లమ్మ భయకంపిత స్వరంతో.

"ఇంకెలా అనమంటావు అత్తమ్మా! ఒక్కసారి ఆలోచించు. దేశమంతా కరువూ, కాటకం. ఇలాంటి సమయంలో నాగన్న ఏం పండిస్తాడు? ఎంత అమ్మగలు గుతాడు? పోనీ చెన్నపట్నంలోనే ఉండ మందామంటే వాళ్ళ యజమాని కోటలో కొలువు మానేశారాయె. తిండి గడవాలా? అన్నిటి ధరలూ పెరిగిపోయాయి. ఆ దేశంలో నెలకి తొమ్మిది రూపాయలు ఇస్తామంటున్నారు. నువ్వు ఔనంటే వాడు సంతోషంగా వెడతాడు. కాదంటే ఇక్కడ ఏడుస్తూ పడి ఉంటాడు. పిల్లలు దగ్గర లేకుండా ఉండలేనంటే మాతో చెన్నపట్నం వచ్చెయ్యి"

నరసయ్య అనేక విధాలుగా అత్తగారికి నచ్చచెప్పాడు. ఒకవైపు అల్లుడూ, మరిదీ నచ్చచెప్పడం, మరోవైపు నాగన్న వేడుకోళ్ళూ. చివరకు నాగన్నను దూరదేశానికి పంపడానికి పుల్లమ్మ అవుననక తప్పలేదు.

★ ★ ★

నాగన్న మారిషస్ వెళ్ళేరోజు దగ్గరపడుతోంది. పుల్లమ్మకు క్షణం తీరికలేదు. చింతపండు పచ్చడీ, మామిడికాయ తొక్కు, కందిపొడీ, మినుములతో చింతకాయప చ్చడీ వంటివెన్నో చేసేస్తోంది. మామిడి పళ్ళ తాండ్ర చేస్తోంది. వడియాలూ, అప్పడాలూ ఎండబెడుతోంది. లచ్చమ్మా, నాగమ్మా సాయం చెయ్యబోయినా దగ్గరకు రానివ్వడం లేదు. వాడికి నచ్చినట్లు చెయ్యడం మీకు రాదని వాళ్ళని దూరంగా ఉంచుతోంది.

నాగన్నకు సందేహం వచ్చింది. "అమ్మా, ఇవన్నీ చెయ్యడానికి డబ్బు ఎక్కడిది?"

"అరువు తెచ్చాను"

"అంత అరువు ఎవరిస్తారు? అవును కానీ నీ కడియాలు, మురుగులూ ఏవీ?"

"పనిచేస్తుంటే అరిగిపోతాయని తీసేశానులేరా"

"కట్టెలు కొట్టినా, వడ్లు దంపినా అరగనివి ఇప్పుడు అరిగిపోతాయా? నిజంగా చెప్పు. ఎక్కడ పెట్టావు?"

పుల్లమ్మ "పని చేస్తుంటే అడ్డురాకు" అంది.

"అమ్మా! వాటిని అమ్మేసి సరుకులు తెచ్చావు కదూ! ఎంత ప్రేమమ్మా నా మీద" అంటూ నాగన్న ఆమె చేతులు పట్టుకుని "త్వరలో నీకు బంగారు మురుగులు చేయిస్తాను. నన్ను దీవించు" అన్నాడు.

"నువ్వు నా దగ్గరుంటే చాలు. ఇంకేం వద్దురా నాగన్నా" అంది పుల్లమ్మ.

★ ★ ★

నాగన్న మారిషస్ వెళ్ళే రోజు దగ్గరపడింది. మల్లమ్మను తీసుకుని ఆమె తల్లి తండ్రులూ, అన్నదమ్ములూ ఉప్పాడ వచ్చారు. పొలం కొనుగోలులో మిగిలిన డబ్బుతో నాగన్న కాకినాడ వెళ్ళి కొన్ని పుస్తకాలు తెచ్చుకున్నాడు.

"ఏమిటవి?" అని పుల్లమ్మ అడిగింది.

"రామాయణం, భారతం, నరసింహశతకం, ఎడ్లరామదాసు శతకం, వేమన శతకం" అంటూ పుస్తకాల పేర్లు వరసగా చెప్పాడు. చెన్నపట్నంలో అయ్యగారు చదువు చెప్పించారన్నాడు.

"నాకవన్నీ చదివి విన్పించకుండా వెళ్ళిపోతున్నావు" అంది పుల్లమ్మ.

"అయిదేళ్ళల్లో వచ్చేస్తానుగా! వచ్చిన వెంటనే చదివి వినిపిస్తాను" అన్నాడు నాగన్న.

'అయిదేళ్ళంటే అయిదు గడియలా!' అని అనుకుంది కానీ అనలేదు పుల్లమ్మ.

★ ★ ★

కోరంగి రేవుకి ఉప్పాడ ఊరు ఊరంతా కదలింది. నాగన్న మాత్రమే కాకుండా ఇంకా కొందరు మారిషస్ వెడుతున్నారు. తన బెంగలో తానున్నా పుల్లమ్మ ఆ రోజు

దాకా ఎవరి గురించీ తెలుసుకునే ప్రయత్నం చెయ్యలేదు. వెడుతున్న వారిలో చాలామంది చెన్నపట్నంలో బోయీలుగా పనిచేస్తున్నవారే. 'ఎవరి ముఖంలోనూ బెంగలేదేమిటి? నాకున్న ప్రేమ అందరికీ ఉంటుందేమిటి?' అను కుంది పుల్లమ్మ.

కోరంగి చేరుకునేసరికి రేవు దగ్గర నిల బడ్డానికి కూడా చోటులేదు. అందరూ తలో మూలా పెట్టెలూ, బుట్టలూ, పలు గులూ, పారలూ పెట్టుకుని కూచుని ఉన్నారు. మారిషస్ వెళ్ళడానికి పనివాళ్ళ ను పోగేసిన దుబాసీ ఏజెంట్లు అటూ ఇటూ హడావుడిగా తిరుగుతున్నారు. సముద్రపు ఒడ్డున నాలుగు గుడారాలు న్నాయి. వాటిలో తెల్లజాతివారు కాగితాలు పెట్టుకుని కూచున్నారు.

రామయ్యా, నరసయ్యా అక్కడ కూచున్న మిగతావారితో మాటలు కలి పారు. ఎక్కడెక్కడి నుంచో వచ్చిన తెలు గువారంతా ఒకేచోట గుమికూడడం చెన్న పట్నాన్ని జ్ఞాపకం తెచ్చింది ఇద్దరికీ. గంజాం, ఆలమంద, విశాఖపట్నం, కర్నూ లు, తుని, ఒంగోలు, అయిదరాబాదు, పెనుకొండ ఈ ఊరు ఆ ఊరని లేదు, ఈ ప్రాంతం ఆ ప్రాంతమని లేదు అన్ని చోట్ల నుంచీ కార్మికులు వచ్చి దేశంకాని దేశంలో పని చెయ్యడానికి వెడుతున్నారు. అక్కడెలా ఉంటుందో తెలియదు. ఏ భాష మాట్లాడతారో తెలియదు. యజమా నులెలాంటి వాళ్ళో తెలియదు. పొట్ట చేత్తో పట్టుకు వెడుతున్నారు. నాగన్నను పంపిం చడం మానేద్దామా అని రామయ్యకు ఒక్క క్షణం అన్పించింది. అంతలో తనను తనే తమాయించుకున్నాడు.

"ఇంతమంది వెడుతున్నారు కదా. వీళ్ళని సాగనంపడానికి ఎవరూ రాలేదే మిటి? తల్లీ తండ్రీ లేని అనాథలేమో పాపం" అంది పుల్లమ్మ.

"మనకైతే దగ్గర కాబట్టి వచ్చాం. దూర ప్రాంతం వాళ్ళు రాగలరేమిటి?" అన్నాడు రామయ్య.

ఏజెంటు నాగన్నను పిలిచాడు. పుల్లమ్మ కూడా కొడుకుతో పాటు కదిలింది. రామ య్య ఆమె చెయ్యి పట్టుకుని ఆపాడు. ఆమె విదిలించుకుని నాగన్న వెనుకే వెడు తూంటే చేసేదేమీ లేక రామయ్య కూడా కదిలాడు. గుడారం దగ్గర ఇద్దరినీ ఆపేసి నాగన్ననే లోపలకు పంపారు.

దుబాసీ భాషాంతీకరణ చేస్తుండగా నాగన్న భయం భయంగా దొర ప్రశ్నలకు సమాధానాలిచ్చాడు.

"నీ పేరు"

"నాగన్న"

**కొత్తగాలి...**

**అందం**
**అశాశ్వతం**
**మనోసౌందర్యం**
**మహాప్రసాదం!**

*– గుడిమెట్ల గోపాలకృష్ణ, అరసవల్లి*

"నువ్వు ఇష్టపడే మారిషస్ వెడుతు న్నావా? లేక ఎవరైనా మోసం చేసో, బల వంతపెట్టో పంపిస్తున్నారా?"

ఏజెంటు ఏం సమాధానం చెప్పాలో ముందే చెప్పి ఉంచాడు.

"ఇష్టంగానే వెడుతున్నాను"

"నీకిచ్చే జీతం, చెయ్యాల్సిన పని, అయి దేళ్ళు అక్కడే ఉండాలి వంటి విషయాల న్నీ తెలుసుకదా?"

"తెలుసును"

కొన్ని ప్రశ్నలయ్యాక నాగన్న చేత కాగితం మీద వేలిముద్ర వేయించి బయ టకు పంపించారు. ఆత్రుతతో ఎదురు

చూస్తున్న తల్లితో "భయమేమీలేదమ్మా" అన్నాడు నాగన్న.

రెండు రోజులలో మారిషస్ వెళ్ళబోయే వారందరి వివరాలూ రాసుకుని, వేలిముద్రలు వేయించుకున్నారు తెల్లవారు. ఇక ఓడ లంగరెత్తే ప్రయత్నాలు మొదలయ్యాయి. మూటాముల్లేతో అందరూ పడవలెక్కి దూరాన ఉన్న ఓడకు చేరుకుంటున్నారు. మల్లమ్మ తల్లిదండ్రులకు నమస్కరించి, అత్తగారికి దండం పెట్టింది "వచ్చేటప్పుడు నలుగురు పిల్లల్ని ఎత్తుకుని తిరిగిరా తల్లీ" అని పుల్లమ్మ దీవించింది.

"నాగన్న అత్తమామల దగ్గరా, పిన్నీ, చిన్నాన్నల దగ్గరా, బావమరుదుల దగ్గరా శలవు తీసుకుని, నాగప్పను ఎత్తుకుని ముద్దాడి తల్లి దగ్గరకు వచ్చాడు.

"అమ్మా! వెళ్ళొస్తానే!" అంటూ దండం పెట్టబోతున్న నాగన్నను పట్టుకొని ఘొల్లుమంది పుల్లమ్మ. "ఎన్నడూ చేపల వేటకైనా వెళ్ళని వాడివి ఇప్పుడంత దూరం సంద్రంలో ఎలా వెడతావురా నాగన్నా?" అంటూ ఏడవసాగింది.

రామయ్య ఆమె దగ్గరగా వచ్చి "ఊరుకో వదినా. నువ్విలా ఉంటే వాడెలా వెళ్ళగలడు? ధైర్యం తెచ్చుకుని నవ్వుతూ పంపించు" అన్నాడు.

పుల్లమ్మ కళ్ళు తుడుచుకుని "సిరి సంపదలతో, పిల్లాపాపలతో తిరిగిరా నాయనా" అంది.

నాగన్నా, మల్లమ్మా పడవ ఎక్కి ఓడ దగ్గరకు చేరుకుని నిచ్చెన మీదుగా ఓడ మీదకు చేరుకున్నారు. దూరంగా తీరమూ, ఒడ్డున మనుషులూ లీలగా కన్పిస్తున్నారు. ఎవరెవరో తెలియడం లేదు. భార్యాభర్తలిద్దరూ ఒకరి చెయ్యి ఒకరు పట్టుకుని, కన్నీళ్ళు కళ్ళలోనే ఆపుకుని నిల్చున్నారు.

ఓడకు లంగరెత్తారు. నౌక నెమ్మదిగా కదిలిపోతోంది. ఒడ్డున ఉన్నవాళ్ళకి నౌక మొత్తం కన్పించింది. కాసేపటికి మధ్యవరకూ కన్పించింది. ఆపైన తెరచాప మాత్రం కన్పించింది. చివరగా భూమి గుండ్రంగా ఉన్నదన్నడానికి రుజువుగా, కాలచక్రం ఎవరికోసమూ ఆగదన్నదానికి తార్కాణంగా ఓడ మొత్తం మాయమయింది.

'చిన్న నావలో చేపల వేటకైనా పంపని దాన్ని అంత పెద్ద ఓడలో దేశంకాని దేశం ఎలా పంపానురా బాబు! పాపిష్టిదాన్ని' అంటూ పుల్లమ్మ కుమిలి కుమిలి ఏడ్చింది.

లచ్చమా, నాగమ్మా ఆమెను ఆపలేకపోయారు. రామయ్యా, నరసయ్యా కూడా ఆమెను ఓదార్చలేకపోయారు. రెండేళ్ళ నాగప్ప ఆమె ఒళ్ళో కూచుని "పెద్దా, ఏడవద్దు" అని ముద్దు మాటలతో కళ్ళు తుడిచాడు. పుల్లమ్మ వాణ్ణి దగ్గరకు తీసుకుని "నీలోనే నీ అన్నయ్యను చూసుకుంటానురా నాగప్పా" అని కళ్ళు తుడుచుకుంది.

★ ★ ★

కొడుకుని గురించి తల్చుకుంటూ 'వెర్రి నాగన్న ఎలా ఉన్నాడో ఏమో? ఆ లంక ఎక్కడ ఉందో ఏమో? రెండు నెలలవుతోంది. అక్కడ నుంచి ఉత్తరాలు పంపవచ్చో లేదో? వాడి గురించి నాకు అయిదేళ్ళదాకా ఏమైనా తెలుస్తుందో? లేదో?' అనుకుంటూ గుమ్మం దగ్గర కూచున్న పుల్లమ్మ చేతిలో తపాలా రన్నరు రెండుత్తరాలు పెట్టి వెళ్ళిపోయాడు.

పుల్లమ్మ ఆనందంతో పొంగిపోతూ 'వెయ్యేళ్ళే ఆయుష్షు నా తండ్రికి. ఇలా తల్చుకున్నాను, అలా రెండుత్తరాలొచ్చాయి' అనుకుంది.

మర్నాడు ఉదయమే నాగలాపల్లె వెళ్ళిన పుల్లమ్మతో కరణం "ఏమిటి? రెండుత్తరాలు రాశాడు నీ కొడుకు?" అంటూ ఉత్తరాలు తీసుకుని చూసి "ఒకటి నీ కొడుకు రాశాడు. రెండోదానిమీద నరసయ్య అని సంతకముంది ఎవరేమిటి?" అన్నాడు.

"నరసయ్య నా అల్లుడండయ్యా. చెన్నపట్నంలో ఉంటాడు. మా నాగన్న అదెక్కడో

లంకకి వెళ్ళాడండి. రెండూ ఒకేసారి వచ్చాయంటే రెండూ ఒకే దూరమన్న మాట. అయితే ఫరవాలేదు. నా బాబు మరీ దూరమెళ్ళలేదన్నమాట" అంది పుల్లమ్మ సంబరంగా.

కరణం మొదటగా నరసయ్య ఉత్తరం చదివి విన్పించాడు. "గంగా భాగీరథీ సమానురాలైన అత్తగారికి నమస్కరించి తమ అల్లుడు నరసయ్య రాయునది. మేం క్షేమంగా చెన్నపట్నం చేరినాం. నేను నిన్ననే కొలువులో ప్రవేశించాను. నాగన్న ఇక్కడ లేని కారణంగా నేనే క్షేమ సమాచారాలు తెలియచేయ నిశ్చియించినాను. మా అయ్యగారి వద్ద కొలువు చేయు గుమస్తాగారు నాకు ఉత్తరం రాసి సహాయం చేయుచున్నారు. నన్ను అక్షరాలు నేర్చుకొమ్మని హెచ్చరించినారు. నాగమ్మ క్షేమంగా ఉన్నది. ఇట్లు, తమ అల్లుడు, నరసయ్య"

"రెండో ఉత్తరం చదివి పెట్టండి బాబయ్యా" అంది పుల్లమ్మ.

"గంగా భాగీరథీ సమానురాలైన అమ్మకు నమస్కరించి తమ కుమారుడు నాగన్న రాయునది. మా నౌకా ప్రయాణం సక్రమంగా సాగుచున్నది. దారిలో సిలోను లోని కొలంబో అనే రేవులో లంగరు వేసినారు. అక్కడ నుంచి ఉత్తరం రాసి పంపుతున్నాను. మారిషస్సు చేరిన పిదప మరల రాసెదను. నీవు జాగ్రత్తగా సంతోషంగా ఉండవలెనని మనవి. చిన్నాన్నకు, పిన్నికి నమస్కారాలు, నాగప్పకు ఆశీస్సులు తెలియచేయగలవు. మల్లమ్మ నీకు నమస్కారాలు అందచెయ్యమన్నది. ఇట్లు నీ కుమారుడు నాగన్న"

"ఇంకా మారీచుడిలంకకు చేరలేదన్న మాట" అని గట్టిగా అనుకుంది పుల్లమ్మ.

"ఇదిగో పుల్లమ్మా మారీచుడిలంక, రావణాసురిడి లంక వంటి మాటలు వాడినట్లుగా దొరతనానికి తెలిస్తే నీకు ప్రమాదం. ఏదైనా ఉత్తరం రాసిపెట్టనా? " అని కరణం అడిగాడు.

"చెన్నపట్నం చిన్న ఉత్తరం రాసిపెట్టండి బాబూ" అంది పుల్లమ్మ. నాలుగు రోజుల పాటు కరణంగారింట్లో ఆయన తల్లికి సేవ చేసే పనికి ఒప్పుకొని ఉత్తరం రాయించుకుంది.




**నా**గన్ననూ, ఇంకెందరో తెలుగువాళ్ళనూ మారిషస్ తీసికెళ్ళే ఓడకు కొలంబోలో లంగరెత్తారు. ఓడ హిందూ మహాసముద్రంలో ప్రయాణం చేస్తోంది. చాలా మందికి నౌకా ప్రయాణం సరిపడలేదు. వాంతులతో, విరేచనాలతో, జ్వరాలతో బాధపడే సంఖ్య ఎక్కువవుతోంది. నౌకలో వైద్యుడు కొన్ని మందులిచ్చి తగ్గించే ప్రయత్నం చేస్తున్నాడు. అదృష్టవశాత్తూ నాగన్నకీ, మల్లమ్మకీ ఆరోగ్యం బాగానే ఉంది. ఏజెంటు దుబాసీలకీ, తెల్లదొరలకీ మధ్య ఆంగ్లంలో జరుగుతున్న సంభాషణ నాగన్న చెవిన అప్పుడప్పుడు పడుతూనే ఉంది. అతనికేమీ అర్థంకాకపోయినా 'కూలీ' అన్నమాట ఎక్కువగా విన్పిస్తోందని గ్రహించి దుబాసీని "కూలీ అంటే ఏమిటి? " అని అడిగాడు. మీ లాంటి నౌకర్లను కూలీలు అంటారన్నాడు దుబాసీ. నాగన్నకు ఆ మాట ఎందుకో నచ్చలేదు.

ఇంకో వారంలో మారిషస్ చేరుకుంటామనగా దూరాన ఇంకొక ఓడలో నుంచి

ఏవో నల్లటి పదార్థాలను నడిసంద్రంలోకి విసిరెయ్యడం కన్పించింది. వరసగా విసిరేస్తూండడం చూసిన నాగన్న అదేమిటని దుబాసీని అడిగాడు. అతనికీ తెలియదు. దొరగారికి తెలుస్తుందేమోనన్నాడు నాగన్న. అడగడానికి భయపడ్డాడు దుబాసీ. "సరే నేను అడుగుతాను. మీరు ఇంగ్లీషులోకి మార్చి దొరగారిని అడగండి" అన్నాడు నాగన్న.

దొర ఓడలో స్టార్ బోర్డ్ సైడున ఉన్న తన కాబిన్ బయట నిల్చుని పైప్ కాలుస్తున్నాడు. నాగన్న, దుబాసీ వెళ్ళి ఆయనకు దూరంగా నిల్చున్నారు. దొర తమవైపు తిరిగినప్పుడు పాశ్చాత్యపద్ధతిలో మోకాళ్ళ మీద కూచుని భారతీయ పద్ధతిలో నమస్కరించారు. దొర ఏం కావాలన్నట్లుగా తల ఎగరేశాడు. నాగన్న దూరాన ఉన్న ఓడలో నుంచి నల్లటివేవో సముద్రంలోకి విసిరేస్తున్నారనీ, తనకు ఏమీ అర్థం కాలేదనీ, ఓడ బరువెక్కువైతే అలా విసిరేస్తారా? అనీ వినయంగా అడిగాడు. దుబాసీ మరింత వినయంగా, భయంభయంగా నాగన్న ప్రశ్నను ఇంగ్లీషులోకి మార్చాడు.

దొర విస్మయంగా చూసి, టెలిస్కోప్ తీసుకుని ఓడ డెక్ మీదకు వచ్చాడు. దూరంగా కన్పించిన దృశ్యం ఆయనకు అర్థమయ్యీ, కానట్లుంది. ఇదే దృశ్యం అట్లాంటిక్ మహాసముద్రంలో కన్పిస్తే ఆయనకు ఆశ్చర్యం కలిగేదికాదు. బ్రిటిష ప్రభుత్వం బానిసత్వ వ్యాపారాన్ని చట్టవిరుద్ధం చేసింది. ఆఫ్రికా నుంచి బానిసలను అమెరికాకు ఎగుమతి చెయ్యకుండా బ్రిటిష నేవీ షిప్స్ అట్లాంటిక్ సముద్రంలో గస్తీ తిరుగుతున్నాయి. దూరంగా ఓడ మీద బ్రిటిష రాజ పతాకం యూనియన్ జాక్ కన్పించగానే బానిసలను అక్రమ రవాణా చేస్తున్న వ్యాపార నౌకలు అప్రమత్తమవుతాయి. వీలైతే దూరంగా వెళ్ళిపోతాయి, బలముంటే యుద్ధం చేస్తాయి, ఏదీ సాధ్యం కానప్పుడు అక్రమ రవాణా చేస్తున్న బానిసలను సముద్రంలోకి సంకెళ్ళతో, కాళ్ళకున్న గొలుసులతో సహా తోసేస్తాయి. అక్రమ రవాణా చేస్తున్నది సరుకులైతేనేమి? మనుషులైతేనేమి? వ్యాపారులకు తాము తప్పించుకోడం ముఖ్యం. కానీ ఆఫ్రికాకు తూర్పువైపున ఇలాంటి సన్నివేశం కన్పించిందేమిటి? ఏదైనా ఓడ పడమటివైపు నుంచి తూర్పుకి పలాయనమై వచ్చిందా? మారిషస్‌కి అక్రమ రవాణా జరుగుతోందా? తమ ఓడమీద యూనియన్ జాక్‌ని చూసి నేవీషిప్ అనుకున్నట్లున్నారు.

దొర ఒకసారి భగవంతుని తల్చుకుని, తనను తాను క్రాస్ చేసుకుని, నిట్టూర్చాడు. విషయం నాగన్నకు చెప్పలేదు. తనతో వస్తున్న కూలీలను అనవసరంగా భయపెట్టడం ఆయనకు ఇష్టంలేదు. "ఏమో నాకూ పూర్తిగా అర్థం కావడం లేదు" అంటూ అటు సత్యమూ కాని, ఇటు అసత్యమూ కాని కప్పదాటు జవాబిచ్చి దొర తన కాబిన్‌లోకి వెళ్ళిపోయాడు.

★ ★ ★

నౌక పోర్ట్‌లూయిస్ రేవు దగ్గర తీరాన్ని తాకింది. ముందుగా దొరలూ, ఆపైన దుబాసీ ఏజెంట్లూ, చివరగా కోరంగి రేవులో ఓడనెక్కిన భారతీయ కార్మికులూ ఓడ దిగారు. తమకున్న కొద్దిపాటి మూటలూ, పలుగులూ, పారలూ, తట్టలూ, బుట్టలూ పెట్టుకుని సముద్రతీరంలో కూచున్నారు. అందరికీ భయంగా ఉంది. భాష తెలియదు, ఎక్కడున్నారో తెలియదు, ఎక్కడుండాలో, ఎలా ఉండాలో, ఏ పనిచెయ్యాలో, ఏం తినాలో తెలియదు. బిక్కుబిక్కుమంటూ కూచున్న వారికి తమలాగే దూరంగా ఇంకొక గుంపు కూచుని ఉండడం కన్పించింది. 'మనలాగే ఉన్నారు. ఇక్కడా మనలాంటి వాళ్ళే

ఉంటారన్న మాట..' అని అనుకుంటూ ఆశ్వాసన పొందేలోగా పడవలలోంచి దొరల సామాన్లు మోస్తున్నవారిని చూడ గానే కళ్ళు తిరిగినట్లయింది.

"అదేమిటి? వాళ్ళంత నల్లగా బొగ్గులా ఉన్నారు? " అంది మల్లమ్మ తడబడుతూ.

"ఏమో తెలియడం లేదు. దొరలంత తెల్లగా ఉంటే వీళ్ళంత నల్లగా ఉన్నారు. అవును మనం ఎండాకాలంలో బయ ల్దేరాం. ఇప్పుడింత ఎండగా ఉందేమిటి? అంతా తల్లకిందులు వ్యవహారంగా ఉంది.. అసలేం అర్థం కావడం లేదు" అన్నాడు నాగన్న.

రెండురోజులపాటు సముద్ర తీరంలోనే అందరినీ ఉంచేశారు. ఓడలో మిగిలిన పదార్థాలతో ఆహారం పెట్టారు. దగ్గరలోనే ఉన్న గుడారాలలోకి నెమ్మది నెమ్మదిగా కార్మికులను సద్దుతుండగా నాగన్నకి ఆర్ముగం కన్పించాడు. "ఆర్ముగం నువ్వా!" అన్నాడు ఆనందంగా నాగన్న. "అరె నాగన్నా నువ్వా! ఎప్పుడు వచ్చావు? ఎలా వచ్చావు? " అన్నాడు ఆర్ముగం.

"రెండు రోజులైంది. కోరంగి రేవులో ఓడ ఎక్కి నేనూ, మా మల్లీ వచ్చాం"

"నేను పాండిచ్చేరిలో బయల్దేరి వచ్చాను. . అక్కడ మన యజమాని పొలంలో పంట ఈ ఏడాది వెయ్యడం లేదు. తిండికి దిక్కులేదు. కడుపు చేత్తో పట్టుకొచ్చా. అదిగో మా తమ్ముడు, ఆ పక్కన నా భార్య, పాప, మరదలు"

"ఏం పని చెప్తారో మనకి? "

"ఏ పనైతేనేం తిండి పెడతారు కదా! బట్ట ఇస్తారు కదా! ఇంకేం కావాలి? "

బట్ట అంటే ఆశ్చర్యం వేస్తోంది. ఆ నల్ల వాళ్ళ ఆడవాళ్ళు మొలకే గుడ్డకానీ పైన ఏం కట్టుకోలేదు" అని నాగన్న అన్నాడు.

"వాళ్ళని నీగ్రోలంటారుట. వాళ్ళు అడవి మనుషులట. మా ఏజెంటు సారు చెప్పాడు"

"సరేలే! వాళ్ళెవరైతే మనకెందుకు? "

"అంతేలే! మన పొట్టకూటి కోసం మన మొచ్చాం. వాళ్ళ జోలి మనకెందుకు? " అన్నాడు ఆర్ముగం.

నాగన్న ఉలిక్కిపడ్డాడు. తను పొట్ట కూటి కోసం వచ్చాడా? అయిదెకరాల మీద పంట తనకు సరిపోయేది కాదా? కరువుకాటకాలు ఎల్లకాలం ఉంటాయా? కన్నతల్లి కన్నీళ్లు పెడుతూంటే కర్కశంగా వదిలేసి వచ్చేశాడు. ఎంత కఠిన హృదయం తనది?

బరువెక్కిన గుండెతో సముద్రం ఒడ్డున కూచున్న నాగన్న దగ్గరకు మల్లమ్మ వచ్చి "అరె ఇక్కడ కూచున్నావా? నీ కోసం వెతుక్కున్నాను. దేశంకాని దేశం. ఎవ్వ రూ అంతగా పరిచయం లేదు. ఓడలో కల్సి వచ్చామన్న మాటేకానీ ఎవరి దారి వారిదే. నన్ను ఒంటరిగా వదలకు" అంది.

నాగన్న ఏమీ మాట్లాడలేదు.

"ఏమిటలా ఉన్నావు? ఒంట్లో బాగు లేదా? " అంది మల్లమ్మ.

"మనస్సు బాగులేదు మల్లీ. అమ్మ ఎలా ఉందో? ఏమో? ఏడుస్తున్నదాన్ని అలా వదిలేసి వచ్చా"

"దిగులుపడకు! అయిదేళ్ళు ఓర్చుకుంటే అక్కడకే వెళ్ళిపోతాం కదా"

"అయిదేళ్ళంటే అయిదు గడియల్లా మాట్లాడతావేంటి? "

మల్లమ్మకి ఏం చెప్పాలో తెలియలేదు. 'పెళ్ళి చేసుకుని మా అమ్మనీ, నాన్ననీ వదిలి నేను నీతో చెన్నపట్నం రాలేదా? నాకు మాత్రం బెంగ ఉండదా? మా అమ్మ అప్పుడు ఏడవలేదా? మగాళ్ళ విషయం వేరు, ఆడవాళ్ళ విషయం వేరు అంతేకదా ఈ ప్రపంచంలో' అనుకుంది.

"ఇప్పుడందరికీ ఇలా దేశం వదిలిపోడం మామూలైనట్లుంది. తెల్లదొరలెక్కడో సీమ నుంచి వచ్చి చెన్నపట్నంలో, కాకినాడలో, విశాఖపట్నంలో ఉండడం లేదా? మనమూ

అంతే" అన్న మల్లమ్మతో "అంతేలే మల్లీ. మనకక్కడే బావుంటే ఇక్కడకెందుకొస్తం? " అన్నాడు నాగన్న.

★ ★ ★

భారతదేశం నుంచి వచ్చిన కార్మికులందరి పేర్లూ రికార్డులో రాయడం మొదలైంది. అందరూ వరసగా నిల్చోవాలని ఆదేశాలున్నాయని ఏజెంట్లు చెప్పారు. దొరలు మేడ లోపల కూచుని ఉన్నారు. పదిమంది దొరల ముందు పది వరసలుగా కార్మికులు నిల్చుని ఉన్నారు. దొరల పక్కన దుబాసీలు నిల్చుని ప్రశ్నలను ఇంగ్లీషు నుంచి అనువాదం చేసి, కార్మికులు చెప్పిన సమాధానాలు ఇంగ్లీషులోకి మార్చి చెప్తున్నారు. భారతీయ నామధేయాలు ఒకంతట పట్టుబడక, పట్టుబడినా ఇంగ్లీషులో స్పెల్లింగు కుదరక దొరలు తమకి తోచినట్లు రాసుకుంటున్నారు.

నాగన్న వంతు వచ్చింది. వివరాలు రాసుకుంటూ దొర నాగన్నను ఇంటిపేరు అడిగాడు. ఇంటి పేరంటే ఏమిటో నాగన్నకు తెలియదు. ఏం చెప్పాలోనని ఆలోచిస్తున్న నాగన్నతో పక్క వరసలో ఉన్న ఆర్ముగం "దొరలలా మనకి ఇంటి పేర్లుండవు. మా నాన్నపేరే మేం మా పేరు ముందు రాసుకుంటాం. నువ్వూ అదే చెప్పెయ్యి" అన్నాడు.

తండ్రిపేరును పేరు ముందు రాసుకోడం తమిళ సంప్రదాయం. తెలుగువారలా రాసుకోరని అతనికి తెలియదు. ఇంతవరకూ ఇంటిపేరు అవసరం అతనికి రాలేదు. అసలైన బాధ కల్గించే సంగతి తండ్రిపేరు కూడా తెలియకపోడం. అమ్మ పేరు మాత్రమే తెలుసు. నాన్న పేరేమై ఉంటుంది? అమ్మ పేరే చెప్తే.. ఆడవాళ్ళ పేర్లు ఒప్పుకోరేమో.

దొర అసహనంగా ఏదో అన్నాడు. దుబాసీ "తొందరగా చెప్పు. దొరగారికి కోపం వస్తోంది" అన్నాడు.

నాగన్న అనాలోచితంగా "పుల్లయ్య" అన్నాడు. అదే నాగన్న ఇంటిపేరుగా నమోదైపోయింది. మల్లమ్మకీ ఆ పేరే ఇంటిపేరుగా ఖరారైపోయింది.

★ ★ ★

మూడునెలలు గడిచాయి. చెరకుతోటలో పనిచెయ్యడం అలవాటయింది. ఆఫ్రికన్ల భాషకీ, ఫ్రెంచికీ సంకరమైన క్రియోల్ భాషపై పట్టు సాధించడం మొదలైంది. నెమ్మది నెమ్మదిగా యజమానులతో, తోటి ఆఫ్రికన్ కార్మికులతో మాట్లాడిన క్రియోల్ భాషలోనే తమలో తాము సంభాషించుకుంటున్నామని స్పృహ కలగగానే తెలుగువారంతా ఒకచోట గుమికూడారు. అందరూ తెలుగులోనే తమ అభిప్రాయాలు చెప్పుకోడం మొదలెట్టారు.

"చూశావా అప్పన్నా? నిన్న మా ఆవిడతో అన్నం పెట్టు అని తెలుగులో అన

## మనిషిని!

విద్యాసాగర్ ట్రైన్‌లో ప్రయాణిస్తుండగా ఎదురు సీటులో ఒకడు, తనకిరువైపులా మరో ఇద్దరు యువకులు కూర్చుని ఆంగ్లంలో మాట్లాడుకుంటున్నారు. భారతీయులపట్ల నీచమైన భావన వారిది. కాసేపటికి కుడివైపున కూర్చున్న తెల్లవాడు, 'హూ ఈజ్ దిస్ డాంకీ?' అన్నాడు. మరింత పెట్రేగిపోతూ ఎడమవైపునున్న యువకుడు హేళనగా, 'హూ ఈజ్ దిస్ పిగ్?' అన్నాడు. ఎదురుగా కూర్చున్న యువకుడు, 'హే.. హూ ఆర్ యూ?' అని విద్యాసాగర్‌వైపు చూస్తూ అడిగాడు.



విద్యాసాగర్ శాంతంగా, 'ఐయామ్ ఏ హ్యూమన్ బీయింగ్ సిట్టింగ్ బిట్వీన్ ఏ డాంకీ అండ్ ఏ పిగ్' అని బదులిచ్చారు.

సాదాసీదా దుస్తులు ధరించి, నిరక్షరాస్యుడిలా కనిపించిన విద్యాసాగర్‌కు ఇంగ్లిష్ తెలియదనుకొని నోటికొచ్చినట్లు వాగిన ఆ ముగ్గురు అవాక్కయ్యారు.

లేదు. క్రియోల్ భాషంటారే ఆ భాషలో అన్నాను. చెంప మీద ఎవరో చెళ్ళున కొట్టినట్లనిపించింది"

"నాకూ అలాగే అయింది. చెరకుతోట నుంచి ఇంటికి నడుస్తూ నేనూ, ఆవిడా ఇంటి విషయాలు తెలుగులో మాట్లాడుకోలేదు. ఇంటికొచ్చి ఇద్దరం ఏడ్చాం"

"నేనూ అంతే. మా ఆయన్ని 'స్నానం చెయ్యి' అని క్రియోల్ భాషలో చెప్పాను" అందో తెలుగు కార్మిక మహిళ.

అందరూ తమతమ అనుభవాలు కల్ల పోసుకున్నారు. ఎవరి నోటనైనా ఒక్కటే మాట. ఉన్న ఊరు వదిలినంతలో కన్న తల్లి నేర్పిన మాటలు మర్చిపోవచ్చునా?

> **కొత్తగాలి...**
>
> **కురచనైన దుస్తులు**
> **సన్నపడడానికి పస్తులు**
> **నేటి నటీమణుల తిప్పలు!**
>
> *– రాకి,*
> *చాగల్లు, ప.గో.జిల్లా*

తల్లి భాషను మర్చిపోరాదన్న ఆలోచనలో ఉండగానే వారి దృష్టి హిందూమతం మీద కూడా ప్రసరించింది. "ఇక్కడకొచ్చాక దేవుణ్ణీ, పూజలనూ కూడా మర్చిపోయాం. ఎంత పాపం మూటకట్టుకుంటున్నాం?" అని అనుకున్నారందరూ.

"ఏం చెయ్యాలి?" అన్నది అందరి మనస్సులో మెదిలిన ప్రశ్న. మన ఊళ్ళో కట్టినట్లుగా ఇక్కడ పెద్ద గుడి కట్టుకోలేం. అందుకు తగినంత డబ్బు లేదు. ఒక గుడిసె వేసుకుని అందులో దేవుడి బొమ్మలు పెట్టుకుందాం. గుడిసె ముందు కూచుని భజనలు చేసుకుందాం. రోజంతా చెరకుతోటలో పనిచేసి అలసిపోయిన శరీరానికి విశ్రాంతి, పని సరిగా చెయ్యడం లేదంటూ తిట్టిన తిట్లు తిని బాధపడే మనస్సుకి శాంతి.

బాగుందనుకున్నారందరూ.

తెలుగుభాషను మర్చిపోకుండా ఏం చెయ్యాలి? అందరి కళ్ళూ నాగన్నవైపూ, అతనిలాగనే అక్షరజ్ఞానమున్న మరో ముగ్గురివైపూ మళ్ళాయి.

చిన్నపిల్లలు ఇరవైమంది దాకా ఉన్నారు. వారికి అక్షరాలు నేర్పించాలి. ఎలాగ, పలకలు లేవు, బలపాలు లేవు. ఇసుకలోనే అక్షరాలు దిద్దించాలి. కొంత చదవడం, రాయడం వచ్చాక తాటాకుల మీద రాయించాలి.

నాగన్న ముఖంలో ఉత్సాహం చూసిన మల్లమ్మ మనస్సు కుదుటపడింది. ఈ పనిలో పడిన తర్వాత తల్లి గురించి తక్కువ ఆలోచిస్తాడేమోనని ఆమె ఆశపడింది.

★ ★ ★

పుల్లమ్మకు చెన్నపట్నం నుంచి అల్లుడు రాసిన ఉత్తరం అందింది. "గంగా భాగీరథీ సమానురాలైన అత్తగారికి తమ అల్లుడు నరసయ్య నమస్కరించి రాయునది. ఉభయకుశలోపరి. మీరు రాయించిన ఉత్తరం అందింది. నాగన్న కూడ లేఖ రాసినాడని తెలిసి సంతోషించినాను. మీకు రెండు శుభవార్తలు రాయుచున్నాను. మీ కుమార్తె నాగమ్మకు మూడోనెల వచ్చింది. త్వరలో మీరు అమ్మమ్మ కాబోవుచున్నారు. చెన్నపట్నం నుండి ఉత్తర దిక్కుగానూ, దక్షిణ దిక్కుగానూ రాదారి పడవలకై కాలువలు తవ్వుచున్నారు. అర్ధరూపాయ కేవు ఇచ్చినచో కృష్ణాతీరం వరకు పడవలో ప్రయాణం చేయవచ్చును. ఇది రెండో శుభవార్త. నాగన్న క్షేమవార్తను మారిషస్సు నుండి తెలిపినచో మాకు తెలియచేయవలసినది. ఇట్లు మీ అల్లుడు నరసయ్య"

ఉత్తరాన్ని కరణం చేత చదివించుకుని

ఇంటికి వచ్చిన పుల్లమ్మ మనస్సులో సంతోషమూ, దుఃఖమూ గంగాయమునల్లా కలసి ప్రవహించాయి. కూతురు నీళ్ళోసుకుందని ఆనందం, కొడుకు ఎలా ఉన్నాడోనని బెంగ, ఓడ సరిగా తీరానికి చేరిందో లేదో అని భయం.

సాయంత్రమయ్యేసరికి పొలం నుంచి రామయ్యా, లచ్చమ్మా పిల్లవాడితో ఇంటికి తిరిగి వచ్చారు.

"ఏం వదినా! నాగన్న ఏం రాశాడు? " అన్నాడు రామయ్య.

"నాగన్న రాశాడనుకున్నాం కదా. కానీ ఉత్తరం అల్లుడి దగ్గర నుంచి వచ్చింది. నాగమ్మ నీళ్ళోసుకుందిట, మూడోనెల"

"అదేమిటక్కా అలాంటి శుభవార్త వస్తే డీలాపడి కూచున్నావు? పద పంచదార నోట్లో వెయ్యి"

"ఇంట్లో పంచదార ఎక్కడుంది? బెల్లం ముక్క కూడా లేదు. రేపు ఏం తింటామని బెంగ, అక్కడ నాగన్న ఎలా ఉన్నాడోనని బెంగ"

"ఈ కష్టాలన్నీ చెన్నపట్నానికి ఉత్తరం రాయించావా? "

"ఉత్తరం రాయించలేదు"

"అదేం పని అక్కా? అంత మంచి వార్తను అల్లుడుత్తరం రాయించి పంపితే మనం సమాధానం రాయించకపోతే ఎలా? పురిటికి ఇక్కడకు తీసుకువస్తామని రాయించు"

"ఎలా తీసుకువస్తాం? ఎలా పురుడు పోస్తాం? ఏ దారీ కన్పించడం లేదు"

"ఏ దారీ కన్పించకపోతే గోదారి ఉంది. కొడుకు మీద ప్రేమ ఉంటే తప్పులేదు కానీ కొడుకు తప్ప ప్రపంచం లేదని కూచుంటే ఎలా? ఎంతమంది కోరంగి రేవులో ఓడ ఎక్కి వెళ్ళారు? అందరిళ్ళళ్ళోనూ ఇలాగే ఏడుస్తూ కూచుంటున్నారా? " అని లచ్చమ్మ పుల్లమ్మతో గట్టిగా మాట్లాడి, భర్తవైపు తిరిగి "రేపు నాగలాపల్లె వెళ్ళి కరణంగారి చేత చెన్నపట్నం ఉత్తరం రాయించు" అంది.

రామయ్య సరేనన్నాడు.

లచ్చమ్మ "లంకలో గుమ్మడి పాదు అన్నివైపులా పాకి కాయలు కాసింది. ఓ గుమ్మడికాయను ఈవేళకి సగం, రేపటికి సగం ఉడకపెట్టుకుందాం. అమ్మమ్మ అవుతున్నావుగా. తియ్య గుమ్మడే మనకు మిఠాయి" అంది.

★ ★ ★

మారిషస్‌లో తెలుగువారందరూ పోర్ట్ లూయిా దగ్గర సముద్రతీరంలో సమావేశమయ్యారు. చిన్నపిల్లలు ఇసుకలో రాసిచ్చిన అక్షరాలను దిద్దుకుంటున్నారు. పెద్దవాళ్ళు పిల్లలకు కొంచెం దూరంగా కూచుని నాగన్న చదివే పద్యాలు వినడానికి ఎదురుచూస్తున్నారు. నాగన్న పుస్తకం తెరిచి నరసింహ శతకంలోని పద్యాన్ని చదివి తనకు తెలిసినంత అర్థం చెప్పాడు. "డబ్బు సంపాదించడం, కూడపెట్టడం దండగ. లక్షలు సంపాదించినా అన్నమూ, ఉప్పే తినాలి కానీ బంగారం తినలేరు. దాచిదాచి ఏంచేస్తారు? దొంగలో దొరలో పట్టుకుపోతారంతే"

"అదేంమాట? డబ్బెక్కువ ఉంటే అన్నం, ఉప్పూ తింటారేంటి? మన యజమానుల్ని చూడడం లేదా? ఎక్కడెక్కడి నుంచో కూరగాయలూ, మేకమాంసం, గొర్రెమాంసం, పందిమాంసం తెప్పించుకుని తింటారు" అన్నాడొక శ్రోత.

"ఏం తింటే ఏమిటి? మనంత బలంగా ఉన్నారేంటి? మనం పని చెయ్యకపోతే వాళ్ళకి వ్యవసాయం నడవదు" అన్నాడింకొకడు.

"ఒక్కరోజు పని మానెయ్యి. వాళ్ళ తుపాకీ బలం ముందు నీ బలమెంతో తెలుస్తుంది" అని మూడోవాడు అనగానే అందరూ తమ తమ అభిప్రాయాలు చెప్పడం, వాదాలూ, వివాదాలూ మొదల

య్యాయి.

కూలీల్లో పెద్ద "అంతా ఊరుకోండి. ఇక్కడకు మంచిమాటలు వినడానికీ, భజనలు చేసుకుందుకూ వచ్చాం. నాగన్నా, పాట అందుకో. మేమూ గొంతు కలుపుతాం" అన్నాడు.

నాగన్న "ఓ రామ నీ నామమెంత రుచిరా.." అన్న భజన పాట మొదలెట్టాడు. అందరూ తాళం వేస్తూ అతని వెనుకగా పాడసాగారు. పాటకు సరైన తాళం లేదు, రాగం లేదు.. ఎవరి శ్రుతి వాళ్ళదే. ఎవరి పాట వారిదే. ఎవరి రాగం వారిదే. ఎవరి తాళం వారిదే. కానీ అందరిలోనూ ఉన్నదొక్కటే. అది తమ దేవుడిపై ఉన్న భక్తి, తమ మాతృభాషపై మమకారం.

నాలుగైదు భజన పాటలయ్యాక నాగన్న "ఏ తీరుగ నను దయచూసెదవో ఇనవంశోత్తమ రామా, నా తరమా భవ సాగర మీదను" అన్న పాటను ఒక్కడే పాడాడు. ఆ తరువాత రామాయణం పుస్తకం తీసి "ఎంతవరకు వచ్చింది కథ? అందరికీ గుర్తుందా? " అన్నాడు.

"రాములవారు అడవికి వెడుతూ కౌసల్యాదేవి దగ్గర శలవు తీసుకుందుకు వెళ్ళారు" అన్నారొకరు.

నాగన్న చదవడం ప్రారంభించాడు. కౌసల్య దుఃఖిస్తున్న సన్నివేశాన్ని తనకు అర్థమైనంతగా వర్ణించి చెప్తున్నాడు నాగన్న. శ్రోతలందరూ కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ వింటున్నారు.

ఇంతలో పిల్లలలో కలకలం మొదలైంది. "ఓడ వస్తోంది ఓడ వస్తోంది" అంటూ గెంతులు మొదలెట్టారు. పెద్దలలోనూ ఉత్కంఠ కలిగింది. అందరూ తలోమాటా అనడం ప్రారంభించారు.

"మన కోరంగిరేవు నుంచేమో? "

"అయితే బాగుండును! మనవాళ్ళు ఇంకొందరొస్తే బాగానే ఉంటుంది"

"అక్కడ విశేషాలు తెలుస్తాయి"

"తునివాళ్ళెవరైనా వస్తున్నారేమో"

"మా కర్నూలు నుంచి ఎవరూ రారేమో"

అందరూ సముద్రంవైపే చూస్తున్నారు. కాసేపటికి ఓడ దగ్గరవడం చూసి రేవు వైపుకి నడిచారు. అక్కడున్న నల్లజాతి వాడొకడు వచ్చేది తపాలా పడవ అని చెప్పాడు.

అందరిలో నిరాశ పేరుకుంది. నాగన్న గుండెలో గునపం గుచ్చినట్లయింది.

ఎవరి దారిన వారు తమతమ గుడిసెల వైపు నడవడం మొదలెట్టారు.

★ ★ ★

గుడిసెలో కుంపటి ఊది ఈనెపుల్లతో లాంతరు వెలిగించిన మల్లమ్మ "మీ చిన్నాన్న మైనం వత్తి దీపం తీసుకొస్తేనే ఉప్పాడ జనమంతా విరగబడి చూశారన్నావు. లాంతరు చూస్తే ఇంకెంత అబ్బురపడతారో. వత్తి పెద్దది చెయ్యొచ్చు చిన్నది చెయ్యొచ్చు" అంది.

నాగన్న ఏమీ మాట్లాడలేదు.

మల్లమ్మ "రా అన్నం తిందాం" అంది.

నాగన్న కదలలేదు.

"ఏంటయ్యా అలా ఉన్నావు? ఒంట్లో బాగులేదా? " అని భర్తను అడిగింది మల్లమ్మ. అతను సమాధానం చెప్పకపోయేసరికి" ఏదో ఒకటి మాట్లాడు. నాకు భయమేస్తోంది. నామీద కోపం వచ్చిందా నీకు" అంది.

"నీ మీద కాదు. నా మీద నాకే కోపం, అసహ్యం" అన్నాడతను.

"అదేమిటి అలా మాట్లాడుతున్నావు? "

"ఆరు నెలలైందిక్కడకు వచ్చి. అమ్మకు ఉత్తరం రాయలేదు"

"ఉత్తరమెలా రాస్తావు? ఇదేం చెన్నపట్నం కాదుగా పంపడానికి? "

"ఇష్టం లేకపోతే సాకులెన్నయినా చెప్పొచ్చు. కొలంబోలో మనం వస్తున్న ఓడ

లంగరు వేసినప్పుడు అమ్మకు ఉత్తరం రాసివేశాను. ఈరోజు తపాలా పడవను చూసేదాకా ఉత్తరం పంపించాలనే తోచ లేదు. అమ్మ ఎలా ఉందో? అన్నం తింటోందో? లేదో? తినడానికి ఏమైనా ఉందో? లేదో? తిండి ఉన్నా నా మీద బెంగతో తినడం మానేస్తోందో" నాగన్న కంఠం రుద్ధమైంది.

మల్లమ్మ భర్త దగ్గరగా కూచుని, అతని భుజం మీద చెయ్యివేసి "బెంగ పెట్టుకోకు. ఈవేళే తపాలా పడవ వచ్చింది కదా. రేపు ఉత్తరం రాసి పంపించు. రా, భోజనం చేద్దువుగానీ, నువ్విక్కడ తిండి సరిగా తినడం లేదంటే అక్కడ అత్తమ్మకు ఆనందం ఎలా ఉంటుంది?" అంది.

"మల్లీ, నీలాంటి భార్య దొరకడం నా అదృష్టమే" అన్నాడు నాగన్న.

★ ★ ★

'దగ్గర దగ్గరగా ఏడాదవుతోంది నాగన్న వెళ్లి. ఎలా ఉన్నాడో ఏమో? అసలు ఓడ మారీచ లంకకు వెళ్లిందో? మునిగిపో యిందో? చేపల వేటకైనా వెళ్లనివాడు అంత పెద్ద ఓడలో ఎలా వెళ్లగలడు? ఏ జ్వరమైనా వచ్చిందో? ఏమయిందో?' అని మనస్సులో అనుకుంటూ పైకి చిరునవ్వు నవ్వుతూ పుల్లమ్మ మనవడికి నీళ్లు పోస్తోంది. పక్కనే మంచం మీద కొత్త బాలింతరాలు నాగమ్మ కన్నతల్లినీ, కన్నకొ డుకునీ చూస్తూ అలసటగా పడుకుంది.

"పుల్లమ్మా, తపాలా!" అంటూ వచ్చాడు రన్నరు. అతనికి పుల్లమ్మకి ఉత్తరాలు ఇవ్వడం అలవాటయింది.

"ఏదీ ఉత్తరం?" అంటూ తడిచెయ్యి చాచింది పుల్లమ్మ.

"మీ అల్లుడు రాశాడేమోనే అమ్మా" అంది నాగమ్మ. కొడుకే రాశాడనుకుం టున్న పుల్లమ్మ "బాబూ, ఉత్తరం చెన్న పట్నం నుంచా?" అని అడిగింది. భర్త నుంచి ఉత్తరం రావాలని నాగమ్మా, కొడుకు నుంచైతే బాగుండునని పుల్లమ్మా అనుకుంటున్నారు. రన్నరు ఉత్తరాన్ని అటూ ఇటూ చూసి "చెన్నపట్నం కాదు. ఇంకేదో పేరుంది. ఏదో దొరల పేరులా ఉంది" అంటూ వెళ్లిపోయాడు.

పుల్లమ్మ సంతోషంతో మనవడి బుగ్గలు తడిమి "కన్నబాబు, చిన్నతండ్రి, చిట్టికొండ పుట్టాడు, మామయ్య నుంచి ఉత్తరం తెప్పించాడు. నా బాబే, నా తండ్రే, నానా యనే" అంటూ ఒళ్లు తుడవసాగింది.

"ఎవరినమ్మా ముద్దు చేస్తున్నావు, నీ కొడుకునా? లేక మనవణ్నా?" అంది నాగమ్మ.

"ఊరుకో! తల్లితో వేళాకోళమేమిటి? ఇదిగో నీకూ కొడుకు పుట్టాడుగా! ఎలా పెంచుతావో? ఎంత బెంగ పెట్టుకుం టావో? నేనూ చూస్తా" అంది పుల్లమ్మ.

★ ★ ★

మర్నాడు నాగలాపల్లె వెడుతున్న పుల్ల మ్మతో కూతురు "అమ్మా! మనవడు పుట్టా డని చెన్నపట్నం కూడా ఉత్తరం రాయిం చు. ఇదిగో డబ్బు కరణంగారికియ్యి. ఉత్తరం పంపించడానికి నువ్వు పని చెయ్యడం మీ అల్లుడికిష్టం లేదు" అంది.

"ఎందుకే డబ్బు?" అని పుల్లమ్మ అన బోయింది కానీ పరిస్థితులు ఆమెను ఆ మాట అననివ్వలేదు. అడవిలో కట్టెలు కొట్టి అమ్మితే పసివాడికి ఆముదం ఖర్చైనా వస్తుందో? లేదో? తెలియదు. లంకలో మరిదీ, తోడికోడలూ రెక్కలుము క్కలు చేసుకున్నా రోజు గడవడం కష్టంగా ఉంది. నాగన్నకు ఉత్తరం రాయించాలంటే కరణంగారు ఎన్నిరోజులు పని చేయించు కుంటాడో తెలియదు. కూతురికీ, అల్లుడికీ పెట్టడం పోయి వాళ్ల డబ్బు తీసుకో డమా? వేరే గతి లేదే.

పుల్లమ్మ అతి కష్టంమీద కూతురు నుంచి డబ్బు తీసుకుంది.

"అమ్మా, అన్నయ్యకు ఉత్తరం పంపించా

లంటే చాలా ఖర్చు అవుతుందేమో. మీ అల్లుడికి రాసిన ఉత్తరంలోనే శుభవార్తను వాడికి రాసి పంపించమని రాయించు. చెన్నపట్నం నుంచి తొందరగా వెడతా యేమో ఉత్తరాలు" అంది నాగమ్మ.

పుల్లమ్మ అన్యమనస్కంగా తల ఊపి పక్క గుడిసెలో ఉన్నావిడను కూతుర్నీ, మనవణ్నీ చూస్తుండమని చెప్పి నాగలా పల్లె వెళ్లింది.

కరణం ఆమెకు ఉత్తరం చదివి విన్పించాడు "గంగా భాగీరథీ సమానురాలైన అమ్మకు నమస్కరించి కుమారుడు నాగన్న రాయునది. ఉభయకుశలోపరి. ఇక్కడకు వచ్చిన చాలాకాలం వరకూ ఉత్తరం రాయనందుకు మన్నించవలెను. అంతా కొత్తగా ఉన్నందువలన వెంటనే రాయలేకపోయాను. అంతయు వింతగా నున్నది. దొరలు బహు తెల్లగా ఉన్నట్లే ఇక్కడ పనివారు బహునల్లగా ఉన్నారు. మనకు వైశాఖంలో ఎండలు కాసినట్లే ఇక్కడ కార్తీకంలో ఎండలు. అంతటా చెరకు మాత్రమే పండించుచున్నారు. బియ్యము, గోధుమలు, కాయగూరలు ఓడలలో తెచ్చి అమ్ముటచే ఖరీదెక్కువ. సాయంకాలం అందరమూ భజనలు చేయుచున్నాం. నీవు జాగ్రత్తగా, ఆనందంగా ఉండవలెనని కోరుచున్నాను. పిన్నికి, చిన్నాన్నకు నమస్కారాలు. నాగప్పకు ఆశీస్సులు. ఈ ఉత్తరం తెచ్చు ఓడ విశాఖ పట్నం రేవుకు వచ్చునట. అక్కడ నుంచి తపాలారన్నర్లు తెచ్చెదరట. నీవు ఉత్తరం పంపుటకు ధనం చెల్లించనక్కరలేదు. ఇక్కడ తపాలా వారికి నేను ఇచ్చి వేసినాను. ఈ ఉత్తరం చూచిన వెంటనే సమాధానం రాయించి పంపవలెను. మల్లమ్మ నీకు నమస్కారాలు తెలియచేయమన్నది. ఇట్లు మీ కుమారుడు నాగన్న"

పుల్లమ్మ ముఖంలో ఆనందం వెల్లి విరిసింది. సంతోషం పొంగిపొర్లుతుండగా లేచి నిల్చున్న ఆమె కరణంగారి అరుగు కన్నా ఎత్తుగా ఉన్నట్లనిపించింది. కరణం మనస్సులో ఎక్కడో అట్టడుగు పొరల్లో అసూయ కదలాడింది. చేపలు పట్టుకు బతకాల్సిన వాడు "చెడి చెన్నపట్నం వెళ్లు" అన్న లోకోక్తికి తార్కాణంగా చెన్నపట్నంలో పల్లకీలు మోసినవాడు ఈనాడు తల్లికి విదేశీ తపాలాఖర్చు కూడా తనే పెట్టుకునే మొనగాడయ్యాడా?

మారిషస్‌లో నాగన్న ఎలా బతుకుతున్నాడో ఇక్కడ కరణానికి తెలియదు. తన కన్నా తక్కువ స్థాయిలో ఉన్నవారు తనను మించి పోతున్నారేమోనన్న అసూయ మానవ సహజం. నాగన్న గుడిసెలో ఉంటూ, ఎండలో చెరకుతోటలో పనిచేస్తున్నాడంటే ఇక్కడ కామందులకి తృప్తి.

"అయ్యగారండీ, అబ్బాయికీ, అల్లుడికీ ఉత్తరాలు రాయించి పంపాలండి. డబ్బు కూడా తెచ్చానండీ"

"అబ్బో! ఎక్కడదీ డబ్బు? ఎంత సంపాదిస్తున్నావు? పొలం కొన్నారటగా? "

"పొలం మీద అంతగా రావడం లేదండి. ఈ డబ్బు అల్లుడే అమ్మాయికిచ్చి పంపాడండి" అంది పుల్లమ్మ అమాయకంగా.

"సరే తపాలా ఖర్చు నీ కొడుకూ, అల్లుడూ ఇచ్చారు. కాగితం ఖర్చూ, సిరా ఖర్చూ కూడా వాళ్లే పంపుతారా? "

ఆ ప్రశ్నలోని వ్యంగ్యం తెలియని పుల్లమ్మ "ఆ ఖర్చు నేనే పెట్టుకుంటానండి. ఖర్చు అంటే డబ్బు ఇవ్వలేనండి. అమ్మగారు ఏపని చెప్తే అది చేస్తానండి" అంది.

★ ★ ★

చెరకు తోట నుంచి ఆర్ముగమూ, నాగన్నా గుడిసెల వైపు నడుస్తున్నారు.

"ఈ లంక గురించి ఏమీ అర్థం కావడం లేదు. అక్కడో ఊరూ, ఇక్కడో ఊరుగా మొత్తం పది ఊళ్లున్నాయేమో. ఊరంటే ఊరు కాదు. తోట యజమానులు పెద్ద పెద్ద ఇళ్లు కట్టుకుని ఉంటున్నారు. ఒక్కో

ఊరిలో పడేసి ఇళ్లంటాయేమో. వాళ్లకి దగ్గర్లో నల్లజాతి వారి గుడిసెలు.. పొలాల దగ్గరగా మన గుడిసెలూ. చెన్నపట్నంలా కాదు" అన్నాడు ఆర్ముగము.

"పంచదార మిల్లులున్నాయి కదా. వాటి దగ్గరా ఇళ్లున్నాయి. మనం దిగిన రేవులో పెద్దకోట కూడా ఉంది. ఊరెలా ఉంటేనేం మనుషులు సరిగా ఉండాలి కదా"

"అదేమిటి మనకు అక్కడకన్నా జీతం ఎక్కువ ఇస్తున్నారు కదా? "

"పనీ ఎక్కువే చేయించుకుంటున్నారు. ఖర్చులూ ఎక్కువే ఉన్నాయి"

"ఆ మాట నిజమేననుకో. కానీ చెన్నపట్నంలోనే ఉంటే ఈ సంపాదన కూడా లేదు. అందుకేగా ఇక్కడకు వచ్చింది"

"ఎప్పుడూ ఇలాగే ఉండదు. వచ్చే ఏడాది వానలు పడతాయని మా అమ్మ ఎంతగానో చెప్పింది నాకు. నేనే వినకుండా వచ్చాను"

"ఈ ఏడాది కూడా అక్కడ వానలు పడలేదుట. నిన్నగాక మొన్న ఓడ వచ్చింది చూశావా? పాండిచ్చేరి నుంచి వచ్చిన ఓడలో మా ఊరివాళ్లు నలుగురొచ్చారు. వాళ్లు చెప్పారు. అస్తమానం అమ్మ మాట వినలేదని ఆలోచిస్తూ కూచోకు. నీతో వచ్చిన భార్య సంగతి కూడా చూసుకో"

ఆర్ముగం చెప్పినదాని గురించి ఆలోచిస్తూ గుడిసెలోకి అడుగు పెట్టేసరికి మల్లమ్మ చాపమీద పడుకుని ఉండడం కన్పించింది. "ఏంటి మల్లీ! లాంతరైనా వెలిగించలేదు? " అంటూ నాగన్న ఆమె పక్కన కూచున్నాడు.

"అలసటగా ఉంది. తోటలో పని అయ్యాక దొరసాని ఇంటికి రమ్మని కబురెట్టింది. ఇంట్లో పనిమనిషికి జ్వరం వచ్చిందట. ఫనిమనిషినేమిటమ్మా అంటారు.. ఆ గుర్తొచ్చింది 'మెయిడు'. ఆ మెయిడుకి బదులు గిన్నెలు తోమి వచ్చాను. దొరలింట్లో నిల్చునే గిన్నెలు తోముతారు తెలుసా? "

నాగన్న ఆమె మీద చెయ్యి వేసి "కాసేపు పడుకో! ఈలోగా నేను లాంతరు వెలిగించి, గిన్నెలో గంజిపోసి, చేపల పులుసు కలిపి తెస్తాను" అన్నాడు. మల్లమ్మ అభ్యంతరాన్ని పట్టించుకోకుండా అంతపనీ ఆ రోజు అతనే చేశాడు. భోజనం తర్వాత భార్యాభర్తలిద్దరూ పడుకున్నారు. భర్త నిద్రపోవడం లేదని గమనించిన మల్లమ్మ "ఏమిటాలోచిస్తున్నావు? " అంది.

"నన్ను కట్టుకుని నీకు సుఖం లేదే మల్లీ" అన్నాడు నాగన్న.

"ఆ మాట నేనన్నానా? "

**కొత్తగాలి...**

**అవినీతికి**
**అంతం పలికే వారేరి?**
**అదే నీతిగా**
**సంచరించే వారేగానీ!**

– కనకసాయినాగ్,
పెనుగొండ, ప.గో.జిల్లా

"నువ్వు అన్నావని కాదు. దేశం కాని దేశం తీసుకొచ్చాను. అక్కడే బాగుండేదని పిస్తోంది. నా జీతమంతా అయ్యగారి దగ్గరే దాచుకునేవాణ్ణి. ఆయనే ఆ డబ్బుని వడ్డీకి తిప్పేవారు. కొలువు మానేసినప్పుడు కొంతడబ్బు బహుమతిగా కూడా ఇచ్చారు. ఇక్కడలా ఏముంది? "

"ఇక్కడా డబ్బుని దాచుకుంటున్నాం కదా! దాని పేరేమిటి? "

"బాంకి అంటారు. వాళ్లూ వడ్డీ ఇస్తారనుకో"

"ఇంకెందుకు బెంగ? అయిదేళ్లే కదా ఇక్కడ ఉండేది. దాచుకున్న డబ్బుతో భూమి కొనుక్కుందాం. ఉప్పాడలో



హాయిగా ఉందాం. ఇప్పుడక్కడ వానల్లేవుటగా! మొన్నొచ్చిన ఓడలో వాళ్లు చెప్పారట. నాతో ఈవేళ పనిచేసిన ఒక కూలీ చెప్పింది"

"కూలీ అన్నమాట బాగులేదే మల్లీ"

"మనని మరేమంటారు? రాజా అంటారా? "

"నువ్వు మాత్రం నా రాణివే"

మల్లమ్మ కిలకిలా నవ్వింది.

★ ★ ★

కూలిపని చేసి, దొరసాని ఇంట్లో గిన్నెలు తోమి, ఇంటికి వచ్చిన మల్లమ్మకు భర్త ఆనందంగా ఉత్తరాన్ని పదేపదే చదువుకోడం కన్పించింది.

"అత్తమ్మ రాయించిందా? " అన్న భార్యతో నాగన్న "అవును. నా చెల్లి నాగమ్మకు కొడుకు పుట్టాడట. అంటే నాకు మేనల్లుడన్నమాట. అమ్మ వాడి ముచ్చట్లు రాయిస్తూ త్వరలో వాడికి పెళ్లాన్ని కనమని మల్లమ్మకు చెప్పు అంది. త్వరలో కూతుర్ని కను. చెల్లితో వియ్యమందుదాం" అన్నాడు.

"కూతుర్నే ఎందుకు కనాలి? కొడుకు పుట్టకూడదా? " అంటున్న భార్య గొంతులో సిగ్గునీ, ఆనందాన్నీ గమనించిన నాగన్న "అయితే ఏంటి మల్లీ నిజమేనా? " అన్నాడు.

"ఏమిటి నిజం? "

"అదే నువ్వు.."

"ఆ రోజు అలసటగా ఉందని పడుకున్న రోజునే అడుగుతావనుకున్నా!"

"నిజమే!"

"ఇదిగో మల్లీ నువ్వసలు కదలద్దు. అంత పనీ నేనే చేస్తా"

మల్లమ్మ భర్త భుజం మీద చెయ్యి వేసి "నువ్వు దేవుడివి. కానీ నేను పని చెయ్యకుండా గడుస్తుందా చెప్పు. ఇక్కడ ఖర్చు పెట్టుకోవాలి. డబ్బు మిగుల్చుకుని ఉప్పాడ దగ్గర భూమి కొనుక్కోవాలి" అంది.

నాగన్న దిగాలుగా కూచున్నాడు.

"అవును నువ్వు చదువుకున్నావుగా! దొరలు నీకు గుమస్తా పని ఇస్తారేమో? "

"మన తెలుగు అక్షరాలు ఇక్కడ పనికి రావు. క్రియోల్ భాషకి అక్షరాలున్నాయో లేదో నాకు తెలియదు. దొరలు మాట్లాడే

భాష మనకి రాదు కదా!"

"దొరలందరూ కూడా ఒక్క భాష మాట్లాడరేమో కదా! మన తోట యజమానుల భాష వేరు, రేవు దగ్గర ఉండే జవానుల భాష వేరు"



"వాళ్ల దేశాలు కూడా వేరుట. ఆర్ముగం భాష వేరు, మన భాష వేరు కదా! అలాగే"

"ఏమిటో అంతా అయోమయంగా ఉంది"

నాగన్న "రేపు దొరతో మాట్లాడతా. నాకు గుమస్తాపని ఇస్తారేమో అడిగి చూస్తా" అన్నాడు.

అతని కంఠంలో ఏవిధమైన ఆశా మల్లమ్మకు కన్పించలేదు.

★ ★ ★

మర్నాడు పని పూర్తయ్యాక నాగన్న తన యజమాని దగ్గరకు వెళ్లి పాశ్చాత్య పద్ధతిలో అభివాదం చేసి నిల్చున్నాడు. దొర తన బంగళా వరండాలో కూచుని పైపులో పొగాకు పెట్టుకుంటున్నాడు.

"ఎందుకొచ్చావు? ఏం కావాలి? "

నాగన్న తన భార్య గర్భవతి అనీ, ఆమె చేత పనిచేయించడం తనకు అంతగా ఇష్టం లేదనీ, తను చదువుకున్న వాడిననీ, గుమస్తా పని ఇప్పించి జీతం పెంచితే విశ్వాసంగా పనిచేస్తానని చెప్పాడు.

"చదువుకున్నావా? ఏం చదువుకున్నావు? "

నాగన్నకు భయం వల్ల సమాధానం చెప్పడానికి సమయం పట్టింది. నెమ్మదిగా

కూడతీసుకుని తెలుగులో అక్షరాలు వచ్చుననీ, అంకెలూ, కూడికలూ, తీసివేతలూ వచ్చుననీ చెప్పాడు.

"ఫ్రెంచికానీ ఇంగ్లీష్‌కానీ వచ్చునా? "

నాగన్న బిక్క మొహం పెట్టి "రాదు" అన్నాడు.

దొర "ఆలోచించి చెప్తా" అన్నాడు.

పని సానుకూలం కాలేదనుకుని నాగన్న దొరకు తిరిగి అభివాదం చేసి తిరిగి ఇంటి దారి పట్టాడు.

★ ★ ★

తోట యజమాని తన తోటి వారందరితో భేటి అయి, నాగన్న కోరికను తెలియజేశాడు. అందరూ కోపాన్ని, అసహనాన్ని ప్రదర్శించారు.

మనం నల్లజాతి వారితో పనిచేయించుకుంటూ సుఖంగా ఉండేవాళ్లం. ఆఫ్రికన్లూ హాయిగానే ఉండేవారు. బానిసత్వ నిర్మూలన అంటూ ఇంగ్లీషువారు మన నెత్తిమీదకు సమస్యలు తెచ్చారు.

"నెపోలియన్ యుద్ధాల్లో జయించి ఉంటే మనకీ బాధ ఉండేది కాదు"

"అయితే, గియితే అనుకుంటూ కూచుంటే ఏమీ ప్రయోజనం లేదు. ఇప్పుడేం చెయ్యాలి? "

"ఇంగ్లీషు కానీ, ఫ్రెంచి కానీ రాని వాడికి గుమస్తా పని ఎలా ఇస్తాం? ఒకడికిస్తే అందరూ ఎగబడతారు. ఇండియా నుంచి కూలీలను తెచ్చి మన ప్రాణాలు తీస్తున్నారు. పోనీ కూలీలను తెచ్చేరే అనుకుందాం. ఆడవాళ్లనెందుకు తీసుకురావడం? "

"పెళ్లాం పిల్లలను వదిలి ఎవరొస్తారు? "

"ఇదంతా సరే కానీ నేనేం చెయ్యాలి" అన్నాడు నాగన్న యజమాని.

కొంత తర్జనభర్జనలయ్యాక తోటలో ఎండలో కాకుండా పంచదార మిల్లులో భార్యాభర్తలిద్దరికీ పని ఇస్తే సరిపోతుందన్న పరిష్కారం లభించింది.

★ ★ ★

బాయిలర్ దగ్గర పని దొరికిందన్న సంతోషకరమైన సంగతిని భార్యకు చెప్దామని వచ్చిన నాగన్నకు మల్లమ్మ దిగులుగా కూచుని ఉండడం కన్పించింది.

"ఏమిటి మల్లీ! అలా కూచున్నావు? ఒంట్లో బాగులేదా? "

"భయంగా ఉంది. దగ్గర అమ్మలేదు. అత్తమ్మ లేదు. పురిటికి సాయం ఎవరు చేస్తారు? అక్కడైతే ఎరుకులసాని ఉండేది. ఇక్కడెవరున్నారు? "

"నిజమే, కానీ మనతో చాలా మంది ఆడవాళ్లే వచ్చారుగా. ఆర్ముగము భార్య కూడా ఉంది"

మల్లమ్మ శుష్కహాసం చేసింది. "తనూ నా ఈడుదేగా! నాలుగైదేళ్లు పెద్దదేమో. తనకు మాత్రం ఏం తెలుస్తుంది? " అంది.

నాగన్నకేం చెప్పాలో తెలియలేదు. "నేను పుట్టక ముందు అమ్మ నాగేంద్రుడి పుట్ట చుట్టూ తిరిగి దండం పెట్టుకునేదట, నువ్వూ అలా చెయ్యి"

"పుట్ట ఎక్కడుంది? "

"నిజమే పుట్టలున్నాయో? లేదో? ఉన్నా ఎక్కడున్నాయో? తెలియదు. స్వామీ! నాగేంద్రా! మా మల్లిని చల్లగా చూడు. పుట్టబోయే బిడ్డకు నీ పేరే పెట్టుకుంటా" అని నాగన్న మొక్కుకున్నాడు.

★ ★ ★

మల్లమ్మ గర్భవతి అన్న వార్త భారతీయ కుటుంబాలన్నిటిలోనూ పాకింది. అందరూ తమ ఇంట్లోనే బిడ్డ పుడుతుందన్నంతగా ఆనందపడ్డారు. మారిషస్సులో పుట్టబోయే తొలిబిడ్డకు సంబరాలు జరపాలని నిర్ణయించారు. తమకున్నంతలో అందరూ తలో వంటా చేశారు. దొరికిన పూలతో జడకట్టారు. తమ చేతి గాజులే తీసి ఆమెకు తొడిగారు. ఎవరికి నచ్చినట్లుగా వాళ్లు, ఎవరికి వచ్చినట్లుగా వాళ్లు పాటలు పాడారు.

మల్లమ్మలో కొంత ధైర్యం కలిగింది.

పురిటి సమయానికి నల్లజాతి వనిత సాయానికి వస్తుందన్న వార్త కొంత భయం కలిగించింది.

"ఎందుకు భయం? వాళ్లు మాత్రం మనుషులు కారా? వాళ్లు మాత్రం పిల్లలను కనరా? మన గొప్పేమిటి? వాళ్ల తక్కువేమిటి?" అంది అందరిలోకీ పెద్దదయిన ఒకావిడ.

మల్లమ్మ ఊరడిల్లింది.

★ ★ ★

కొడుకు నుంచి వచ్చిన వార్త చదివించుకున్న పుల్లమ్మ పొంగిపోయింది. తనతో వచ్చిన లచ్చమ్మతో "చూశావే లచ్చీ! మల్లమ్మ నీళ్లోసుకుందిట. చూస్తూండు కూతురు పుడుతుంది. కూతురు కొడుక్కి, కొడుకు కూతురికి లగ్నం పెట్టించాలి" అంది.

"అక్కా! చాల్లే సంబడం. ఎవరైనా కొడుకు పుట్టాలనుకుంటారు కానీ కూతురేంటి? నాగన్న ఇంకా ఏదో రాశాడు కదా. పెద్ద కొలువు దొరికిందనీ, జీతం పెరిగిందనీ రాశాడు. వాటికి సంతోషించవేమిటి? ఎంతసేపూ పిల్లలూ, పెళ్లిళ్లూ తప్ప ఇంకో గోల లేదా?" అంటూ లచ్చమ్మ ఒక్కక్షణం ఆగి భళ్లున వాంతి చేసుకుంది.

పుల్లమ్మ ముఖం సంతోషంతో చేటంత అయ్యింది.

"చూశావా లచ్చీ! పిల్లల గురించి కాకపోతే ఇంకేం మాట్లాడుకుంటాం? ఈసారి నీకూ కూతురే పుట్టాలి" అంది.

"సరేలే. కరణంగారికి చెప్పి ఉత్తరం రాయించు. త్వరగా ఇంటికి పోదాం. నాగప్పని నీ మరిది దగ్గర వదిలి వచ్చాం. అన్నమైనా పెట్టాడోలేదో?"

"నీకు కొడుకు మీద ప్రేమ ఉండొచ్చు కానీ నాకుండ కూడదా?"

"నాగప్పకెన్నేళ్లు? నాగన్నకెన్నేళ్లు?" అంది లచ్చమ్మ.

"మీ గొడవతో నన్ను చంపుతున్నారు. తొందరగా ఏం రాయాలో చెప్పు" అన్నాడు కరణం.

★ ★ ★

మరో ఆరునెలలకు నాగన్న నుంచి పుల్లమ్మకు ఉత్తరం వచ్చింది కొడుకు పుట్టాడనీ, నాగేశమని పేరు పెట్టామనీ రాశాడు. తను పంచదారమిల్లులో బాగా పనిచెయ్యడం వల్ల బాయిలర్ నడిపే పనిలో తనను ఖరారు చేశారనీ, రసం తీసే యంత్రం దగ్గర చెరకు పిప్పిని పోగేసే పనిని మల్లమ్మకి ఇచ్చారనీ రాశాడు. కరణంగారి చేత ఉత్తరం రాయించుకుని నాగన్నకు పంపించే ఏర్పాటు చేసుకుని ఇంటికి వచ్చిన పుల్లమ్మకు రామయ్య ఎదురయ్యాడు.

"మరిదీ! మంచివార్త. నాగన్నకు కొడుకు పుట్టాట్ట. నాగేశమని పేరెట్టాట్ట"

**కొత్తగాలి...**

**అవును**
**మీకు తెలుసా!**
**ఢిల్లీ మారిపోయింది**
**దిల్లీగా!!**

*– గుడిమెట్ల గోపాలకృష్ణ,*
*అరసవల్లి*

"చాలా సంతోషం వదినా! నీకూ ఒక మంచి వార్త. మన గోదావరి నదికి అడ్డు కట్ట గట్టి నీళ్లన్నీ మన పొలాలకి మళ్లీస్తారట. ఇంక మనకి బంగారమే పండుతుంది. నాగన్న వచ్చేసరికి వాడి అయిదెకరాలు పదెకరాలు చేస్తా"

"గోదావరికి అడ్డం కట్టడమా? అదెలా కుదురుతుంది మరిదీ?"

"దొరలు తల్చుకుంటే ఏదైనా కుదురుతుంది. దొరలంటే ఏమనుకున్నావు? వాళ్ల దగ్గర బోలెడు యంత్రాలుంటాయి. నాగన్న రాశాడుగా, చెరకురసం తియ్యడా

నికీ, దానిని కాచడానికీ అన్నీ మరలే ఉంటాయి. గోదావరి నీళ్లు మళ్లించడానికీ మరలుంటాయేమో? "

"ఈవిషయం నీకెలా తెలిసింది? "

"లంకలో పందిళ్లు వేయించి పొలం నుంచి తిరిగి వస్తుంటే ఏటి గట్టు మీద దొర ఒకాయన కన్పించాడు. ఏవో కొల తలు తీయిస్తున్నాడు. ఏమిటని అక్కడు న్నాయన్ని అడిగాను. మన కష్టాలు చూసి దొరగారి మనసు కరిగిందట. వానలు లేక పోయినా పంటలు పండించాలంటే గోదా వరి నీళ్లు అందరికీ అందేలా చెయ్యాలను కున్నాడట. నదికి అడ్డుకట్ట కడతారట"

"ఎంత మంచి విషయం చెప్పావు. రేపే నాగన్నకింకో ఉత్తరం రాయిస్తా. వెంటనే వచ్చెయ్యమని చెప్తా"

"వదినా! ఇంకో ఉత్తరం ఎలా రాయి స్తావు? డబ్బులెక్కడున్నాయి? "

"వాళ్లింట్లో పనిచేస్తే కరణం గారు.." అంటూ చెప్పబోయిన పుల్లమ్మను ఆపి రామయ్య "ఏదో కిందా మీదాపడి రాయిం చావే అనుకో. అయిదేళ్లు పనిచేస్తేనే కానీ అక్కడ నుంచి పంపించరు. ఇక్కడ ఆన కట్ట కట్టడమూ పూర్తి కాదు. కాస్త ఓపిక పట్టు. అన్నట్లు లచ్చి ఏదీ? " అన్నాడు.

"పడుకున్నట్లుంది. నేడో రేపో కాన్పవు తుందేమో? " అంది పుల్లమ్మ.

★ ★ ★

"ఇంకొక్క ఏడాది ఇక్కడుంటే చాలు. హాయిగా ఉప్పాడ వెళ్లిపోవచ్చు" అను కుంటూ నాగన్న బాంకులో అడుగుపె ట్టాడు. తను దాచుకున్న సొమ్ము ఎంత ఉందో గుమస్తాను అడిగి తెలుసుకున్న తర్వాత అతని మనస్సు చివుక్కుమంది. ఇంటికి వచ్చిన తరువాత మల్లమ్మ "అదే మిటి అలా ఉన్నావు? " అంది.

"బాంకికి వెళ్లి వచ్చాను. డబ్బెంత ఉందో చూసి వచ్చాను"

"ఎంతుందేమిటి? "

"ఎంతుంటుందేమిటి? చెన్నపట్నంలో నాలుగేళ్లు పనిచేశాను. జీతమూ తక్కువే. ఇక్కడ నాలుగేళ్లు పనిచేశాను. జీతమె క్కువ. నువ్వూ పనిచేస్తున్నావు. అక్కడ పనిచేసి అయిదెకరాలు కొన్నాను. ఇక్కడే ముంది. లంకలో మేత గోదావరీత అన్నట్లే ఉంది"

"ఉప్పుతో తొమ్మిదీ కొనుక్కోవాలి. ఇద్దరు పిల్లలు పుట్టారాయే"

"అది కాదే. అక్కడ అయ్యగారు మంచి వారు. నా డబ్బు ఆయనే దాచి పెట్టి వడ్డీకి తిప్పి పెట్టి, వెళ్లే ముందు బహుమ తీగా కొంత మొత్తం ఇచ్చారు. ఇక్కడ దొర లలాకాదు. మనకీ, వాళ్లకీ సంబంధమే లేనట్లుంటారు"

"ఆ మాట నిజమే. అయిదేళ్లవుతోంది గా. వెళ్లిపోతాం కొన్నిరోజుల్లో"

"ఇంకా ఏడాది ఉంది"

"నాలుగేళ్లయిపోయిందిగా"

★ ★ ★

"నాలుగేళ్లయిపోయింది. ఇండియా నుంచి కూలీలు వచ్చి" అన్నాడు తోట యజమానుల సంఘం ప్రెసిడెంట్.

"మన దగ్గరున్న ఆఫ్రికన్లకు బానిసత్వం నుంచి విముక్తి లభించి కూడా నాలుగేళ్ల యిపోతోంది. వాళ్లు మన దగ్గర అయిదేళ్ల పాటు మాత్రమే అప్రెంటిస్‌లుగా పనిచె య్యాలనీ, ఆ తరువాత వారు ఎక్కడక యినా వెళ్లిపోవచ్చనీ బ్రిటీషు ప్రభుత్వం ఏనాడో తీర్మానించింది"

"వారూ వెళ్లిపోయి, వీరూ వెళ్లిపోయి మనమే మిగుల్తే ఎలాగ? "

"ఐరోపా నుంచి కార్మికులొస్తారేమో"

"వాళ్లు ఇండియన్స్ అంత కష్టపడి పని చెయ్యరు. ఇండియన్స్‌కిచ్చినంత తక్కువ జీతాలకు ఒప్పుకోరు"

"ఇప్పుడేం చెయ్యాలి? ఇండియన్ కూలీ లను ఎలాగోలా ఇక్కడ ఉండిపోయేలా మేనేజ్ చెయ్యకపోతే మనం మన

తోటల్నీ, మిల్లుల్నీ మేనేజ్ చెయ్యలేం"

"గవర్నర్‌ని కలిసి మన సమస్యను చెప్పుకుందాం"

"బ్రిటిష్ గవర్నర్ ఫ్రెంచి వారికి హెల్ప్ చెయ్యడమా? ఇంపాజిబుల్"

"సర్ విలియం నికోలాయ్ ఉండి ఉంటే నువ్వన్న మాటను నేనూ ఒప్పుకునేవాణ్ణి. మానవత్వం పేరుతో ఆయనా, సర్‌జెరెమీ కలిసి మనను అన్నివిధాలా యాతన పెట్టారు. కానీ ప్రస్తుతమున్న గవర్నర్‌తో మనకు కష్టముండదు. బ్రిటిష్ సామ్రాజ్యానికి మనం కట్టే పన్నులు చాలా ఎక్కువ. మనమే సహాయనిరాకరణ అంటే ఏమవుతుందో గవర్నర్‌కి బాగా తెలుసు"

"ఊరికి ముందే సహాయనిరాకరణా, యుద్ధమూ అని అనవద్దు. గవర్నర్‌తో సామంగానే మాట్లాడదాం. ఆయన కాదంటే మన బలం మనకెలాగూ ఉంది.

★ ★ ★

నాగన్న రాసిన ఉత్తరంతో పుల్లమ్మకు స్వర్గం నేల మీదకు దిగి వచ్చినట్లనిపించింది. భార్య మల్లమ్మతో, కొడుకు నాగేశం, కూతురు నాగమల్లితో కలిసి మారిషస్సు నుంచి వెనక్కి వచ్చేస్తున్నానని రాశాడు. తమను తీసుకొచ్చే ఓడ కోరంగి రేవుకు రాదనీ, చెన్నపట్నంలోనే లంగరేస్తుందనీ, వైశాఖ మాసంలో చెన్నపట్నం చేరవచ్చనీ, ఆ సమయానికి తల్లి చెన్నపట్నానికి చిన్నాన్న సాయంతో రాగలిగితే సంతోషిస్తానని రాశాడు.

పుల్లమ్మ ఇంటికొచ్చి మరిదికీ, తోటికోడలికి విషయం చెప్పి "లచ్చీ నువ్వు కూడా రావే. అందరం కలిసి వెడదాం" అంది.

"వదినా! చెన్నపట్నమంటే కాకినాడా, పిఠాపురం కాదు, గడియలో వెళ్లి రావడానికి. ఈ పొలం పనులొదిలిపెట్టి ఎలా

రాగలను? " అన్నాడు రామయ్య.

"అంతదూరం నాగప్ప నడవగలడా? చిన్నవాణ్ని ఎత్తుకుని నేను నడవగల నా? " అంది లచ్చమ్మ.

"మొత్తం నడవనక్కరలేదుట కదా! నర సయ్య రాశాడుగా సగంపైగా రాదారి పడ వలో వెళ్లచ్చని"

"ఇంత మందికి కేవు చెల్లించద్దా? సరేలే వైశాఖమింకా చాలారోజులే ఉందిగా. అప్పుడు చూసుకుందాం"

"నెల రోజుల ముందే బయల్దేరాలేమో"

"చూద్దామన్నాను కదా వదినా!"

పుల్లమ్మ కొంచెం చిన్నబుచ్చుకుంది, కానీ మాట్లాడలేదు.




మారిషస్‌లో తోట యజమానులం దరూ గవర్నర్‌ని కలిసి తమ సమస్యను చెప్పుకున్నారు. గవర్నర్ సానుకూలంగా స్పందించడం వారికి శుభసూచకంగా కన్పించింది.

"ఆఫ్రికన్లను ఆపడం మంచిదా? లేకపో తే ఇండియన్ కూలీలనే ఇక్కడ ఉంచెయ్య మంటారా? "

"ఇండియన్స్ పనితీరు మెరుగ్గా ఉంది. ఇండియాలో వ్యవసాయం తరతరాలుగా చేస్తున్నారు. ఆఫ్రికన్లకి అడవిలోనే బత కడం అలవాటు. ఇండియా నుంచి వచ్చిన కూలీలు కష్టజీవులు, వ్యవసాయంలో మెల కువలు తెలిసినవారు, మిల్లులలో పనివి ధానం సులువుగా నేర్చుకోగలవారు"

"ఇంకొక్క అయిదు సంవత్సరాలైనా వాళ్లను ఇక్కడ ఉంచగలిగితే మాకు లాభ సాటిగా ఉంటుంది"

"వారిని బలవంతంగా ఉంచెయ్యడం ఒక మార్గం. వెళ్లడానికి వీల్లేదని ఆర్డర్ పాస్ చెయ్యచ్చు కానీ.. " అంటూ ఆగాడు గవర్నర్.

"మీ మనస్సులోని అనుమానం కరెక్టే సర్. బలవంతంగా ఉంచి పని చేయించు కుందుకు వారు బానిసలు కారు. ఈనాడు బ్రిటిష్ సామ్రాజ్యంలో భాగమే కానీ ఇం డియా ఒకప్పుడు సర్వ స్వతంత్ర దేశం"

"కానీ ఈనాడు పరతంత్ర రాజ్యం. సంపదలో కూడా వెనుకంజ అవుతోన్న దేశం. వాళ్లకే డబ్బు ఉండి ఉంటే ఇండి యన్ కూలీలు ఇక్కడకు వచ్చే వారు కాదు" అన్నాడు గవర్నర్.

"సర్! అందుకే వారి ఆయువు పట్టయిన ధనం మీదనే మీరు దెబ్బ తియ్యాలని మా కోరిక"

గవర్నర్ "మీ సలహాలు చెప్పండి. ఏం చెయ్యాలో నిర్ణయించి బ్రిటన్ రాణి విక్టోరి యాకు ఉత్తరం పంపిస్తాను" అన్నాడు.

తోట యజమానులంతా తమకు తోచిన సలహాలు చెప్పారు. గవర్నర్ అందరు చెప్పిందీ విని "బ్రిటిష్ సింహాసనం మీ బాగోగులు విస్మరించదని మీరందరూ విశ్వసించవచ్చు" అని చెప్పి వారిని వీడు కొలిపాడు.

★ ★ ★

"ఇంక్కొక్క ఆరునెలలే మళ్లీ! ఆపైన ఓడలో చెన్నపట్నం, అక్కడనుంచి ఉప్పా డ.. ఇక్కడ మనం కూలీలం. అక్కడ మనం కామందులం" అన్నాడు నాగన్న.

"బాంకికి వెళ్ళి వచ్చావా, ఎంతుందేమి టి? " అన్న మల్లమ్మ మాటలు నాగన్న ఉత్సాహం మీద నీళ్ళు చల్లాయి.

"ఎంతుంటే ఏమిటి? మనను తీసుకొ

చ్చిన వాళ్ళే వెనక్కి దింపుతారు. హాయిగా వెళ్లిపోతాం, సుఖంగా ఉంటాం" అన్నాడు నాగన్న.

"హాయిగా వెళ్ళిపోవడమేమిటి? బియ్యం బస్తాలు తెచ్చే ఓడలో ఒక మూల మనందరినీ సద్ది, పశువులకన్నా హీనంగా తీసుకొచ్చారు. వచ్చిన కొత్తలో ఎన్ని పాట్లు పడ్డామని? ఇప్పుడేకదా ఇక్కడ వాతావరణానికీ, పనికీ, పరిస్థితులకీ అలవాటు పడ్డది. తిరుగు ప్రయాణమూ బియ్యం బస్తాల్లో, పంచదార బస్తాల్లో, ఇంకో సరుకుల్లో.. వాటిలోనే కూలపడేస్తారు"

అదే సమయంలో మల్లమ్మలో ఇంకో ఆలోచన వచ్చింది. 'చెన్నపట్నంలో జీవనం బాగుంటే ఇక్కడకు వచ్చేవాళ్ళమే కాదుకదా. ఇప్పుడు వెనక్కి వెళ్ళినా అక్కడ తిండిగడుస్తుందా?'

"ఏమిటే మళ్లీ ఏమిటాలోచిస్తున్నావు? "

"ఉప్పాడ వెళ్ళినా మన బతుకు బాగుపడుతుందా? అని"

"అత్తింటి కాపురం ఇష్టంలేదని ఇక్కడే ఉండిపోతావా? "

"అదేం మాట? తల్లినీ కొడుకునీ వేరుచేస్తానా? నాకు మాత్రం కొడుకులేడా? "

"మరెందుకు ఉప్పాడ వెళ్ళడానికి ఉత్సాహం చూపడంలేదు? "

మల్లమ్మ ఏమీ మాట్లాడలేదు. చీకటి పడుతోందని లాంతరు వెలిగించడానికి లేచింది. ఈలోగా యజమాని బంట్రోతు వచ్చి "దొర రేపు ఉదయమే అందరినీ తన బంగళా దగ్గరకు రమ్మన్నారు" అని చెప్పి వెళ్ళిపోయాడు.

"ఎందుకో? ఏమో? " అనుకున్నారు నాగన్నా, మల్లమ్మా.

★ ★ ★

అదే రాత్రి తోటయజమానులందరూ కాగడాల వెలుగుల్లో సమావేశమయ్యారు. మందూ, విందూ మధ్య నౌకర్లకు అసలు విషయం అర్థం కాకుండా ఫ్రెంచి భాషలో మాటలు ప్రారంభించారు.

"ఇండియన్ కూలీలు వెళ్ళిపోకుండా చూడడానికి బ్రిటీషు ప్రభుత్వం రెండు పౌండ్లు బోనస్ ఇస్తామని వార్త పంపింది"

"కేవలం రెండు పౌండ్లకి ఆశపడి ఉండిపోయేవారెందరు? "

"ఇండియాలో తిండికి దిక్కు లేకనేగా ఇక్కడకు వచ్చారు. ఉండకేం చేస్తారు? " అన్నాడొక యజమాని పొగరుగా.

"డబ్బాశ చూపితే చాలదు. కొంత భయపెట్టాలి. కొంత నష్టభయం చూపాలి"

"మనసుంటే మార్గముంటుంది. వెళ్ళడానికి కేవు చెల్లించమంటే సరి"

"అదేం మాట? ఒప్పందంలో రెండు వైపులా మనమే ప్రయాణ ఖర్చులు పెట్టుకుంటాం అని చెప్పే తీసుకొచ్చాం కదా"

"చాలా చెప్పాం. చెప్పని లాభాలూ వాళ్ళకి సమకూర్చాం. ఒకరోజు పనిమానేస్తే రెండు రోజుల జీతం కట్ అని అన్నాం. ఇంతవరకూ ఎవరమూ ఆ పని చెయ్యలేదు. మధ్యలో వెళ్ళిపోకుండా నెల జీతంలో రూపాయ మినహాయించుకుని వెళ్ళేముందే ఇస్తామన్నాం. మనలో చాలా మంది ఆ పని చెయ్యట్లేదు. వాళ్ళ జీతంపై ప్రభుత్వానికి టాక్స్ కట్టడం కూడా లేదు" అన్నాడు నక్కజిత్తులలో అగ్రగణ్యుడైన ఒక యజమాని.

వాదోపవాదాలు జరిగాయి. చాలామందికి నచ్చిన అంశాలను అందరూ అమలు చెయ్యడానికి నిర్ణయమైంది.

★ ★ ★

మర్నాడుదయం కూలీలందరూ యజమాని ఇంటి ముందు నిల్చున్నారు. దొర బ్రేక్‌ఫాస్ట్ పూర్తయి, సిగార్ కాల్చుకుంటూ వరండాలో కుర్చీలో కూర్చున్నాడు. ఆయన ఆదేశమిచ్చాక అందరూ ఆరుబయట నేల మీద కూచున్నారు. నవంబరు నెలలోనే ఎండలు మండిపోతున్నాయి. ఉదయపు ఎండ కూడా తాళలేకుండా ఉంది.

యజమాని చెప్పిన మాటలు మండు టెండ కన్నా ఎక్కువ వారి మనస్సును మాడ్చి వేశాయి. అయిదేళ్ళ చివర వెళ్ళిపో కుండా ఉండేవారికి ఇంగ్లండు రాణి విక్టోరియా దయతో రెండు పౌండ్లు బహుమతిగా ఇస్తుందని ప్రకటించింది. రెండు పౌండ్లంటే ఇండియా లెక్కన ముప్పై రూపాయలు. అలా కాకుండా వెళ్ళిపోవాలనుకుంటే కూలీలు ఓడకు కేవు చెల్లించాలి. ఒంట్లో బాగులేకనో, వేరేపని మీదనో, ఆడవాళ్ళయితే పిల్లలు కనడం వల్లనో పని మానేసిన రోజుని లెక్కకట్టి రోజుకి రెండు రోజుల జీతం కోసి వేస్తారు. మిగిలిన డబ్బుతో ఇండియా తిరిగి వెళ్ళిపోవచ్చును. ఏ విషయమూ నెలలోగా చెప్పాలి.

యజమాని చెప్పదల్చుకున్నది చెప్పి, ఎండ వేడి తాళలేనట్లుగా ముఖం పెట్టి లోపలకు వెళ్ళిపోయాడు. బంగళా నౌకర్లు వట్టివేళ్ళ తడకలను దింపి నీళ్ళతో తడిపే ప్రయత్నం మొదలెట్టారు. బయట కూచున్న కూలీలలో కలకలం ప్రారంభమైంది. దొర చెప్పిన మాటలు అందరికీ బాణాల్లా గుచ్చుకుంటున్నాయి. ఏం చెయ్యాలంటూ అందరూ మాట్లాడడం ప్రారంభించేసరికి లోపల నుంచి బట్లర్ వచ్చి "దొరసాని ఇంకా నిద్రలేవలేదు. ఇలా అందరూ అరిస్తే మేడమ్‌కి మెలకువ వచ్చేస్తుంది. ఇక్కడ నుంచి వెళ్ళిపోండి" అన్నాడు.

కూలీలందరూ లేచి పంచదార మిల్లు వైపు నడవసాగారు. "డబ్బుంటే ఏం లాభంలేదు. లక్షాధికారయినా ఉప్పు వేసుకుని అన్నం తింటాడు కానీ బంగారం తినడు అని నరసింహ శతకం చదువుతుంటావు నాగన్నా. డబ్బుంటే లాభంలేక పోవడమేమిటి? దొరసానింకా నిద్రపోతోంది. మనం ఎండలో మాడుతున్నాం" అన్నాడొక కూలీ.

"నాకు డబ్బే ముఖ్యం. రాణీగారు తలకి రెండు పౌండ్లు అంటే ముప్ఫైరూపాయలు చొప్పున ఇస్తారంటే నేనూ, మా వాళ్ళూ ఉండిపోతాం" అన్నాడు ఆర్ముగం.

"నేనూ ఉండిపోతా" అన్నాడింకొకడు.

"వెడదామన్నా నాకు ఓడ కేవుకి డబ్బుల్లేవు. ఎప్పటికప్పుడు తునిలో అప్పులు తీర్చడానికి పంపించాను" అన్నాడింకొకడు.

"వెళ్ళి పెళ్ళి చేసుకుని పిల్లను తీసుకుని వస్తానని" ఒకడంటే "నీకు పిల్లనెవరిస్తారు? దేశంకాని దేశం ఎవరు పంపుతారు? " అని ఇంకొకడన్నాడు.

అందరూ ఎవరికి తోచింది వాళ్ళు మాట్లాడుతున్నారు. పంచదార మిల్లు చేరుకుని నీడలో కూచునేదాకా నాగన్న నోరు విప్పలేదు.

"ఏం నాగన్నా నువ్వేమీ మాట్లాడవేమిటి? " అని అడిగారు.

"ఏం మాట్లాడాలో తెలిస్తే కదా ఏదైనా మాట్లాడడానికి? ఇంక వెళ్ళిపోతామనుకుంటూండగా దొరగారు కొత్త సంగతులు చెప్పారు. మనని తీసికొచ్చేటప్పుడు వెనక్కి వెళ్ళే ఖర్చు కూడా వాళ్ళే పెట్టుకుంటారని చెప్పే తీసుకొచ్చారు. మనం వేలిముద్ర వేసిన కాగితం మీద ఆ విషయముందని ఏజెంటు దుబాసీ చెప్పాడు. ఇప్పుడిలా అంటూన్నారేమిటి? " అన్నాడు నాగన్న.

"దుబాసీ చెప్పిందంతా కాగితం మీద ఉందో? లేదో? నువ్వు చూడలేదా? చదువుకున్నోడివి కదా"

"నాకు తెలుగు వచ్చు దొరల భాష రాదు. ఇక్కడకు వచ్చి మీ అందరిలాగానే క్రియోల్ మాట్లాడడం నేర్చుకున్నాను"

"మనని మోసం చేస్తున్నారంటావా? " అని ఒకడంటే "దొరలు మోసం చెయ్యరు" అని ఇంకొకడన్నాడు.

"కోరటుకి పోతే? " అని ఇంకొకడంటే "వాళ్ళూ దొరలే, వీళ్ళూ దొరలే. మన మాటలు ఎవరు వింటారు? " అని మరొకాయన అన్నాడు.

"మీరంతా కోరటుకి పోండి. నేను

ఇక్కడే ఉండిపోతాను. నాకు మా ఊరె
డితే ఈ మాత్రం తిండి కూడా దొరకదు"
అని ఒక కూలీ లేచిపోయాడు.

"సరే ఇంకా నెలరోజుల గడువుంది కదా" అని అందరూ లేచి తమ తమ పనులకు బయల్దేరారు.

★ ★ ★

రాత్రి నాగన్న చాపమీద దొర్లుతూనే ఉన్నాడు. పిల్లలిద్దరినీ నిద్రపుచ్చిన మల్లమ్మ భర్తను పలకరించడానికి కూడా భయపడింది. అతని మనస్సులో ఉన్న ఆవేదన అర్థాంగిగా ఆమెకు బాగా అవగతం. తల్లి చుట్టూనే అతని ఆలోచనలు పరిభ్రమిస్తూ ఉంటాయి. తన అత్తగారు కొడుకుని ఎంత గాఢంగా ప్రేమిస్తున్నదీ, అతి కష్టం మీద కానీ అతన్ని మారిషస్ పంపలేకపోయిందన్నదీ కూడా ఆమెకు బాగా తెలుసు. తన భర్త రాసినన్ని ఉత్తరాలు తోటికూలీలందరూ కలిపి కూడా వాళ్ళ ఇళ్ళకు రాసి ఉండరు. ఇక వెళ్ళిపోతామని అనుకుంటూండగా యజమాని కొత్త సంగతి చెప్పాడు. వైశాఖమాసానికి చెన్నపట్నం చేరుకుంటామని తన భర్త తల్లికి ఉత్తరం కూడా రాసివేసేశాడు. ఇప్పుడు రావడంలేదంటే అక్కడ అత్తగారు తట్టుకోగలదా? అసలు వెళ్ళకుండా ఇక్కడ ఈయన ఉండగలడా?

ఆ రాత్రి నాగన్నకు కానీ, మల్లమ్మకు కానీ నిద్ర సరిగా పట్టలేదు. అయినా మర్నాడు పంచదార మిల్లుకెళ్ళి పనిచెయ్యడం తప్పలేదు.

★ ★ ★

నెలరోజులపాటు కూలీల మధ్య వేరే ఏ విషయం మీదా సంభాషణ లేదు. ఒక్కటే సంగతి. ఇక్కడే ఉండిపోవాలా? వెనక్కి వెళ్ళిపోవాలా?

మర్నాడు ఏ సంగతీ చెప్పాలనగా ముందు రోజు సాయంత్రం గుడిగా అందరూ భావించుకునే గుడిసెలోకి వెళ్ళి నాగన్న దేవుళ్ళందరికీ దండం పెట్టుకున్నాడు. "దేవుడా! నేనేం చెయ్యాలో నువ్వే చెప్పు" అని ప్రార్థన చేసుకుని బయటకు వచ్చి సముద్రతీరంలో కూచున్నాడు. మల్లమ్మ పిల్లలను తీసుకొచ్చి అతని పక్కనే కూచుంది. పిల్లలు ఇసుకలో ఆడుకుంటున్నారు. మల్లమ్మ నాగన్న చెయ్యి తీసుకుని తన చేతిలో ఉంచుకుంది. భార్యాభర్తలిద్దరూ మౌనంగా కూచున్నారు. చీకట్లు ముసురుకుంటున్నాయి. మల్లమ్మ లేచి "పిల్లలూ! పదండి పోదాం" అంది.

"కొంచెం సేపుంటాం" అని నాగేశం అంటుంటే "ఉంటాం" అని నాగమల్లి ముద్దుగా అంది.

"ఇంక చాలు పదండి" అంది మల్లమ్మ పిల్లలిద్దరి చేతులూ పట్టుకుని.

## జ్ఞానసాగరం!

విద్యాసాగర్‌ను మొదటిసారి కలిసినప్పుడు 'ఆహా! ఇన్నాళ్ళకు నేను ఓ మహా జ్ఞానసాగరాన్ని దర్శించాను. దీనికి ముందు కేవలం కొన్ని కాలువలను, గుంటలను, చెరువులను



మాత్రమే చూశాను' అని ఆధ్యాత్మికవేత్త రామకృష్ణ పరమహంస నవ్వుతూ అన్నారు.

విద్యాసాగర్ కూడా దీనికి ధీటుగా స్పందిస్తూ 'కానీ సాగరంలోని నీళ్లు చాలా ఉప్పగా ఉంటాయి. అవి మీకేమాత్రం పనికి రావు. అంతగా కోరికయితే మీరు ఈ నీళ్లను కొద్దిగా స్వీకరించవచ్చు' అని అన్నారు.

ఇద్దరూ తల్లి నుంచి విడిపించుకుని తండ్రి దగ్గరకొచ్చి అతని ఒళ్ళో కూచున్నారు.

"నాన్నా ఇక్కడే బావుంది. ఇక్కడే ఉండిపోదాం" అని నాగేశం అన్నాడు.

"నాన్నా! ఇక్కడే బావుంది ఉండిపోదాం" అని నాగమల్లి అన్నని అనుసరిస్తూ చెప్పింది.

"ఇక్కడే ఉండిపోదాం.. ఇక్కడే ఉండిపోదాం.." అంటూ పిల్లలిద్దరూ అరవసాగారు. పిల్లల మనస్సులో ఉన్నది సముద్ర తీరం, నాగన్న మనస్సులో మెదిలింది మారిషస్. 'బాలవాక్కు బ్రహ్మవాక్కు' అంటారు కదా అని మనసులో అనుకున్నాడు నాగన్న.

పిల్లల మాటలు వింటూ 'మారిషస్‌లో ఇంకో అయిదేళ్లు ఉందామా?' అని అనుకున్న నాగన్నకు ఇంటికి రాగానే మనస్సు మారిపోయింది. చెన్నపట్నంలో కొలువు గుర్తుకొచ్చింది. ఎప్పుడైనా దూరప్రాంతం వెళ్ళాల్సివస్తే యజమాని తనకు అవసరమైనన్ని మేనాలతో పాటు ఒక మేనాను అదనంగా తీసుకొచ్చేవారు. నౌకర్లలో ఎవరికైనా అనారోగ్యంగా ఉంటే వారిని ఆ మేనాలోకి ఎక్కించేవారు. తానే వారికి వైద్యం చేసేవారు. జీతమెక్కువ కదా అని ఇక్కడకు వచ్చాడు. ఒకరోజు పనిమానేస్తే రెండు రోజుల జీతం కోస్తున్నారు. తిరుగు ప్రయాణానికి ఓడకేవు ఇస్తామని చెప్పి ఇప్పుడు మాట తప్పుతున్నారు. ఇలాంటి మానవత్వం లేని వాళ్ళ దగ్గర పని చెయ్యడంకన్నా వెనక్కి వెళ్ళిపోయి అడుక్కుతినడం మంచిది.

'నీ పిల్లలను ముష్టివాళ్ళను చేస్తావా?' అన్న ప్రశ్న మనస్సులో కొరడాతో కొట్టినట్లుగా ఉదయించింది. ఇక్కడే ఉండిపోయి అయిదేళ్ల తర్వాత వెళ్ళడం మేలేమో? గోదావరి మీద ఆనకట్టకట్టి నీళ్ళు మళ్ళిస్తున్నారనీ, పొలాల్లో త్వరలోనే బంగారం పండుతుందనీ అమ్మ రాయించిన ఉత్తరంలో ఉంది. చెన్నపట్నానికి రాదారి పడవలు వెళ్ళేలా కాలవ తవ్వారు కనుక ధాన్యం పండించి పట్నంలో అమ్ముకుని లాభాలు గడించవచ్చు. అయిదేళ్ళలో ఇక్కడ కొంత డబ్బు మిగుల్చుకుని వెళ్ళవచ్చు.

ఇంకో అయిదేళ్లు నన్ను చూడకుండా అమ్మ ఉండగలదా? చెన్నపట్నం పంపడమే ఆవిడకు ఇష్టంలేదు. మారిషస్ ఎలా పంపించిందో? ఎంత ఏడ్చిందో? అంతకాలం నేను మాత్రం ఆమెను చూడకుండా ఉండగలనా? ఏం చెయ్యాలి?

తెల్లవారిన తరువాత యజమాని దగ్గరకు తమ నిర్ణయం చెప్పడానికి కూలీలందరూ వెళ్ళే దాకా కూడా నాగన్న మనస్సు అటూ ఇటూ ఊగిసలాడుతూనే ఉంది.

★ ★ ★

పుల్లమ్మ మరిదితో, తోటికోడలితో, వారి పిల్లలతో చెన్నపట్నం కూతురింటికి చేరుకుంది. ఆమె అల్లుడు పడవలు ఆగే చోటికి వచ్చి ఇంటికి తీసికెళ్ళాడు. దారిలో ఉన్న కోటనూ, కూవం నదినీ చూపిస్తూ ఇంటికి తీసుకొచ్చి తాముండే పేటను తిరువళ్ళిక్కేణి అంటారనీ, పేటలో పార్థసారథి స్వామి ఆలయముందనీ చెప్పి ఆలయగోపురం చూపించాడు.

"స్వామీ! నాగన్న క్షేమంగా తిరిగివస్తే నీకు పొర్లుదండాల మొక్కు తీర్చుకుంటాను" అని పుల్లమ్మ ఆలయశిఖరాలు చూస్తూ మొక్కుకుంది.

ప్రతిరోజూ సముద్రతీరానికి వెళ్ళడం, దూరంగా కన్పిస్తున్న చేపల పడవలను చూస్తూ కూచోడం, ఏదైనా ఓడ కన్పిస్తే నాగన్న వస్తున్నాడేమో అని ఆశపడుతూండడం పుల్లమ్మకు దినచర్యగా మారింది.

"ఎదురుగా ఉన్న కూతురు కన్పించదు. సొంత అక్కకన్నా ఎక్కువగా చూసుకుంటున్న తోటికోడలు కంటికి ఆనదు. మా పిల్లలెవర్నీ చేరదియ్యదు. ఎంతసేపూ కొడుకు, కొడుకు, కొడుకు.. ఇంకెవరూ మను

షులు కారా? ఇంకెవరి మీదా ప్రేమ ఉండదా? " అని నాగమ్మ విసుక్కుంది.

"నాగమ్మా! ఊరుకో" అంటూ నరసయ్య ఆమెను శాంతింప చేసేవాడు.

మారిషస్ నుంచి నాగన్న రాలేదు కానీ అతను పంపిన ఉత్తరం వచ్చింది. నరసయ్య కూడబలుక్కుంటూ చదివాడు. "గంగాభాగీరథీ సమానురాలైన అమ్మకు నమస్కరించి తమ కుమారుడు నాగన్న రాయునది.. నేను ఇదివరలో రాసినట్లుగా వైశాఖమాసానికి అక్కడ ఉండేలా రాలేక పోవుచున్నాను.

"అయితే ఎప్పుడొస్తాడో? తొందరగా చదువు" అంది పుల్లమ్మ.

"ఇప్పుడే వచ్చినచో కేవు మేమే పెట్టుకొనవలెను. ఇక్కడే ఉండిపోయినచో తల ఒక్కింటికి ముప్పది రూపాయలిచ్చెదమని రాణీగారు ప్రకటించినారు. అయిదేళ్ల తరువాత వచ్చినచో అనేక లాభములు కలవు, ఇప్పుడే వచ్చినచో అనేక కష్టములు కలవు. కనుక ఇక్కడే ఉండి పోదమని మాకూలీందరు కలిసి తీర్మానించినారు. అయిదేళ్ళ తరువాత తప్పక ఉప్పాడ వచ్చి మీ వద్దనే శాశ్వతముగా ఉండిపోగలవాడను. మిమ్ములను రాణిగా చూడవలెనని నా ఆశ. అందుకు ఇక్కడ తప్పని సరిగా ఉండి మరింత ధనమార్జించవలెను. చిన్నాన్నకు, పిన్నికి, బావకు నమస్కారాలు. చెల్లికి, పిల్లలకు ఆశీస్సులు, ఇట్లు మీ కుమారుడు నాగన్న"

ఉత్తరం పూర్తి అయ్యీ కాకుండానే పుల్లమ్మ కుప్పకూలిపోయింది. ఎవరికీ ఏం చెయ్యాలో, ఏం మాట్లాడాలో తోచలేదు.

★ ★ ★

రెండు రోజుల వరకూ ఎవరూ పుల్లమ్మతో మాట్లాడడానికి కానీ, భోజనానికి రమ్మనడానికి కానీ సాహసించలేకపోయారు. ఆమె దగ్గర చనువుగా ఆడుకునే

నాగప్ప కూడా దగ్గరకు వెళ్ళలేదు. సముద్రతీరంలో కూచోడమో, పార్థసారథిస్వామి ఆలయంలో స్వామితో తిరస్కారపూర్వకంగా సంభాషించడమో, రాత్రి ఇంటికి వచ్చి ఒక మూలన పడుకుని గొణుక్కోడమో తప్ప బాహ్యప్రపంచంతో సంబంధం లేదామెకు. ఆలయంలో కూచుని "నీకు పొర్లుదండాలు మొక్కుకున్నాను. నా కొడుకుని క్షేమంగా నా దగ్గరకు చేర్చమన్నాను. అమ్మ మనస్సు నీకేం తెలుసు" అని అనుకుంటూ ఉండేది.

మూడోరోజు ఉదయం నాగమ్మ "చిన్నాన్నా! అమ్మను చూస్తుంటే నాకు భయంగా ఉంది" అంది.

రామయ్య కొంచెం గట్టిగా "వదినా! ఇలాగే ఉంటే చాలా కష్టమమ్మా! నాగప్పను చూడు ఎంత డీలా పడిపోయాడో! నాగన్న ఇక్కడకు రానని ఏమీ రాయలేదుగా. వాడి ఇబ్బందులు రాశాడు. చేతిలో డబ్బుంటేనే కదా మిగిలిన సంగతులు ఆలోచించగలం. ఇక్కడ పరిస్థితులేమైనా బాగున్నాయా? చెప్పు. కరువూ కాటకం. ఆనకట్ట పని ఇంత వరకూ అవలేదు. మనమే ఓ పూట తింటే ఓ పూట పస్తుంటున్నాం. చెన్నపట్నంలోనూ జీతాలేమీ గొప్పగా లేవు. నాగన్న ఇక్కడకు వచ్చినా కొలువు దొరుకుతుందో? లేదో? కలోగంజో కలిసి తాగుదాం అనడానికి కూడా లేదు. కలీగంజీ మాత్రం ఎక్కడ ఉన్నాయి? కాస్త ఆలోచించు" అన్నాడు.

నరసయ్య అందుకుని "మా అయ్యగారి వడ్డీ వ్యాపారం కూడా సరిగా లేదత్తమ్మా. రైతులు ఏడాది మొదట్లో అప్పు తీసుకుని వ్యవసాయప్పనులు చేసుకునేవారు. పంట రాగానే అప్పు తీర్చేవారు. వాళ్లే పొలాలు బీడు పెట్టేస్తున్నారు. నాగన్నను నాలుగేళ్లు అక్కడే ఉండనిస్తే మంచిది. పరిస్థితులు చక్కబడ్డాక వస్తేనే నయం" అన్నాడు.

పుల్లమ్మ కొంత తెప్పరిల్లింది. మళ్ళీ కొంతసేపు కుమిలి కుమిలి ఏడిచింది. కొంతసేపు తెల్లదొరతనాన్ని తిట్టింది. అయిదరాబాదు జమానా బాగుండేదంది. కాసేపు కోడలే కొడుకుని తనకు కాకుండా చేసిందని, మల్లమ్మకు అత్తింటి కాపురం ఇష్టం లేదు అందుకని అదే వెర్రి వెధవ నాగన్నతో చెప్పి అక్కడే ఉండి పోదామని చెప్పి ఉంటుందంది. మారీచుడి లంకలో ఎవరో తన కొడుక్కి మాయమాటలు చెప్పో, మందు పెట్టో వాడి మనస్సు మార్చేసి ఉంటారంది.

ఆమె ఏం మాట్లాడినా, ఎవర్ని తిట్టినా రామయ్య ఎవరినీ నోరెత్తనివ్వలేదు. ఏడ్చి, ఏడ్చి, తిట్టి, తిట్టి చివరగా ఆమె మనస్సు కొంత తేలికపడింది.

"అమ్మా! అన్నానికిరా" అని నాగమ్మ పిలిస్తే కొంత రాగి జావ తాగింది.

"అమ్మను ఇక్కడే ఉంచేసుకుంటాను చిన్నాన్నా! మనవలతో ఆడుకుంటూ ఉంటే ఆమెకు అన్నయ్య గురించిన బెంగ కాస్త తక్కువవుతుందేమో" అని నాగమ్మ అంటే "ఉప్పాడ అలవాటైన ఊరు కదా. మాతో పాటు రోజూ పొలం పనికి తీసికెడతా" అని రామయ్య అన్నాడు.

"ఆవిడకెలా ఇష్టమైతే అలాగే చెయ్యొచ్చు" అన్నాడు నరసయ్య.

"ఏమక్కా! ఏమంటావు? మాతో ఉప్పాడ వచ్చెయ్యి. నాగప్పకి నీ దగ్గరే అలవాటు కదా" అంది లచ్చమ్మ.

కొంత తర్జన భర్జనలయ్యాక కొన్నాళ్ళిక్కడే ఉంటుందని అందరూ కలిసి అనుకున్నారు. పుల్లమ్మ నోట్లోంచి ఒక్క మాట కూడా రాలేదు.

★ ★ ★

"అమ్మ చెన్నపట్నంలోనే ఉందిట. బావ ఉత్తరం రాశాడు. మనవలతో ఆడుకుంటూ, పార్థసారథి స్వామి గుడికి వెడుతూ కాలక్షేపం చేసుకుంటోందిట. తల్లి బాధ్యత కొడుకు తీసుకోవాలి.

కూతురి దగ్గరా, అల్లుడి దగ్గరా అమ్మని ఉంచి నేనిక్కడున్నాను" అన్నాడు నాగన్న.

"నువ్వేం సరదాలకి బాధ్యతలను వదిలి పెట్టావా? తాగి తందనాలాడుతూనో, సానివాడల్లో తిరుగుతూనో అమ్మని పట్టించుకోవడం లేదా? తప్పనిసరైన పరిస్థితుల్లో ఇక్కడ ఉంటున్నాం. ఎలాగూ అక్కడకు వెళ్ళి పోతాం" అంది మల్లమ్మ.

నాగన్న ఒక్క క్షణం ఆగి "అమ్మకి నా మీద కోపం వచ్చినట్లుంది. ఉత్తరం తను రాయించినట్లు లేదు. బావే రాశాడు" అన్నాడు.

"నీ తెలివి తెల్లారినట్లు ఉంది. ఏ తల్లికీ కొడుకు మీద కోపముండదు. ఉప్పాడలో ఉంటే నాగలాపల్లె కరణంగారి చేత ఉత్తరాలు రాయించేది. ఇంటి అల్లుణ్ణి ఉత్తరం రాసి పెట్టమని ఎలా అడుగుతుంది? బాబూ, నాగన్నకో క్షేమ సమాచారం రాసి పంపించు నాయనా అంటుంది. రేపే ఓ ఉత్తరం రాసి పంపించు. తపాలా పడవ వెళ్ళి పోతుందేమో"

"మల్లీ మంచి తెలివైనదానివే, నువ్వన్నట్లే అయి ఉంటుంది. రేపే ఉత్తరం పంపుతా"

★ ★ ★

కానీ నాగన్నకు ఆరు నెలల తర్వాత వచ్చిన ఉత్తరం కూడా తల్లి రాయించలేదు. చిన్నాన్న క్షేమ సమాచారం రాస్తూ తల్లి ఉప్పాడలో ఉందని రాశాడు.

"చూశావుగా మల్లీ! అమ్మ ఉత్తరం రాయించలేదు. అయిదేళ్ళలో వచ్చేస్తానని మాట ఇచ్చి వచ్చాను. మాట తప్పాను. ఆవిడ నా ముఖం చూడదు"

మల్లమ్మకి ఏం చెప్పాలో తెలియలేదు. ఇక్కడింత మంది కూలీలున్నారు. ఎవరైనా ఇలా ఉన్నారా? ఏమో ఉన్నారేమో ఎవరిళ్ళల్లో ఏం జరుగుతోందో ఎవరికెరుక?

"అలా ఎందుకవుతుంది? నువ్వు ఉప్పాడలో అడుగుపెట్టగానే నిన్ను దగ్గరకు తీసుకోకపోతే నీ చేత్తో పలుగెత్తి నా తల బద్దలుకొట్టు"

"నిజమేనంటావా?"

"నూటికి నూరుపాళ్ళు నా మాట నిజం"

★ ★ ★

ఉప్పాడలో రామయ్య, లచ్చమ్మా మాట్లాడుకుంటున్నారు.

"వదినను చూస్తే భయమేస్తోంది. ఎంతసేపూ సంద్రం దగ్గర కూచుని తనలో తానే గొణుక్కుంటుంది. బలవంతాన పొలానికి తీసికెళ్ళినా ప్రయోజనం లేదు. ఏం చెయ్యాలో తెలియట్లేదు. ఏ అఘాయిత్యానికైనా ఒడికడితే అటు కనిస్టేబులుతో చావు. ఇటు నాగన్న కూడా నన్నే అంటాడు. మా అమ్మని సరిగా చూసుకోలేదని"

"పోనీ నాగన్నను వచ్చెయ్యమని ఉత్తరం

కొత్తగాలి... 

**మేధావులకు**
**సహజ కుండలాలు**
**ఆలోచనలు!**

- వి. రాఘవరావు,
హైదరాబాద్

పంపించు"

"ఓడలో రావడానికి డబ్బుల్లేవని రాశాడు కదా"

"అదే చెప్దామనుకుంటున్నా, ఇక్కడ అయిదెకరాలూ తల్లిపేరనే కొన్నాడు కదా! ఆ పొలం తనఖా పెట్టి డబ్బు పంపిస్తానని రాయి. లేదంటే అప్పు చేసి రమ్మను. ఇక్కడకు వచ్చాక పొలం తనఖా పెట్టో అమ్మివేసో అప్పు తీర్చుకుంటాడు. వాడు రాకుంటే ఈవిడను సంబాళించలేం"

"ఇక్కడ నుంచి తపాలాలో ఉత్తరం పంపచ్చు కానీ డబ్బు పంపచ్చా"

"రేపు కాకినాడ వెళ్ళి తపాలా రన్నరుని

అడుగు"

"అలాగే"

★ ★ ★

కానీ రామయ్యకు ఉత్తరం రాయించి పంపే అవసరం కానీ, తపాలారన్నరు దగ్గరకు వెళ్ళే పనికానీ లేకపోయాయి. ఆ రాత్రే కొడుకు మీద బెంగతో క్షీణించి పోయిన పుల్లమ్మ ప్రాణాలు అనంత వాయువులో కలిసిపోయాయి.

రామయ్య దిగాలుగా కూచున్నాడు. లచ్చమ్మ "అక్కా" అంటూ వెక్కి వెక్కి ఏడిచింది. నాగప్ప "పెద్దమ్మా" అంటూ పుల్లమ్మ శవం మీదనే పడుకున్నాడు.

చెన్నపట్నం నుంచి వచ్చిన నాగమ్మ "కూతురిలో కొడుకుని చూసుకుంటే ఇలా జరిగి ఉండేది కాదు కదే? " అంటూ కుమిలిపోయింది.

★ ★ ★

మారిషస్‌లో ఉత్తరం చూసిన వెంటనే నాగన్న భోరున ఏడవడం మొదలెట్టాడు. మల్లమ్మకు ఉత్తరంలోని విషయం తెలియక కంగారుపడి పక్కనున్న గుడిసెలవాళ్ళను పిల్చుకొచ్చింది. తండ్రి ఏడుపు చూసిన నాగేశం, నాగమల్లి భయపడి ఏడవసాగారు. దగ్గర గుడిసెలలోని కూలీలు ముందుగా, దూరం గుడిసెల వాళ్ళు వెనకగా వచ్చారు. నెమ్మదిగా విషయం రాబట్టుకుని ఓదార్చారు. "ఆఖరు చూపులైనా దక్కలేదు, నా చేతుల్లో వెళ్ళిపోవాలనుకునేది, అమ్మను రాణిలా చూసుకోవాలనుకున్నాను, అనాథలా చచ్చిపోయింది" అంటూ ఆవేదన తట్టుకోలేక నాగన్న ఆర్ముగం ఒళ్లో తలపెట్టుకుని ఏడ్చాడు.

దుఃఖం కాలుతున్న గిన్నెలాంటిది. గిన్నె చల్లారినట్లే దుఃఖాగ్ని కూడా నెమ్మదిగా తగ్గిపోతుంది. గాయం మాయమయినా మచ్చ మిగిలినట్లే నాగన్న గుండెల్లో తల్లికి తగిన న్యాయం చెయ్యలేకపోయానన్న పశ్చాత్తాప భావన బతికినంత కాలం ఉండిపోయింది. తల్లిలేని ఉప్పాడకు తిరిగి రావలసిన అవసరం అతనికి కనిపించలేదు..

★ ★ ★

టపటపమని పడే తొలివాన చినుకుల్లా కన్నీళ్లు చేతుల మీద పడడంతో వత్సల ఉలిక్కిపడి వర్తమానంలోకి వచ్చింది, నూట డెబ్భైఆరేళ్లకిందట ఆ తల్లీ కొడుకులు ఎంత బాధపడ్డారో, దేశంకాని దేశం పంపడానికి తల్లి ఎంత కుమిలిపోయిందో, తల్లిని వదిలి వెళ్ళడానికి ఆ కొడుకు ఎంత తల్లడిల్లాడో.

కళ్ళు తుడుచుకుంటూ వత్సల ఎదురుగా కూచ్చున్న హర్షవర్ధన్‌కేసి చూసింది. అతను కన్నీళ్ళు కనుల నుంచి బయటకు రానివ్వడం లేదు.

కథ చెప్తున్న పెద్దావిడ గొంతుక పూడుకుపోతుండగా "ఆనాడు జరిగిన విషయాలివే. తరువాత కాలంలో గోదావరిపై ఆనకట్ట పూర్తయింది. రామయ్య పొలాలలో బంగారం పండింది. అతను పాతిక ఎకరాల మాగాణీకి ఆసామీ అయ్యాడు. చెన్నపట్నంలో నరసయ్య యాజమాని వడ్డీ వ్యాపారం చిన్న బ్యాంకుగా మారింది. నరసయ్య బ్యాంకులో నౌకరుగా, ఆపైన గుమాస్తాగా పనిచేశాడు. అందరూ లక్ష్మీసరస్వతుల కటాక్షం పొంది సుఖంగా బతికారు. మా అమ్మమ్మ అమ్మమ్మ మాత్రం కొడుకు కోసం కుమిలికుమిలి చచ్చిపోయింది" అని ముగించింది.

అయిదు నిమిషాలపాటు నిశ్శబ్దం రాజ్యం చేసింది. వత్సల హర్షవర్ధన్‌కేసి చూస్తూ కూచుంది.

అతను ఏమీ మాట్లాడడం లేదు సరికదా ఏం ఆలోచిస్తున్నాడో తెలియడం లేదు. ఆర్ద్రమైన అతనికళ్ళను చూస్తూ అతని ఆర్ద్ర హృదయాన్ని ఊహిస్తున్న ఆమె మనస్సు ఆర్ద్రమై పోయింది.

ఆపైన హర్షవర్ధన్ నెమ్మదిగా "ఉప్పాడ

# చతుర ప్ర.జ. 1



జిజ్ఞాసువులైన పాఠకుల ఆదరాభిమానాలు అత్యంతంగా చూర గొన్న 'చతుర ప్ర.జ' శీర్షికను నిర్వహించడానికి ప్రవచన వాచస్పతి, అభినవ వ్యాస **టి.కె.వి. రాఘవన్** అంగీకరించారు.

ఆచార వ్యవహారాలు.. సంస్కృతీ సంప్రదాయాలు.. పురాణాలు, ఇతిహాసాలు.. శ్రుతులు.. స్మృతుల పరంగా కలిగే మీ సందేహాలను క్లుప్తంగా రాసి మాకు పంపండి. మీ పేరు, చిరునామా, ఫోన్ నంబరు కూడా ప్రశ్నతో రాసి పంపండి. ప్రతి ప్రశ్నకు ఈ కూపన్ తప్పనిసరిగా జతపరచాలి. కూపన్ జతపరచని ప్రశ్నలు పరిగణనలోకి తీసుకోబోమని గ్రహించ మనవి.

ఉత్తమ ప్రశ్నకు రూ.116/-

చిరునామా : **చతుర ప్ర.జ.**
చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 082

---

నుంచి వెళ్ళిన వారిలో నాగన్న అన్న పేరున్న వాళ్ళు ఇంకెవరైనా ఉన్నారా?" అని అడిగాడు.

"తెలియదు నాయనా, తరతరాలుగా చెప్పుకుంటుంటే విన్న సంగతులివి" అంది పెద్దావిడ. కాసేపు కదలకుండా కూచున్న అతను లేచి నిలబడి "మీకు చాలా శ్రమ ఇచ్చాను. ఇక శలవిప్పించండి" అన్నాడు.

"అదేమిటి, అప్పుడే వెళ్ళిపోతావా? మా ఊరు వాడివే నువ్వు, భోజనం చేసి వెళ్ళు. నేనేమీ శ్రమ పడను, హోటల్నించి తెప్పిస్తా, చాలా బాగుంటుంది"

అతను ఎంత మొహమాట పడ్డా ఆమె వదిలిపెట్టలేదు.

★ ★ ★

కాకినాడ బీచ్‌లో వత్సలా, హర్షవర్ధన్ కూర్చున్నారు. ఆమె గుప్పిళ్ళలో ఇసక తీసి జారవిడుస్తోంది. అతను ఇసకలో గీతలు గీసి తుడిపేస్తున్నాడు. సముద్రంలో పడవలను చూస్తూ మౌనంగా కూచున్నారు.

ఇద్దరి మనస్సులలో ఒక్కటే ఆలోచన. మారిషస్ రికార్డులలో హర్షవర్ధన్ పూర్వీకుడిగా పేర్కొన్న నాగన్న, వత్సల ముసలమ్మమ్మ చెప్పిన కుటుంబ కథలోని నాగన్న ఒకరే అయి ఉండాలి.

కాకపోతే తమ మధ్య అభిప్రాయ సామీప్యం ఎందుకుంటుంది? ఫేస్‌బుక్‌లో ఇద్దరికీ ఎందరు ఫ్రెండ్స్ ఉన్నా తమ మధ్య సాన్నిహిత్యం పెరగడానికి కారణమేమై ఉంటుంది? తరాలు గడిచినా దూరాలు పెరిగినా మమకారం రక్తంలో ప్రవహిస్తూనే ఉంటుందా? రక్త సంబంధం అంటే ఇదేనా?

దూరంగా ఉన్న ఓడలోని తన పూర్వీకుడు నాగన్న నిచ్చెన సాయంతో కోరంగి రేవులో ఎక్కుతున్నట్లుగా వత్సలకు అన్పించింది. పోర్ట్‌లూయిలో ఓడలోంచి తన పూర్వీకుడు నాగన్న దిగుతున్నట్లుగా హర్షవర్ధన్‌కి అన్పించింది.

సంశయం లేదు ఇద్దరు నాగన్నలు లేరు. ఉన్నదొక్కడే నాగన్న. అప్రయత్నంగా ఇద్దరూ ఒకరి చేతిలో ఒకరు చెయ్యి వేశారు.

వారి భావం నిజమేనని చెప్పడానికా అన్నట్లు పుడమినీ, కడలినీ కలుపుతూ వచ్చిన కెరటం వారి పాదాలను తడిపి, హృదయాలను ఆర్ద్రం చేసింది. 

# అపశ్రుతులు



– మామిడెన్న వెంకట రంగశాయి

మా ఆవిడ తన బృందంతో భజన ప్రారంభిస్తున్న సూచనలు వినిపించి వాలు కుర్చీ నుండి లేచి దగ్గరలోనే నాలాగే విశ్రాంత ఉద్యోగి జగన్నాథం ఇంటికి బయలుదేరబోయాను. ఇంతలో ఒక కొత్త గొంతుకతో శ్రావ్యమైన పాట వినబడగానే మళ్లా కూర్చుండి పోయాను.

భజన అయిపోయింది. కబుర్లు చెప్పుకుంటూ ఒక్కొక్కరే బయటికి వస్తున్నారు.

"చాలా బాగా పాడుతున్నావమ్మా. రోజూ సాయంత్రం భజనకి వస్తూండండి. మీ ఇల్లు కూడా దగ్గరే కదా" అంటూ మా ఆవిడ ఒక కొత్త స్త్రీ వీపు మీద చేయివేసి నడుస్తూ వచ్చింది. తెల్లగా పొడుగ్గా కొంచెం బొద్దుగా మధ్య వయస్సుతో హుందాగా చిరునవ్వుతో నడుస్తున్న ఆమెని పరిచయంచేస్తూ.

"ఇదుగో మా ఆయన, నేను అలా భజన పాటలు ప్రారంభించగానే ఎక్కడికో వెళ్లి పోతూంటారు. ఇవాళ మీ పాటలు విని ఉండి పోయుంటారు. ఈవిడ శకుంతలా పట్నాయక్‌గారు. దగ్గరలోనే వీళ్ల ఇల్లు కూడా. మీ బరంపురం కాలేజీలోనే చదువుకున్నదిట. తెలుగు పాటలే కాదు, ఒడియా, హిందీ, బెంగాలీ పాటలూ పాడుతారుట" అంటూ గుమ్మందాక దిగబెట్టి వచ్చింది. తిరిగి వస్తూ "చాలా బాగా పాడుతున్నది కదూ!" అని మా ఆవిడ చెబుతూంటే నేను మధ్యలో అడ్డుపడి.

"ఇందాక ఏమిటి అన్నావు? శకుంతల పట్నాయక్ అనీ, మా బరంపురం కాలేజీ అని కదూ, అలా చెప్పు. శకుంతలా పట్నాయక్.. ఓ.. ఆరోజుల్లో మా కాలేజీ బ్యూటీగా అందరూ అనేవారు.

నాకు బాగా జూనియర్. పాటల్లో ఎప్పుడూ ఫస్టే" అని చెబుతూ మా ఆవిడ ముఖంలో మార్పు గమనించి ఆగాను.

"అప్పుడు అందంగా ఉండేదేమో? ఇప్పుడు చూడండి అంత లావుగా పిప్పళ్ల బస్తాలాగ తయారయింది. పాటలు కూడా బాగానే పాడుతున్నది కానీ సంగీతం నేర్చుకోనట్లుంది. చాలా చోట్ల అపశ్రుతులు వినిపిస్తున్నాయి కదా?" అంటూ మా ఆవిడ లోపలికి వెళ్లిపోయింది. 'అందమైనదీ, ఆ రోజుల్లో కాలేజీ బ్యూటీ, పాటలు బాగా పాడేది' అన్న నా మాటలే మా ఆవిడకి అపశ్రతులులాగ వినిపించి ఉంటాయని నాకు అర్థమైంది. ©




**కొలిపాక రమామణి**

# ఏటి ఒడ్డున నీటిపూలు

నిర్వహణ : **వి. రాజారామమోహనరావు**

**ఏటి ఒడ్డున రకరకాల నీటిపూలు వుంటాయి. ఏ ప్రత్యేకత లేకుండా ఓ గుంపులా వుంటాయవి. ఎవరేనా ప్రత్యేకంగా చూస్తేనే అవి ప్రత్యేకంగా కనపడతాయి. అలాంటి జీవితాన్నే తీసుకుని కొలిపాక రమామణి 'ఏటి ఒడ్డున నీటిపూలు' నవల రాశారు. సాధారణ దిగువ మధ్య తరగతికి వ్యక్తుల కథ ఇది. 'అర్చనకు పనికి వచ్చేపూలు కొన్ని, అలంకరణకు పనిపడేవి కొన్ని, అనాఘ్రాతంగానే వాడిపోయేవి కొన్ని!' అని రచయిత్రి చెప్పినట్లు వీటికి దరిదాపుగా సరిపోయే ముగ్గురు స్నేహితురాళ్ల కథ ఇది. ఇది రమామణిగారి తొలి నవల కావటం విశేషం. ఆ రోజుల్లో మంచి పాఠకాదరణ పొందింది. ఆంధ్రప్రభ 1968 ఉగాది నవలల పోటీలో రెండో బహుమతి దీనికి లభించింది.**

పద్మ, శ్రీదేవి, చారుమతి. ముగ్గురూ క్లాస్ మేట్స్. పద్మ పెళ్ళి సంఘటనతో ఈ నవల మొదలవుతుంది. అప్పుడే యవ్వనంలో అడుగు పెట్టిన స్నేహితురాళ్ళు ఈ ముగ్గురూ. 'భర్తకి మంచి ఉద్యోగం, ఒక్కడే కొడుకు, బాదరబందీ లేని సంసారం, పద్మ సుఖపడు తుందనుకున్నారు' శ్రీదేవి, చారు మతి. తామిద్దరిలో ఎవరి పెళ్ళి ఎప్పుడో? అనుకున్నారు.

శ్రీదేవికి బావ వరస అయ్యే వాడున్నాడు. పరిస్థితులు అను కూలం. చారుమతి విషయం అలా కాదు. ఆమె పైన వున్న ఆడపిల్లలకి పెళ్ళిళ్లు కావాలి. ఇంటి ఆర్థిక పరిస్థితీ బావుండలేదు. పెళ్ళికి అంతా ప్రతికూలమే. దిగువ మధ్యతరగతి వాళ్ళు చాలా మంది సాధారణంగా హైస్కూలు స్థాయి వరకూ చదువు సాగి, కాలేజీ దగ్గరికి వచ్చేటప్పటికి ఆగిపోయే స్థితిలో వుంటారు. చారుమతి పరిస్థితీ అదే. వైజాగ్‌లో ఉన్న అక్కబావల ద్వారా ఉద్యోగ ప్రయత్నం చెయ్యాలని మర్నాడే ప్రయాణం పెట్టుకుంది. తక్కువ దూరమే అయినా ఆడపిల్లని ఒంటరిగా పంపటం ఆ రోజుల్లో సంప్రదాయం కాదు. ఆర్థిక ఇబ్బంది.. తప్పనిసరై చారుమతిని ఒక్కదాన్నే పంపించాడు తండ్రి. తను పనిచేస్తున్న ప్లీడరు గారి అబ్బాయి కూడా వైజాగ్ వెడుతున్నాడని తెలిసి అతనికి అప్పచెప్పాడు. అతని పేరు రాధా కృష్ణ. సామర్లకోటలో వీళ్ళు ఎక్కాల్సిన రైలు బాగా రద్దీగా ఉండటంవల్ల రాధాకృష్ణ చారుమతితో కూడా ఫస్ట్‌క్లాస్‌లోకి ఎక్కాడు.



కంపార్టుమెంటులో వీళ్ళు తప్ప ఎవరూలేరు. ఆ మాటా ఈ మాటా చెప్పి, చదువుతానంటే కాలేజీలో చదివిస్తానని చారుమతికి చెప్పి చొరవ చెయ్యబోయాడు. అతని వాలకం గమనించి చారు మతి వేరే కపార్టుమెంటులోకి మారిపోయింది. ఈ సంఘటనతో చారుమతికి మరో విషయం అర్థ మైంది. 'తన లాంటి ఆడపిల్లకి అంత తేలిగ్గా పెళ్లి జరగడం కష్టం.. అది ఒకవేపు, మరోవేపు ఇలాంటి మగవాళ్ళ దాడుల నుంచి కాపాడుకుంటూ వుండాలి. మగవాళ్ళని అంత తొందరగా నమ్మకూడదు' అనుకుంది.

చారుమతి వైజాగ్ వెళ్ళిన పని జరగలేదు. ఉద్యోగ ప్రయత్నాలు ఫలించకుండానే, తండ్రికి ఆరోగ్యం దెబ్బతిందని కబురుతెలిసి, అక్కబావ

లతో కలిసి కాకినాడ వచ్చేసింది. ఆర్థిక ఇబ్బందులు, ఆడపిల్లల పెళ్ళిళ్ళు కాలేదన్న దిగులు ఆయన అనారోగ్యానికి కారణాలు.

పద్మ అత్తారింటి నుంచి వచ్చేసి కాలేజీలో చేరిందని చారుమతిని చూడటానికి వచ్చిన శ్రీదేవి చెప్పింది. విషయం అర్థం కాక ఇద్దరూ పద్మని కలిశారు. పద్మ ఏం చెప్పలేదు. మనిషి దిగులుగా కనిపించింది. మొత్తమ్మీద ఆమె సంసారం సక్రంగా లేదని గ్రహించారు.

శ్రీదేవి సలహా మీద చారుమతి గరల్స్ హైస్కూలులో టీచర్‌గా చేరింది. ఆ జీతంతో కుటుంబం ఆర్థికంగా కొంచెం ఊపిరి తీసుకుంది. ఇంతలో చారుమతి తండ్రికి జబ్బు తిరగ బెట్టి ఆస్పత్రిలో చనిపోయాడు. ఇంక ఆ కుటుంబానికి చారుమతి జీతమే ఆధారమైంది. తండ్రి పనిచేసిన ప్లీడరుగారు ఇచ్చిన డబ్బుతో అప్పులు తీర్చింది. ప్లీడరుగారి మంచితనం ఆయన కొడుకు రాధాకృష్ణకి ఎందుకు రాలేదో అనుకుంది.. ఆ రోజు రైల్లో అతనితో జరిగిన అనుభవం గుర్తొచ్చి ఆస్పత్రిలో తండ్రికి వైద్యం చేసి, తనకి సాయం చేసిన డాక్టరు ఆ ప్లీడరుగారి రెండో కొడుకే అని తెలిసి ఆశ్చర్యపోయింది. అతనంటే అభిమానం ఏర్పడింది చారుమతికి.

తమకి ఎన్ని ఆర్థిక ఇబ్బందులున్నా, మేనత్త వరసయిన శారదమ్మకి తండ్రి ప్రతినెలా పాతిక రూపాయలు పంపటం చారుమతికి తెలుసు. ఆమె ఆ డబ్బుతోనే కొడుకు గోపాల్‌ని చదివిస్తోంది. తండ్రి పోయాక తమ పరిస్థితి మరింత దిగజారినా, నెలనెలా తన జీతంలోంచి పదిరూపాయలు పంపించటం ఆపలేదు చారుమతి. చారుమతి మధ్యతరగతి మంచితనాన్ని మెత్తటి మనసుని రచయిత్రి రమామణి ఈ నవలలో పట్టుకున్న తీరుకి ఇదో ఉదాహరణ. తమకి తల మునక కష్టాలున్నా, ఎదుటివారి కష్టానికి స్పందించటం ఆ వర్గం స్వభావం. ఈ స్వభావం వల్లనే చారుమతి, శ్రీదేవి.. పద్మకి సంసార జీవితంలో వచ్చిన కష్టానికి ఎంతో బాధపడ్డారు.

స్నేహితురాళ్లు ముగ్గురూ కలిసినప్పుడు కాస్సేపు సరదా కబుర్లు చెప్పుకున్నా, కుటుంబ విశేషాలు కూడా ఆలోచించేవాళ్లు. స్నేహితురాళ్ల సలహామీద చారుమతి ఇంటి ముందు గది అద్దెకి ఇవ్వటానికి సిద్ధపడింది. చారుమతి చెల్లెలు భగవతిని చదివించడానికి వైజాగ్‌లో ఉన్న రేవతి తీసుకెళ్లింది. మరో చెల్లెలు మాలతికి స్కూలు ఫైనలు పుస్తకాలు శ్రీదేవి కొనిచ్చింది. ఈ రెండు సంఘటనలూ చారుమతికి ఎంతో బాధ కలిగించాయి. 'లేమిలోకి దిగజారిపోతున్న మధ్యతరగతి కుటుంబీకుల మానసిక వ్యథ ఊహాతీతమైంది' అంటారు ఇక్కడ రచయిత్రి.

చారుమతి నాయనమ్మ ముసలావిడ మంచం ఎక్కింది. ఆవిడకి చాకిరియే కాదు, ఏదీ తేడా రాకుండా జాగ్రత్తగా వండిపెట్టాలి. తమ్ముడు శంకరం మూడోసారి రాసినా ఇంకా ఎస్.ఎస్.ఎల్.సి. పూర్తికాలేదు. మాలతికి, శంకరానికి పరీక్ష ఫీజులు కట్టటానికి అప్పు తెచ్చారు. తండ్రి సంవత్సరీకాలకి తల్లి గాజుల జత అమ్మేశారు.

పరిస్థితులు ఇలా ఉంటే, స్నేహితురాలు శ్రీదేవి పెళ్లికి ముహూర్తం పెట్టారు. సంతోషంగా పాలుపంచుకోవాల్సిన సందర్భం. కానీ చారుమతికి పెళ్లికి కట్టుకు వెళ్లటానికి మంచి చీర కూడా లేదు. శ్రీదేవిని పెళ్లి కూతుర్ని చేసిన రోజున వెళ్లారు పద్మ, చారుమతి, శంకరం. విందు భోజనం చేశారు. చారుమతి తిరిగి ఇంటికి వచ్చేటప్పటికి తల్లి, చెల్లెలు అన్నాలు తింటున్నారు. ఏం తింటున్నారో చూసిన చారుమతికి కళ్లమ్మట నీళ్లు వచ్చాయి. ఉట్టి అన్నంలో ఉప్పు, పచ్చి మిరపకాయ నంజుకు తింటున్నారు. 'శ్రీదేవి ఇంట్లో తిన్న పిండివంటలు, కూరలు గుర్తొచ్చి చారుమతికి వాంతి చేసుకోవాలనిపించింది' అని చారుమతి దైన్యాన్ని, ఆ ఇంటి పేదరికాన్ని, ఒక వాక్యంతో ప్రతిభావంతంగా రాశారు.

శ్రీదేవి పెళ్లయి కాపురానికి వెళ్లిపోయింది. పద్మని ఆమె అత్తగారు అడిగినట్టు రవ్వల దుద్దులు, స్టీలు సామాను తీసికెళ్లి తల్లిదండ్రులే కాపురానికి దింపి వచ్చారు.

చారుమతి ఇంట్లో శంకరం, ఇద్దరు చెల్లెళ్ళు, పరీక్షలు పాస్ అయ్యారు. ఇంటి ముందు గదిలో రామారావుగారన్న స్కూలు టీచర్ అద్దెకు చేరాడు. కష్టాల మధ్య చారుమతి కథ ఇలాగే ముందుకు సాగింది.

శ్రీదేవి కాపురం ఎంత సంతోషంగా ఉందో, పద్మ కాపురం అంత నరకంలా తయారైంది. పద్మ అత్తగారిది ఓ విచిత్ర ధోరణి. పెళ్లయి గర్భవతి అయిన వెంటనే ఆవిడకి భర్త పోయాడు. తనే ఒంటరిగా పిల్లాణ్ణి పెంచింది. తన ఒంటరితనం, కష్టాల గురించి కొడుక్కి చిన్నతనం నుంచి బాగా నూరిపోసింది.

అతను కూడా తన బతుకు తల్లికోసమే అన్నట్టు పెరిగాడు. వాళ్లిద్దరిదీ ఓ ప్రపంచం.

# మధ్యతరగతి మందహాసానికి అక్షరచిత్రం

'ఏటిఒడ్డున నీటి పూలు' కొలిపాక రమామణి తొలినవల. 1938 జూన్ పద్దెనిమిదిన కాకినాడలో పుట్టిన రమామణి ఆంధ్రవిశ్వవిద్యాలయంలో ఎం.ఏ. చేసి, అధ్యాపక వృత్తి చేపట్టారు. అప్పటి వార, మాస పత్రికల్లో తరచు కథలు రాస్తూండేవారు.

ఆంధ్రప్రభ 1968లో నిర్వహించిన ఉగాది నవలల పోటీకి ఈ నవల ప్రథమ ప్రయత్నంగా రాశారు. విశేషమేమంటే ఆ పోటీలో ఈ నవల ద్వితీయ బహుమతితో పాటు, అశేషమైన పాఠకాదరణనూ పొందింది.

మధ్యతరగతి కుటుంబాల్లో 1960 దశకంలో ఉండే ఆర్థిక, సామాజిక సమస్యలను కళ్ల ముందు నిలిపే నవల ఇది. ముఖ్యంగా ఆడపిల్లల చదువులు, ఉద్యోగాలు, పెళ్లిళ్ల కోసం ఆ కుంటుంబాలు పడే యాతనలకు అక్షర రూపమిది. యుక్తవయస్సులో స్నేహాలు, అభిమానాలు, ప్రేమలు, కష్టసుఖాలు, కాల పరిణామంలో సంభవించే మార్పులు అన్నిటినీ హృద్యంగా చిత్రించారు రచయిత్రి.

ప్రతిపాత్రను పాఠకులు తమ కుటుంబంలోని వ్యక్తులుగా భావించి తాదాత్మ్యం చెందేలా కథనం సాగుతుంది. అందుకే సమాజంలో దిగువ, మధ్యతరగతి కుటుంబాలు ఉన్నంత కాలం ఈ నవల పాఠకుల గుండెల్లో ఉండిపోతుంది.

ఇక్కడ పద్మ క్షోభ.. భర్తతో అందరిలాగే సవ్యంగా కాపురం చెయ్యాలని ఆమె చేసిన ప్రయత్నాలు.. ఇంక ఆ క్షోభ తట్టుకోలేక చివరికి పుట్టింటికి వచ్చేయడాన్ని రమామణి ఎంతో ఆవేదనాభరితంగా రాశారు.

చారుమతి ఇంట్లో వరసగా సంఘటనలు జరిగాయి. ముందుగా ముసలావిడ పోయింది. ఇంట్లో అద్దెకుంటూ సహాయ పడుతున్న రామారావుగారే ఆ సమయంలోనూ అండగా నిలిచారు. ఘర్షణ పడి శంకరం ఇల్లొదిలి వెళ్లిపోయాడు. మగ దిక్కులేని ఆ సంసారానికి మంచికి చెడ్డకీ రామారావుగారే అండగా నిలిచారు.

చారుమతి అక్క తనంతగా తాను చెప్పి రామారావుగారిని పెళ్లి చేసుకుంది. శారదమ్మ తన కొడుకు గోపాల్‌కి ఈ ఇంటి ఆడపిల్ల మాలతితో పెళ్లి చెయ్యాలనుకుంటున్నట్లు చెప్పింది. ఇల్లొదిలి వెళ్లిన శంకరం తిరిగి వచ్చాడు.

శ్రీదేవి, చారుమతి ప్రోద్బలంతో శంకరం పద్మని పెళ్లి చేసుకుంటానన్నాడు. చారుమతి చెల్లెలు భగవతి ధైర్యంచేసి తనకి నచ్చిన పెళ్లిచేసుకుంది. ఒంటరిగా మిగిలిపోయింది చారుమతే. ఆమె కోరుకున్నది ప్లీడరుగారి అబ్బాయి డాక్టర్ గిరిధర్‌ని. కానీ అతని పెళ్లి వేరొకరితో జరిగిపోయింది. ఒంటరిగా, నిరాశగా మిగిలిపోయింది చారుమతి.

ఇప్పటి మధ్యతరగతి కుటుంబాల్లో ఆడపిల్లల పెళ్లిళ్లు, చదువుల విషయంలో కష్టాలు ఉన్నా, చారుమతి కాలం నాటి దైన్యం లేదు. 1960 దశకంలో దిగువ మధ్యతరగతిలో ఇంచుమించు అన్నీ ఉమ్మడి కుటుంబాలే. ఒక మనిషి సంపాదన మీద పదిమంది బతికే రోజులు. కుటుంబ సభ్యులు ఎక్కువ మంది ఉంటే దానికి తగినట్టే కష్టాలు, సంతోషాలునూ. ఆదాయం సరిగా లేనప్పుడు కష్టాలే ఎక్కువ. ఇలాంటి కుటుంబాల్లో చారుమతులు ఎందరెందరో ఉండేవారు. ఈ నవలలోని చారుమతి అలాంటి ఓ సమూహానికి ప్రతినిధి. ఈ నవలని ఆ రోజుల్లో అందుకే విపరీతంగా ఆదరించారు.

చివరికి చారుమతి తన ఇష్టాయిష్టాలని పక్కకిపెట్టి చెల్లెలు భగవతి బావగార్ని, భార్యపోయిన వాడ్ని పెళ్లి చేసుకోవటానికి సమ్మతిస్తుంది.

'అభివృద్ధి, కుటుంబ పురోభివృద్ధిని చూసుకునే మనిషి జీవించగలుగుతున్నాడు. పెళ్లి, సంసారం, పిల్లలు - అనే కొండలు, కోనలు దాటుకుంటూ ముందుకు పరిగెడుతున్న జీవితం ప్రవాహంలాంటిది. పెళ్లి-సంసారం లేని జీవితం నూతిలోని నిలువనీరులా నిశ్చలమైంది. ప్రతిమనిషీ ఉత్సాహంగా పరుగులిడే ప్రవాహంలాంటి జీవితాన్నే వాంఛిస్తాడు' అంటారు రమామణి.

ఎంతో స్పష్టతతో చారుమతి పాత్రని తీర్చిదిద్దారు రచయిత్రి. దిగువ మధ్యతరగతి కుటుంబ జీవనచిత్రం ఈ నవల. ఒక కాలాన్ని, జీవనవిధానాన్ని, ఆశ నిరాశల స్వరూపాన్ని అద్భుతంగా పట్టి చూపించిన నవల ఇది. ఇప్పటికీ చక్కగా చదువుకోదగిన మంచి నవల ఇది. ©

# భామనే.. సత్యభామనే..!

12

పియర్స్ సోప్, సఫోలా నూనె వంటి పలు ప్రకటనల్లో మెరిసి మోడల్‌గా మారిన ఆ అందాల తార కథానాయికగా సెటిల్ అయిపోయింది. 'గాంగ్ ఆఫ్ వసీపూర్' సినిమాతో తెరంగేట్రం చేసిన ఆ ముద్దుగుమ్మ స్వచ్ఛంద సంస్థల్లోనూ పనిచేసింది. అంతేకాదు పలు డాక్యుమెంటరీలకూ సహాయకురాలిగా పని చేసింది. మరి ఇన్ని అంశాల్లో ప్రతిభ కనబరిచిన ఆ బాలీవుడ్ భామ మరెవరో కాదు, హ్యూమా ఖురేషి! ఆమె అందచందాల వెనుక దాగి ఉన్న రహస్యాలేంటో ఆమె మాటల్లోనే..

## సొగసు చూడతరమా...

చక్కని సంగీతం, ప్రశాంతమైన వాతావరణం, నిజమైన మెచ్చుకోలు, సన్నని చిరునవ్వు.. ఇవే నా అందాన్ని ఇనుమడింపజేస్తాయి. ఎవరికైనా ఫిట్‌నెస్ ఒక్కసారిగా వచ్చేయదు. నెమ్మదిగా సాధన చేస్తున్న కొద్దీ సొంతమవుతుంది. నా వృత్తికి అవసరం అన్న ధోరణిలో కాకుండా ఆరోగ్యాన్ని దృష్టిలో పెట్టుకుని వర్కవుట్స్ చేస్తుంటాను. ఆరోగ్యాన్ని ఎంత జాగ్రత్తగా కాపాడుకుంటే అది మనల్ని అంతగా రక్షిస్తుంది.

చెమట వచ్చేవరకు వ్యాయామం చేస్తాను. అలా చేయడం వల్ల చర్మం కాంతిమంతం అవుతుంది. జుట్టు మెరుస్తుంది. ఆత్మవిశ్వాసమూ పెరుగుతుంది. అంతే కాదు, సంతోషాన్ని కలిగించే హార్మోనులూ ప్రేరేపితమవుతాయి. పని, వ్యాయామం,

విశ్రాంతి.. ఈ మూడూ సమన్వయం అయ్యేలా చూసుకుంటాను. సరైన సమయానికి నిద్రపోవడం, ఆరోగ్యకరమైన ఆహారం తీసుకోవడం, మానసిక ప్రశాంతత.. మనసును ఉత్సాహపరుస్తూ ఉండడం అందంగా కనపడేందుకు దోహదపడతాయి.

కేకులు, పంచదార ఎక్కువగా ఉండే పదార్థాలను అస్సలు తీసుకోను. పండ్లు, ప్రకృతి సహజమైన ఆహారం తీసుకుంటాను. దానివల్ల ఆరోగ్యం, అందం.. రెంటికీ మేలు చేకూరుతుంది. తల్లిదండ్రులు ఇది చిన్నప్పటి నుంచే పిల్లలకు అలవాటు చేయడం వల్ల మంచి ఫలితముంటుంది.

కడుపు మాడ్చుకుంటే సన్నబడతారనడంలో అర్థం లేదు. దానివల్ల ఎన్నో అనర్థాలు వచ్చి పడే అవకాశముంది. శరీరానికి కావలసిన ఆహారం తీసుకుంటూనే సరైన వ్యాయామం చేస్తే ఫిట్‌నెస్‌తో పాటు ఆరోగ్యమూ సొంతమవుతుంది. వారానికి నాలుగు సార్లు ఓ గంటపాటు గుండెకు సంబంధించిన వ్యాయామం చేస్తుంటాను. మిగిలిన రోజుల్లో అధిక బరువు మీద దృష్టి పెడతాను. జంక్‌ఫుడ్‌ను వీలైనంత దూరంలో ఉంచుతాను. ప్రతిరోజూ వ్యాయామంలో భాగంగా యోగా, పరుగు, స్ట్రెచింగ్ వంటివి చేస్తాను.

పడుకునే ముందు మేకప్‌ను పూర్తిగా తీసేయడం, బయటికి వెళ్లేపుడు సన్‌స్క్రీన్ లోషన్ రాసుకోవడం, నీరు ఎక్కువగా తాగడం వంటి ప్రాథమిక అంశాలకు ఎక్కువ ప్రాధాన్యతనిస్తాను. పెరుగులో కొంచెం శనగపిండి, తేనె కలిపి. చర్మానికి పట్టిస్తాను. ఓ పదినిమిషాల



పాటు అలా ఉంచి కడిగేసుకుంటే చర్మం కాంతిమంతంగా కనిపిస్తుంది.

ఎపుడూ నవ్వుతూ ఉంటాను. నాకున్నవాటితో తృప్తి చెందుతాను. లేనివాటి గురించి అస్సలు ఆలోచించను. ఆ భావన మనసును ఎపుడూ ఉల్లాసంగా ఉంటుంది.. అదే మన ముఖంపైనా కనిపిస్తుంది.

సేకరణ : సంధ్యారాణి

## మహిళా శక్తి



జీవితాన్ని సుఖమయం చేసుకోవడం నీ ధైర్యసాహసాల మీదే ఆధారపడి ఉంటుంది.

– అనైస్ నిన్



నీ తలను ఎపుడూ వంచకు. ఎపుడూ నిటారుగానే లోకాన్ని చూడు.

– హెలెన్ కెల్లర్

## గుండె పదిలం!



బొటనవేలు మీద నెమ్మదిగా గాలి ఊదడం వల్ల గుండెవేగం క్రమబద్ధమవుతుంది. ఒత్తిడి తగ్గి మనసు తేలికపడుతుంది. బొటనవేలుకు ప్రత్యేకనాడి ఉండడమే అందుకు కారణం. అలా చేయడం వల్ల నాడి వేగం తగ్గి శ్వాసక్రియలో మార్పు వచ్చి గుండె కొట్టుకునే వేగాన్నీ తగ్గిస్తుంది.

# సోయగం..

**బొప్పాయితో ముడతలు మాయం!**

అన్ని కాలాలలోనూ చౌకగా లభించే పండు బొప్పాయి. ఆరోగ్యంతోపాటు అందాన్నీ ఇనుమడింపజేస్తుంది ఈ పండు. బొప్పాయి గుజ్జును ఫేస్‌ప్యాక్‌గా వేసుకోవడం ద్వారా అకాల వృద్ధాప్య ఛాయలను చాలా వరకు తగ్గించుకోవచ్చు. వయసు ఎక్కువ ఉన్నవారు కూడా బొప్పాయి గుజ్జును ఫేస్‌ప్యాక్‌లా వాడడం వల్ల ముఖం మీద ముడతలను, మచ్చలను నివారించుకోవచ్చని నిపుణులు చెప్తున్నారు.



**క్షణాల్లో మెరిసే ముఖం!**

ఇంట్లో టమోటా లేకపోతే వంట ఎలా చేయాలో తోచదు. నిత్యం అందుబాటులో ఉండే ఈ పండు సౌందర్య సాధనంగా బాగా పనిచేస్తుంది. టమోటా గుజ్జులో రెండు స్పూన్లు పచ్చి పాలు కలిపి ముఖానికి, మెడకు, చేతులకు, కాళ్లకు పట్టించి పదంటే పదినిమిషాల్లో కడుక్కోవాలి. చర్మం కాంతిమంతంగా మెరుస్తుంది!



**మృదువైన ముఖం కోసం అరటి!**

బాగా మగ్గిన అరటి గుజ్జులో స్పూను తేనె కలిపి ఆ మిశ్రమాన్ని ఫేస్‌ప్యాక్‌లా వేసుకోవాలి. ఓ పావుగంట తర్వాత ముఖాన్ని గోరువెచ్చని నీటితో శుభ్రం చేసుకోవాలి. క్రమం తప్పకుండా ఇలా కొన్ని వారాలపాటు చేయడం వల్ల చక్కని ఫలితం ఉంటుంది.



# టెక్ గురూ!

***డోంట్ టచ్ మై ఫోన్ యాప్***




ఎపుడూ ఫోన్ చేతిలోనే పట్టుకుని ఉండలేం. ఫోన్ ఎక్కడో ఓ చోట పెట్టేసి మన పనులు చేసుకుంటుంటాం. అయితే ఎంతో ఖరీదు పెట్టి కొన్నవి కాబట్టి వాటి మీద ఓ కన్నేసి ఉంచుతుంటాం. ఫోన్‌ను ఎవరైనా కొట్టేస్తారేమోనని, లేదంటే అందులోని మన వ్యక్తిగత విషయాలను ఎవరైనా తెలుసుకుంటారేమోనని ఒక్కోసారి పనిమీద ఏకాగ్రత కుదరకపోవచ్చు. అటువంటి ఇబ్బందుల నుండి బయటపడేసేందుకే ఇపుడు 'డోంట్ టచ్ మై ఫోన్' యాప్‌ను అందుబాటులోకి తెచ్చారు. ఈ యాప్ ద్వారా ఒక్కసారి అలారమ్‌ను యాక్టివేట్ చేసి పెట్టుకుంటే చాలు.. ఇతరులెవరైనా ఫోన్ ముట్టుకోగానే మనల్ని అప్రమత్తం చేస్తూ పెద్ద శబ్దంతో అలారమ్ మోగుతుంది.

***కాలర్ నేమ్ స్పీకర్ (అనౌన్సర్)***

ఫోన్ మోగుతూనే, మెసేజ్ శబ్దం వింటూనే చేస్తున్న పని వదిలేసి ఎవరబ్బా ఈ సమయంలో అనుకుంటూ ఫోన్ దగ్గరకు పరిగెత్తుతాం. అది లోన్ కావాలా? ఫలానా ఎల్ఐసి పాలసీలో చేరండి, ఆరోగ్య బీమా ఉంది.. వంటి అక్కర్లేని కాల్స్, మెసేజెస్ అయితే విసుక్కుంటాం, అనవసరంగా పని వదులుకుని వచ్చినందుకు. అయితే ఇక నుంచి ఆ బాధ అక్కర్లేదు.. 'కాలర్ నేమ్ స్పీకర్' యాప్‌ను ఇన్‌స్టాల్ చేసుకుంటే సరిపోతుంది. ఎవరైనా ఫోన్, లేదా మెసేజ్ చేయగానే అది ఎవరి నుంచి వస్తున్నదో, ఆ మెసేజ్ ఏంటో చెప్పేస్తుంది. దాన్ని కావలసిన శబ్దంతో పెట్టుకోవచ్చు. అది అవసరమైన కాల్ అనుకుంటే వెంటనే సమాధానం ఇవ్వొచ్చు. లేదంటే వదిలేయొచ్చు.

పై రెండు యాప్స్‌ను గూగుల్ ప్లే నుంచి ఉచితంగా డౌన్లోడ్ చేసుకోవచ్చు.

# మనసున ఉన్నదీ...

★ కుమారి కావ్య ముఖచిత్రంతో వచ్చిన జనవరి సంచిక ఎంతగానో అలరించింది. 'కన్న య్యావాడలో క్రీనీడలు' తెలుగు నవల చదువు తున్నామన్నంత అద్భుతంగా అనిపించింది. బృందావనంలోని రాధేశ్యామీల జీవితాన్ని కళ్లకు కట్టినట్లు రాశారు. 'జాడీల కథాకమామిష' వారెవ్వా అనిపించింది. వేటూరి వారి చమత్కృ తులు హాస్యస్పోరకంగా అలరారాయి. 'భామనే సత్యభామనే..!' శీర్షికలోని 'అంతర్నేత్రం'లో ఆన్‌లైన్ షాపింగ్ జాగ్రత్తలు చాలా ప్రయోజన కరంగా ఉన్నాయి. 'భలే భలే' బిట్స్ భలేగా ఉన్నాయి. 'నవలావలోకనం' ద్వారా పురాణం సుబ్రహ్మణ్యశర్మని మా జ్ఞాపకాలలో నిలిపారు.

– *నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం*

★ జనవరి నవల 'కన్నయ్యవాడలో క్రీనీ డలు' బృందావనంలోని వితంతు స్త్రీల వ్యథాభరిత జీవితాల్ని హృద్యంగా చిత్రించింది. ఆకలి మనిషిని ఎంత అధమాధమ స్థితికి చేరుస్తుందో కదా! జీవిత సౌభాగ్యానికి దూరమై, ముక్తిని కోరి అక్కడకు చేరిన దీనుల రక్షణ, వసతి అక్కడి సమాజం, దేవాలయాల బాధ్యత కాదా? మహత్తరమైన సమస్యను వెలి కితీసి సమాజం ముందుంచినందుకు రచయిత్రి అభినందనీయురాలు.

– *ధవ్వూరి శ్రీధరాచార్యులు,*
*సీతారాంబాగ్, హైదరాబాద్*

★ కొత్తసంవత్సరం ఆరంభంలో ఇచ్చిన 'కన్నయ్యవాడలో క్రీనీడలు' అస్సామీ నవల చాలా ఉదాత్తంగా ఉంది. అందచందాలతో అల రారే బృందావనం రెండో పార్శ్వం ఎంత హృదయ విదారకంగా ఉంటుందో తెలిసి మనసు కలత చెందింది. భక్తివిశ్వాసాలు ఉండాల్సిందే కానీ మానవత్వం లేక పోతే తోటివారి జీవితాలు ఎంత దయనీయంగా మారుతాయో కళ్లకుకట్టారు రచయిత్రి. మంచి నవల అందిం చినందుకు అభి నందనలు.

'నవలావలోకనం'లో పురాణం వారి 'హంగామా' చక్కని హాస్యంతో చక్కిలిగింతలు పెట్టింది. మొత్తం నవల చదవాలన్న కుతూహలం కలిగింది. 'కొత్తగాలి' కవితలు చురుక్కుమనిపించాయి. 'భలేభలే'లు నిజంగా భలేగానే ఉన్నాయి.

– *మణిదీప్, చింతల్, హైదరాబాద్*

★ కమనీయమైన 'కావ్య' ముఖచిత్రంతో వెలుడ్డ 'చతుర' మమ్మల్ని ఎంతగానో ఆకట్టు కుంది. 'కన్నయ్యవాడలో క్రీనీడలు' ఆసక్తిగా ఆసాంతం చదివించింది. బృందావనంలోని రాధేశ్యామీల దుర్భర జీవిత స్థితిగతులను కళ్లకు కట్టారు. రచయిత్రి ఇందిరా గోస్వామికి, అనువాదకులు పాలకోడేటి కృష్ణమూర్తికి ధన్య వాదాలు.

– *బిక్కునూరి రాజేశ్వర్, పొన్కల్*

★ చతుర చేతికి రాగానే ముందుగా 'కొత్త గాలి' కవితలు చదవాలనే ఆరాటం కలుగు తోంది. అంతగా ఆకట్టుకుంటున్నాయి. వేటూరి హాస్యోక్తులు పలుమార్లు చదివేటంత అనుర క్తితో ఉన్నాయి. 'చతుర సంగతులు' ప్రపంచ జ్ఞానాన్నిస్తున్నాయి. ఇందిరాగోస్వామి 'కన్నయ్య వాడలో క్రీనీడలు' నవలకు పాలకోడేటి అను వాదం చాలా బాగుంది. 'భామనే సత్యభా మనే..!' విశేషాలన్నీ ఆసక్తికరంగా ఉన్నాయి. పురాణం 'హంగామా'ను రాజారామమోహన రావు చక్కని వ్యాసంగా అందించారు.

– *డా. శివభూషణం, కర్నూలు*

★ జనవరి 'చతుర' అంతగా ఆకట్టుకోలేకపో యింది. సంక్రాంతి లక్ష్మిని ముఖచిత్రంగా ఇచ్చి ఉంటే బాగుండేది. నవల 'కన్నయ్యవాడలో క్రీనీడలు' బృందావన విశేషాలను కళ్లకు కట్టిన ట్లుగా చూపించింది. రాధేశ్యామీల జీవితాల గురించి తెలిసి బాధ కలిగింది. జ్ఞానపీఠ గ్రహీత ఇందిరాగోస్వామిని పరిచయం చేసిన తీరు అభినందనీయం. ఉన్నతమైన పురస్కా రాలు పొందిన రచయితల వివరాలు ప్రతి మాసం తెలియజేయాలని కోరుతున్నాం.

– *కరణం శివానందరావు, కర్నూలు*

# కచోరీ!

**తయారుచేసే పద్ధతి :**

వెడల్పాటి గిన్నెలో మైదాపిండి, నెయ్యి లేదా నూనె, తగినంత ఉప్పు, నీరు కలిపి ముద్దగా చేసుకోవాలి. దానిపై మూత పెట్టి పక్కన పెట్టాలి. కూర తయారుచేయడానికి ముందుగా బఠానీలను తగినన్ని నీళ్లుపోసి ఉడకబెట్టాలి.




## కావలసిన పదార్థాలు

* మైదా - 1 1/2 కప్పులు
* నూనె - వేయించడానికి సరిపడా
* పచ్చి బఠాణీలు - 1 1/2 కప్పులు
* జీలకర్ర - 1/2 టీస్పూన్
* పచ్చిమిర్చి అల్లం పేస్టు - 1 1/2 టీ స్పూన్లు
* ఇంగువ - 1/4 టీస్పూను
* సోంపు పౌడర్ - 3/4 టీ స్పూను
* కారం -1/2 టీ స్పూను
* కొత్తిమీర తురుము - 1 1/2 టీస్పూన్లు
* గరమ్ మసాలా - 1/2 టీస్పూను
* ఆమ్‌చూర్ పౌడర్ - 3/4 టీస్పూను
* శనగపిండి - 2 టేబుల్‌స్పూన్లు
* నూనె లేదా నెయ్యి - 1 1/2 టేబుల్‌స్పూన్లు
* ఉప్పు తగినంత

ఒక పాన్‌లో నూనె వేసుకుని కాగాక జీలకర్ర వెయ్యాలి. చిటపటలాడుతుండగా పచ్చిమిర్చి అల్లం కలిపి నూరిన ముద్ద, ఇంగువ వేసి కలపాలి. తరువాత ఉడికించిన బఠానీలు వేసి ఐదు నిమిషాలపాటు ఉంచాలి. తరువాత కారం, కొత్తిమీర తురుము, సోంపు, గరమ్ మసాల, ఆమ్‌చూర్ పౌడర్ వేసి కలపాలి. ఓ ఐదు నిమిషాల తరువాత మంటను తీసి కూర చల్లారనివ్వాలి. ఇపుడు ముందుగా కలిపి ఉంచిన మైదాను కావలసిన సైజులో తీసుకుని మందంగా, పూరీలా వత్తాలి. తగినంత కూరను దానిమీద ఉంచి అంచులను ఒక దగ్గరగా తెచ్చి నీటి తడితో కలపాలి. ఇపుడు అరచేతులతో ఆ ముద్దను కొద్దిగా వత్తి నూనెలో బంగారు రంగు వచ్చేవరకూ వేయించాలి. సన్నని మంట మీద ఎక్కువసేపు కాలిస్తే కచోరీలు కరకరలాడుతూ, రుచిగా ఉంటాయి.

**జతపరచండి జవాబులు :** 1-బి, 2-డి, 3-ఎఫ్, 4-ఎ, 5-హెచ్, 6-సి, 7-ఇ, 8-జి

## చిట్కాలక్ష్మి

* ఒక్కోసారి ఎంత కడిగినా ఫ్లాస్క్ వాసన వస్తూ ఉంటుంది. అలాంటపుడు మజ్జిగతో కడిగి ఆపైన నీటితో కడిగితే వాసన ఇట్టే పోతుంది.
* పిండివంటలు చేసేటపుడు నూనె పొంగుతుంటే, ఒక తమలపాకును నూనెలో వేసి, కాసేపుంచి తీస్తే నూనె పొంగకుండా ఉంటుంది!



అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**బొంతా పద్మావతి**

పాత స్టేట్ బ్యాంక్ పక్కన,
నరసన్నపేట,
శ్రీకాకుళం జిల్లా
పిన్ : 532421

## చతురంగం - 46 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ప | రం | ■ | 2 వి | 3 నా | 4 య | 5 కు | డు | ■ | 6 రా |
| ల | ■ | 7 రా | జ | కు | మా | రి | ■ | 8 కా | మా |
| 9 పు | 10 త్ర | జ | య | ■ | య | ■ | 11 ఏ | పు | ల |
| ■ | 12 యో | ధ | ■ | 13 స | మా | 14 ధా | నం | ■ | యం |
| 15 బ | ద | వి | 16 క | ■ | ■ | ర | ■ | 17 లం | ■ |
| 18 కా | శి | ■ | 19 ర | 20 కా | లు | ■ | 21 వ | చ | 22 నం |
| యి | ■ | 23 ఆ | వా | లు | ■ | 24 భా | వి | ■ | ది |
| ■ | 25 కో | వ | లం | ■ | 26 స్వా | మ | భ | 27 వం | ■ |
| 28 దో | స | కా | ■ | 29 ఆ | గ | డు | ■ | 30 ద | 31 ధి |
| 32 మ | ల | య | మా | రు | తం | ■ | 33 ఘ | నం | గా |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. జి.ఎస్. శ్రీనివాసరావు, బొబ్బిలి, 2. పి. దేవసేనమ్మ, హైదరాబాద్, 3. తిప్పావఝుల తులశమ్మ, ఈస్ట్ ఆనందబాగ్, 4. తేలు క్షీరసాగర్, కాజీపేట, 5. డా. సి. జనార్దన సింగ్, నల్లకుంట, 6. డి. ప్రవళిక, హన్మకొండ, 7. టి. ఉషశ్రీ, దగదర్తి, నెల్లూరు జిల్లా, 8. నియాజ్ అలీ, ఉప్పరపల్లి, హైదరాబాద్, 9. యు. విజయశేఖరరెడ్డి, కూకట్‌పల్లి, 10. పి. శుభ, బంజారాహిల్స్, 11. ధరణి పద్మాసన, నల్లకుంట, 12. జి. ప్రభాకర్‌రావు, మల్లాపూర్, 13. ఎస్. శ్రీనివాసమూర్తి, కుప్పం, 14. అడపా సత్యనారాయణ బాబ్జి, కూకట్‌పల్లి, 15. కన్నేపల్లి నారాయణమూర్తి, జీడిమెట్ల, 16. టి. లక్ష్మీకుమారి, మచిలీపట్నం, 17. గుర్రాల పద్మావతి, విశాఖ, 18. వేదుల నరసింహమూర్తి, గుడిమల్కాపూర్, 19. ఓలేటి కస్తూరి, పార్వతీపురం, 20. దేవళ్రాజు వెంకట నరసింహారావు, చైతన్యపురి, హైదరాబాద్, 21. ఎం. రామచంద్రరావు, నల్గొండ, 22. పుల్లె ఎల్.వి.కె. మహేశ్, మియాపూర్, 23. బి. రామ మోహనరావు, సరూర్‌నగర్, 24. సి.జి.యస్. రావు, ఎ.ఎస్. రావునగర్, 25. కె. శైలజ, ఇ.సి.ఐ.ఎల్., 26. ఉడాలి భాస్కరయ్య, చెన్నై, 27. కె. వేంకట తిమ్మాజీరావు, పరవాడ, 28. యు. చిట్టిబాబు, హైదర్షాకోట్, 29. సంజీవిగారి నాగశ్వేత, బెంగళూరు, 30. విన్నకోట పద్మావతి, సఫిల్‌గూడ, 31. గోగాడ వెంకటసింహాచలపతిరావు, కర్ణాటక, 32. తోకల నారాయణరావు, మచిలీపట్నం, 33. అత్తిలి కస్తూరిభాయి, తిరుపతి, 34. పాలకుర్తి సుధీర్‌కుమార్, మాదాపూర్, 35. పేర్వేల దేవి పవన్‌కుమార్, మణికొండ, హైదరాబాద్, 36. పట్టిసపు శేషగిరిరావు, విశాఖ, 37. జి. శోభ, తిరుపతి, 38. బి.సురేష్‌బాబు, పేరాల, 39. పొన్నపల్లి వెంకటప్పయ్య, నూజివీడు, 40. శివలెంక మాధవి, మెహిదీపట్నం, 41. పప్పు కామేశ్వరరావు, అమలాపురం, 42. మద్దూరి లక్ష్మిరాజ్యం, ఎర్రగడ్డ, 43. మొక్కపాటి లలితా త్రిపురసుందరి, కర్నూలు, 44. వారణాసి విజయలక్ష్మి, పొడగట్లపల్లి, తూ.గో. జిల్లా, 45. సి. భారతి, మన్సూరాబాద్, 46. గరికిపాటి కృష్ణమూర్తి, కడప, 47. వి. రమాదేవి, బెంగళూరు, 48. మొహ్మద్ ఖాసిం, కల్లూరుగూడెం, ఖమ్మం జిల్లా, 49. చింతపల్లి నాగేశ్వరరావు, విజయవాడ, 50. డి.వి.ఎ. హిరణ్మయి, విశాఖ, 51. వి.వి. సత్యనారాయణ శెట్టి, తిరుపతి, 52. శిష్టా పద్మానవీన్, జనగామ, 53. తొయ్యేటి వెంకటసూర్యం, విశాఖ, 54. సిహెచ్.వి.ఎన్.ఎల్. రాజేశ్వరి, కర్ణాటక, 55. అరుంధతీ చంద్ర, కరీంనగర్, 56. ముదిగొండ అరుణరేఖ, ఎల్.బి. నగర్, 57. బచ్చు లక్ష్మి, కొత్తగూడెం, 58. గరిమెళ్ల సత్య, హైదరాబాద్, 59. యు. రాఘవేంద్రదాస్, ఉత్తనూరు, మహబూబ్‌నగర్ జిల్లా, 60. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 61. కొత్తపల్లి స్వరలయ, చీరాల, 62. ఎస్.టి.పి. కృష్ణమాచార్యులు, నాగోలు, 63. గండ్లూరి బలరామశాస్త్రి, మల్లాపూర్, 64. వి.ఆర్.కె. అల్లమరాజు, కాట్రేనికోన, 65. జె. విజయలక్ష్మి, ట్రూప్‌బజార్, 66. కొక్కెరగడ్డ అన్నపూర్ణ, మానేపల్లి, 67. పి.బి. సీతాదేవి, నరసాపురం, 68. కొక్కెరగడ్డ శ్రీదేవి, అమలాపురం, 69. చాగంటి త్రిలోకనాథం, విశాఖ, 70. పిడూరి శ్రీదేవి, నెల్లూరు, 71. వి.వి. నరసింహారావు, విజయవాడ, 72. అవధూత అన్నపూర్ణ, నల్లగండ్ల, రంగారెడ్డి జిల్లా, 73. కె. రఘుపతి, అల్వాల్, 74. మల్లిడి శ్యామలారెడ్డి, కొంకుదురు, తూ.గో. జిల్లా, 75. కణుగుల వేంకటరావు, శ్రీకాకుళం, 76. ముడుంబ సీత, భద్రాచలం, 77. తటవర్తి రామకృష్ణ, తాళ్లగడ్డ, 78. కె.వి. దుర్గామోహనరావు, వనస్థలిపురం, 79. రామకూరు లక్ష్మి, శ్రీకాకుళం, 80. గొడవర్తి శ్రీనివాసు, పెదపళ్ల, తూ.గో.జిల్లా, 81. బద్దెపూడి లక్ష్మీసుశీల, చీరాల, 82. బసా రామారావు, యర్రవరం, తూ.గో. జిల్లా, 83. గరికిపాటి చైతన్యకృష్ణ, కాకినాడ, 84. కె. చంద్రశేఖర శర్మ, నంద్యాల, 85. ఎం. వసంత, బోరబండ, 86. పెద్ది దత్తాత్రేయ, రేచిని, ఆదిలాబాద్ జిల్లా, 87. కె. వాణి, విశాఖ, 88. జె. సుజాత, నెల్లూరు, 89. ఆర్. బాలాజీరావు, మియాపూర్, 90. కె. నాగభూషణం, మౌలాలి, 91. కె. వాణి, తిరుపతి, 92. అల్లూరి ఉమ, సింగరాయకొండ, ప్రకాశం జిల్లా, 93. తోకల విష్ణువర్ధన్, ఇంకొల్లు, ప్రకాశం జిల్లా, 94. కొల్లూరి నాయుడమ్మ, ఇంకొల్లు, 95. ఏటుకూరి శ్రీనివాసరావు, మచిలీపట్నం, పరుచూరి భవానీదేవి, గుంటూరు, 96. గాలనాథభట్ల కామేశ్వరీ తాయి, పాలకొల్లు, 97. జె. రాజగోపాలరావు, ఎ.ఎస్.రావు నగర్, 98. నార్నె మౌనికా చౌదరి, ఇంకొల్లు, 99. జి. లక్ష్మీకాంత్, నర్సీపట్నం, విశాఖ జిల్లా, 100. కె.వి. భారతి, పాకాల, 101. ఎ. శారద, హబ్సిగూడ, 102. కె. అశోక్, మన్సూరాబాద్, 103. బి. నేహారెడ్డి, అక్కాయపల్లి, కడప జిల్లా, 104. పి. అనురాగ్, ఏలూరు, 105. శీతేపల్లి లక్ష్మీకామేశ్వరి, విజయవాడ, 106. కె.వి.ఎస్.ఎన్. మూర్తి, హైదరాబాద్, 107. ఎం. భ్రమరాంబ, విజయనగరం, 108. బి.డి. శ్రీచందన, నందిగామ, 109. పి.వి. సుబ్బాలక్ష్మి, వైజాగ్, 110. ధవ్వూరి సుధాదేవి, హైదరాబాద్, 111. పి. సుజాత, గుంటూరు, 112. పాలగుమ్మి విశ్వనాథం, ఒంగోలు, 113. గురజాల వరలక్ష్మి, ఉచ్చిలి, తూ.గో. జిల్లా, 114. ఎస్. మణిమేగలై, తిరు *(..128లో)*

# చతురంగం - 47 ఆధారాలు

**అడ్డం**

1. శ్రీకృష్ణుని తమ్ముడు (3)
3. స్త్రీ (3)
5. దండనం (2)
7. ఇంగ్లీషు కారణం (3)
8. ఎదురుచూపు (4)
9. 'దిక్కులు చూడకు రామయ్య' దర్శకుడు (3)
11. తిరగబడిన త్రాసు (3)
13. బొరియ, రంధ్రం (3)
16. అలసట (3)
18. ఆంగ్లంలో మరమ్మతు (3)
19. ఇంద్రనీలమణులు (3)
21. పూయడం (2)
22. దుర్మార్గం, చెడ్డపని (3)
24. వెచ్చాలు అమ్మేవాడు (3)
27. సరాసరి (3)
28. ప్రసవం (3)
30. సముద్రం (4)
32. 'లేవు'కు వ్యతిరేకం అటునుంచి (3)
34. శాంతి చిహ్నం (3)
35. మాటలు నేర్వగల పక్షి (3)
36. 'కలిమి'కి వ్యతిరేకం (2)

**నిలువు**

1. సత్యవంతుడి భార్య (3)
2. అర్జునుడి పేర్లలో ఇదొకటి (3)
3. తమ్ములు (4)
4. అడ్డం 3 మరో రూపంలో (3)
5. 'ట్రైనింగు'కు తెలుగు (3)
6. రెప్పపాటు కాలం (2)
10. రాముడి సైన్యం (3)
12. జావకు, రొట్టెలకు పనికొచ్చే ఒకరకం తృణధాన్యం (3)
14. బాలచందర్ 'మరోచరిత్ర' నాయిక (3)
15. గౌరవం, మర్యాద, ప్రతిష్ఠ (3)
16. తెలుగులో 'రేర్' (3)
17. పవిత్రం (3)
20. రాత్రికి వ్యతిరేకం గందరగోళం (3)
21. జగన్నాథక్షేత్రం (2)
23. రాక్షస పాత్రలకే కాదు రచయితగా ప్రసిద్ధి (4)
25. ప్రియమైన, స్తుతిపరమైన పద్యాలు (4)
26. శరీరం (2)
27. దండ (2)
28. వేడి, సెగ (2)
29. భూమి (3)
30. పాపను పిలవండి (2)
31. ఏడురోజులు ఒక – (2)
33. తలకిందుల స్వప్నం (2)

(127వ పేజీ తరువాయి...)

పతి, 115. టి. సత్యనారాయణ మూర్తి, ఖమ్మం, 116. కె.ఎ.ఎస్. భుక్త, శ్రీకాకుళం, 117. గన్ని సుశీల, తణుకు, 118. దేవరకొండ లక్ష్మీవిమల, విశాఖ, 119. కె. మోహన్, బెంగళూరు, 120. ఎస్.ఆర్.కె. మూర్తి, విజయవాడ, 121. కంచర్ల శ్రీనాథులు, నరసాపురం, 122. అనంతుల స్వరూపరాణి, గుంటూరు, 123. కె. లక్ష్మీనారాయణ, నిజామాబాద్, 124. పులికంటి రాజేశ్వరరావు, హైదరాబాద్, 125. కె. వెంకట బ్రహ్మమ్మ, బాపట్ల, 126. లింగబత్తుల భవ్యశ్రీ, హైదరాబాద్, 127. కోలా సత్యనారాయణ, విశాఖ, 128. ప్రతాపురం రామానుజాచారి, హనుమకొండ, 129. గుఱ్ఱపు పురుషోత్తం, హనుమకొండ, 130. కాకర్లమూడి కృష్ణప్రసాద్, తణుకు, 131. పి.వి. రంగాచార్యులు, వనస్థలిపురం, 132. కంజర్ల అనంతాచార్యులు, జగిత్యాల, 133. సి. అల్వాల్ రెడ్డి, సరూర్‌నగర్, 134. టి. వెంకట్రాంనర్సయ్య సౌమ్య, మహబూబాబాద్, 135. ఇయ్యుణ్ణి రోహిణి, తణుకు, 136. సౌదామిని నాగరాజన్, విశాఖ, 137. ఎ. రామకృష్ణ, గాజులరామారం, 138. యస్. జమీలాబేగం, కర్నూలు, 139. అద్దంకి శ్రీరామచంద్రమూర్తి, రామంతాపూర్, 140. కె. కృష్ణయ్య, కల్వకుర్తి, 141. ఎ.వి. శివారెడ్డి, యర్రగుంట్ల, 142. ఆంధ్ర అచ్యుతరామయ్య, తణుకు, 143. డా. తూములూరి పార్థసారథి, హైదరాబాద్, 144. సిహెచ్.ఎ. నరసింహం, బెంగళూరు, 145. సి. నిర్మల, తిరుపతి, 146. సూరి నాగరాజు, రామవరప్పాడు, కృష్ణా జిల్లా, 147. కనకల అప్పారావు, విజయవాడ.

# చతురంగం - 47

**రూ.150/- బహుమతి** గడువు తేదీ : ఫిబ్రవరి 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | | 4 | ■ | 5 | 6 |
| | ■ | 7 | | | ■ | 8 | | | |
| 9 త్రి | 10 | | ■ | 11 | 12 | | ■ | | ■ |
| ■ | | ■ | 13 | | | ■ | 14 | ■ | 15 |
| 16 | | 17 | ■ | ■ | | ■ | 18 | | |
| | ■ | 19 నీ | | 20 | ■ | 21 | | ■ | |
| 22 | 23 | | ■ | 24 | 25 చా | | ■ | 26 | ■ |
| ■ | | ■ | 27 | | | ■ | 28 | | 29 |
| 30 | రా | 31 | | ■ | 32 | 33 | | ■ | |
| 34 | | | ■ | 35 | | | ■ | 36 | |

పంపినవారి పేరు: ------------------------------------------

వయసు (      ) చిరునామా : ----------------------------------

------------------------------------------------------------

------------------ పిన్ : ------------ ఫోన్ : ------------------

**నిబంధనలు**

✦ చతురంగాన్ని ఇదేపేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ✦ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు.

చిరునామా : చతురంగం చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 040 - 23318181, Ext : 6658, 6532

# మాకూ భాగం కావాలి!



'అమ్మా! మాకు ఒక్కమాటైనా చెప్పకుండా ఇల్లు ఎలా అమ్మకానికి పెడతావు? డబ్బంతా అన్నయ్య కూతురికేనా? ఈ ఇంట్లో మాకు భాగం లేదా? తాతల నాటి ఇల్లు. మాకూ హక్కుంది' ఇల్లు బేరం పెట్టిన తల్లిమీద కట్టలు తెచ్చుకున్న కోపంతో కేకలు వేశారు కొడుకులు మన్మథరావు, లక్ష్మణరావు.

'అన్నయ్య వ్యాపారంలో నష్టపోయి చేతిలో డబ్బులేక దిక్కుతోచని స్థితిలో ఉన్నాడు. ఈ సమయంలో పిల్లపెళ్లికి ఏదైనా సాయం చేయకపోగా భాగాల కోసం పోట్లాడ్డానికి వస్తార్రా.. త్రాష్టుల్లారా? పొలంలో వాడి భాగం కూడా మీకు అడక్కుండానే రాసిచ్చాడు కదరా?' విరుచుకుపడింది తల్లి.

'ఉమ్మడి ఖర్చుతో చదువుకున్నాడు కనుకే పొలం వదులుకున్నాడు. ఇల్లమ్మిన డబ్బులో భాగం ఇవ్వకపోతే మేం సంతకాలు పెట్టం. తర్వాత మీ ఇష్టం' మన్మథరావు, లక్ష్మణరావు తల్లికి వార్నింగ్ ఇచ్చి వెళ్లారు!

తర్వాతేమైంది? శేషమ్మ పెద్దకొడుకు తన కూతురి పెళ్లి ఎలా చేశాడు? భూమి సూర్యుని చుట్టూనే కాదు డబ్బు చుట్టూ కూడా తిరుగుతుందన్న తిలక్ మాటలకు అక్షరసాక్ష్యం వాణిశ్రీ నవల **నిజరూపాలు**

**చతుర మార్చి కానుక!**

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, No. 7-134 / 1& 2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally - 500 072, R.R District, Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. Toll Free Help line No. 18004258888 (Hyd.), www.eenadu.net.

**CHATURA** Telugu Monthly, Dt. of publication : Febuary 1, 2015.
Postal Regd No. HD/ 965/2015-2017 RNI No. 32186/1978